ఓమ్.

# The Necessity of Caste.

# వర్ణావశ్యకత

ఈగ్రంథము

మనహిందూదేశమునకు ప్రాచీనములై, ముఖ్యావశ్యకములైన వర్ణాశ్రమములను గూర్చి హిందువులలో ననేకులు దురభిప్రాయులై యుండుటం జూచి—
హిందువులెల్లరకు నుపయోగించుటకై యనేక సద్గ్రంథముల ననుసరించి—


కాకినాడవాస్తవ్యులైన

గో|| స|| హరిశ్చంద్రరావుగారిచే

విరచింపబడినది.



మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

సి. హెచ్. కైలాసరావు బ్రదర్సు వారి
కమలా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి
గ్రంథకర్తచే ప్రకటింపబడియె.

1911.




వెల రూ 0-10-0

# —:CONTENTS:—

## ——:విషయసూచిక:——

# Is Caste System indispensable or not?

## వర్ణభేదమగత్యమా కాదా?

---

శ్రీభరతఖండంబున వర్తమానకాలంబున బహుళవాదంబున కాస్పదములైన విషయంబులలో జాతిభేదమనునది యొకటియై యున్నయది. జాతిభేదంబు నెట్టులైన నిర్మూలింపజేయ గంకణము గట్టుకొనిన యభినవ సంస్కర్తలు సనాతనమతావలంబుల ముఖంబులనుండి పొరబాటుననైనను తమకనుకూలించు మాటలు వెలువడు నేమోయన్న యాసతో నలు దిక్కుల జాగరూకతతో జూచుచున్నారు.

పూర్వమొక గణపత్యుత్సవసమయంబున శ్రీబాలగంగాధర తిలకను పండితవర్యుడు జాతిపద్ధతినొక యుపన్యాసంబున ఖండించెనని కొందఱు భ్రమపడుచున్నారు. పునహానగరవాసుండైన యీపండితప్రకాండుని యాశయము జాతిభేదముండ నేకూడదని కాదనియు, జాతిభేదమున్న మాత్రమున నొకజాతివారిం కొకజాతివారిని ద్వేషించుట శాస్త్రవిరుద్ధమని యాతని నిజమైన యభిప్రాయమనియు, నానమ్మకము. అట్లు కాదన్నను, తన్మాత్రముచే జాతిపద్ధతి కేమియు గీడుమూడ నేరదు. తిలకువంటివారు వేయిమంది కలసినైనను వర్ణపద్ధతి హిందూమతసమ్మతము కాదని ధ్రువపరచుటకు శక్తులు కారని ముమ్మాటికి నమ్మవలయు.

సంఘమభివృద్ధినందుటకు గాని నిలుచుటకుగాని పలువురు పలువిధంబులైన వృత్తులవలంబింపక తప్పదని అందరునంగీకరించిన విషయమే కదా. ఐననేవృత్తి నెవ్వరు బూనవలెనన్న యంశంబున వాదంబు మెండుగా నున్నది. ఏవృత్తియందభినివేశము కల్గి తదనుగుణగుణగణంబు తనయందు గలదో యావృత్తి యందే మనుష్యుడు ప్రవేశింపవలెనా? లేక, తన తలిదండ్రులే జాతియని లోకములో బ్రసిద్ధి కలదో యాజాతికనుగుణమైన వృత్తిని స్వీకరింపవలెనా? "శ్రేయాన్స్వధర్మో విగుణః" అని భగవద్గీత చెప్పుచున్నది, అట్టి

స్వధర్మమన నేమి ? తనతలిదండ్రుల జాతికనుకూలమైన ధర్మమనియా లేక
తనగుణసంఘాతముచే సూచింపబడిన ధర్మమనియా భగవద్గీతల యభిప్రా
యము ? అటులనే పరధర్మమన నెయ్యది ? వర్ణవిషయమై భగవద్గీతలచ్చటి
చ్చట ముచ్చటించినప్పటికి స్పష్టముగా వర్ణభేదపరికల్పనావకాశంబుగా
ముచ్చటింపక పోవుటచేఁబలువురు పలువిధంబులగు నభిప్రాయముల నీయు
చున్నారు. భాష్యములైనను సంశయము లడగునట్లీ విషయమై బోధింపకుం
డుట యెంతయు శోచనీయమని కొందఱు తలంచినను తదర్థమున్స్పష్టముగా
తెలియకుండుటకు జదువరులబుద్ధిజాడ్యమే కారణమనియు నందుకు గ్రంథ
కారులలోపము లేదనియు దోచుచున్నది.

పోనిండు. స్వగుణకర్మంబులనుసరించియే వర్ణభేదమైనచో బ్రాహ్మణ
త్వమునకు యోగ్యములైన గుణంబులు లేనప్పటికి బ్రాహ్మణులని యేలసమస్త
గ్రంథములలో గొందరు పరిగణింపబడిరి ? అటులనే క్షత్రియులకుండవలసి
న ధర్మములు లేక పోయినను క్షత్రియులుగా గొందఱేల వర్ణింపబడిరి ?
బ్రహ్మజ్ఞానముచేతనే బ్రాహ్మణత్వముసిద్ధించు నేని బ్రహ్మజ్ఞానధురీణుండగు
జనకమహారాజేల బ్రాహ్మణ పదవాచ్యుడు కాకున్నవాడు? బ్రాహ్మణధర్మం
బులెన్నియో తనయందు జూపట్టు విదురుండేల శూద్రుడుగనెంచబడినా
డు ? సూతుండేలశూద్రుండు ? ఇట్టి యుదాహరణంబుల నందోపలండములు
గా హిందూమత గ్రంథములనుండి ప్రదర్శింపవచ్చును. వీనినిబట్టి పుట్టుక
తోడనే జాతియేర్పడుచున్నదనివ్యక్తమగుచున్నదిగదా.

లోకములో నైనప్పటికి బుట్టుక ననుసరించియే వర్ణవైచిత్ర్యము వ్యవహరిం
పబడుచున్నది. శూద్రునిబిడ్డనేశూద్రుడనుచున్నాము, వర్ణముగుణాధారమైన
చో శిశువుయొక్క వర్ణనిర్ణయ సమర్థంబులగు గుణంబులు మనకేమి గోచరం
బులగుచున్నవి ? ఐనను శూద్రునిశిశువును శూద్ర జాతిలో జేర్చుట కే
మి యాధారము కలదు ? ఐనప్పటికి నిట్టివ్యవహారము ప్రపంచము
న బ్రసిద్ధంబేకదా.

మరియు, వర్ణనిర్ధారణము గుణవైచిత్ర్యమే కారణమని వాదించు నార్యసామాజికులు మొదలైనవారలు కూడ మీది యేవర్ణమనియడిగినప్పుడు వారివారిగుణంబులేవర్ణంబులని సూచించుచున్నవో యావర్ణములవారమని యుత్తరమీయక తమతలిదండ్రుల వర్ణములనే తమవని చెప్పుకొనుచున్నారు. ఇట్లేల జెప్పవలె? దీనికి వర్ణము పుట్టుకచే నేర్పడుచున్నదని యొప్పుకొనుటయైన కారణము కావలెను ? లేదా తమమతసిద్ధాంతముల విస్మృతియైనగావలెను.

ఇంకొకవిషయమువిచారింతము. ఉపనయనమేవర్ణమునకు శాస్త్రము విధించుచున్నది? బ్రాహ్మణక్షత్రియ వైశ్యవర్ణములు కల్గిన త్రైవర్ణ్యమునకేకదా ! ఎవరు త్రైవర్ణ్యము లోని వారో యెవరుశూద్రవర్ణములోని వారో నిర్ణయించుటకుసాధనమేమి ? వారివారిగుణవిశేషముల బట్టి యందురా, యుపనయనమునకు యుక్తకాలమైన యెనిమిదవయేట వారివారిగుణంబులు వర్ణంబులను నిర్ధారణ జేయుటకు దగినంత స్ఫుటముగానావిర్భవించునా? వారికట్టియవస్సునందు బాల్యకంబుగా చాపల్యంబు ప్రధానముగా గలమర్కటమునొక్క గుణంబుతే చూపట్టుచున్నవి. గుణములబట్టియే వర్ణనిర్ణయము చేయవలసియున్నట్లైతే వారి మర్కటచేష్టలననుసరించి వారిని మర్కటవర్ణములోనివారని చెప్పట యుక్తముగాని బ్రాహ్మణాదివర్ణములలోనివారని నుడువుట న్యాయ్యంబు కాదుగదా. మఱియు; ద్విజులకుపనయనము విధించుచున్నది కాని మర్కటవర్ణము వారి కెక్కడ నుపనయనము శాస్త్రము విధించుటలేదు. అట్టియెడ ఉపనయన సంస్కారమే యసంభవమై తద్విధివాక్యంబునిరర్థకంబు కావలసివచ్చును. కాని శాస్త్రానర్థక్యంబు నంగీకరించుట సమంజసంబుకాదు. కాబట్టి గుణమునుబట్టి వర్ణమనువాదము రద్దు.

మఱియు, బాల్యమునందు ఏడవయేట మనుష్యులగుణంబులు స్ఫుటంబుగా గాకపోయినను బీజరూపంబుగావ్యక్తంబులగును గాన వానిని బట్టియే యెవ్వరెవర్ణ ముగ్గలవారైయుండవచ్చునో నిశ్చయించుటకు వీలున్నదందురే.

అది సరికాదు. ఏలనన నాగుణంబులైనను స్ఫుటంబుగా నావిర్భవించునవికా వు. బీజంబులు స్ఫుటముగాగాన్పించును కాబట్టి వానిని చూచి యవియేయే వృక్ష జాతులను గారణంబులో యూహించుటకు శక్యంబగు. కాని గుణంబు లు దృష్టికిగోచరంబులుకావు. మఱియు, బీజంబులు స్థిరాకారంబులు. కాని గుణంబులస్థిరాకారంబులు. బాల్యమునం దేగుణంబులు కలవో ముందునుఅట్టి గుణంబులేయుండునని చెప్పుట యనుభవవిరుద్ధము. బాల్యావస్థయందలి గు ణంబులకంటె భిన్నంబులైన గుణంబులు కలవాగల నెంపర విను చున్నాము ! కాబట్టి బాల్యగుణంబుల ననుసరించి వర్ణవిచక్షణ జేయగలమనుట తప్పు.

బాల్యగుణంబుల ననుసరించియే కాదు. ఇతరావస్థలయందలి గుణంబు ల ననుసరించియైన నది దుర్ఘటమే. గుణకర్మంబులు చంచలంబులు గనుక నవి జీవితకాలమంతయు నస్థిరస్వరూపంబులే. బాల్యమునందున్నంత చాం చల్యము లేనప్పటికి నితరావస్థలందు నవి చాంచల్యస్వభావయుతంబులే. అట్టి యస్థిరస్వరూపంబులగు గుణకర్మంబుల నాధారముజేసికొని వర్ణవిభాగము జేసినయెడల నట్టివిభాగంబు నట్టిదేయైయుండును. సత్వరజస్తమోగుణంబులు ప్రతినిమేషంబునను మారుచుండుటకలదు. సత్వగుణమున్నప్పుడు బ్రాహ్మ ణుడైతే రజోగుణమున్నప్పుడు క్షత్రియుడు తమోగుణమున్నప్పుడు శూద్రు డు. యీవిధముగా నొక్కమనుష్యుడే బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రజాతుల క్రింద వరుసగా మారుచుండవలసివచ్చును. మఱియు, రజోగుణప్రధానమైన క్షేత్రధర్మమావహించినది గదాయని రణరంగమునకేగినచో నప్పుడు హఠా త్తుగా సత్వగుణమావహించినచో రణభూమినుండి విముఖుడు కావలసివచ్చు ను. ఎందుచేతనన సత్వగుణము బ్రాహ్మణత్వసూచకంబు; బ్రాహ్మణునకు యుద్ధము త్తమధర్మముకాదు. మఱియు, సత్వగుణముద్రేకించినప్పుడు తన్ను బ్రాహ్మణునిగా భావించుకొని యట్టిగుణమే ప్రధానముగాగలయొక స్త్రీని వి వాహముజేసికొన నిశ్చయించుకొ౧ యీకాబోయెడి దంపతులలో గుణము

లకస్మాత్తుగా భేదించినతోడనే యావివాహానుబంధముగూడ త్రెంపుకోవల
సివచ్చును ; ఎందువల్లననగా సవర్ణములో వివాహానుబంధము ముఖ్యమని శా
స్త్రము. కావున గుణవైచిత్ర్యము ననుసరించి వర్ణవిభాగము జేయజూచుట
యెంతయు హాస్యాస్పదంబు.

ఇటులనే కర్మవైచిత్ర్యము ననుసరించియు హాస్యాస్పదంబే. ఏలన
ప్రతిమనుష్యుండును యుక్తాయుక్తకర్మంబుల బహుప్రకారముల బహుసమ
యములందు జేయుచుండును. ఒకమనుజుండీదినంబున దేవపూజాదికంబు జేసి
నమాత్రాన బ్రాహ్మణుండై రేపటిదినంబున బ్రహ్మహత్యాదికంబు జేసినతోడ
నే బ్రాహ్మణుండుకాడనుట యుక్తియుక్తము గాకపోవుటయకాక అనే
కంబులైన యనర్థంబుల దెచ్చిపెట్టును.

ఇంతియకాదు. గుణకర్మపరీక్షణంబుద్వారా వర్ణనిర్ణయము జే
యుటకెవరధికారులు ? ఋషులైనచో ఋషులనెవ్వరు ? వారెందరుండవలె
ను ? వారిసిద్ధాంతములు సత్యములౌనోకావో ? ఎవనిహృదయంబు వాడెరుంగు
నుగనుక యెవనిమట్టుకువాడే తనగుణకర్మంబుల విచారించి తానే వర్ణమున
కర్హుడో నిర్ధారణజేసికొనవలెనన్నయెడల, బ్రాహ్మణయుక్తగుణంబులు లే
నప్పటికి బ్రాహ్మణుడననియు క్షత్రియయుక్తంబులైన పరాక్రమాదులు లేన
ప్పటికి క్షత్రియుడననియు నీవిధముగా కపటముగా నేదోయైహికలాభము
నకై చెప్పుకొనుచు దిరుగుట తటస్థమౌను. ధారాళహృదయులైన సత్పురు
షు లెవ్వరో కొందరు తప్ప మరియెవ్వరును తాము శూద్రులమని చెప్పుకొన
నే చెప్పుకొనరు.అంతేకాదు. అప్పుడందరును పాలకినెక్కువారేకాని దాని
నిమోయువారు మాత్రముండరు. పాలకి "శిరోభవ వరదోభవ" అన్నట్లున్న
చోటనుంచి కదలదు. ఓహో ! ఈవిధముగా దేశమునందు వర్ణముల నిమిత్త
మై స్పర్థలబెంచి యొకరితో నొకరుతగవులాడునట్లు చేయదలచుచున్నారు
కాబోలు నీసంస్కర్తారమ్మన్యులు.

పుట్టుకతోడనే వర్ణముకూడ ఏర్పడుటచే బ్రజలన్యోన్యము ద్వేషింపు

మ దేశంబును క్షీణదశకు దెచ్చుచున్నారని పేరు మొఱలిడుచున్నారు. గుణ
కర్మంబుల ననుసరించి వర్ణనిర్ణయంబు జేసినయెడల దేశమునకట్టి దుర్దశ రాంప
దని వారియభిప్రాయము. కొంచెము బుద్ధిని వినియోగించి చూచెదరుగాక.
ఎవ్వరు బ్రాహ్మణులు, ఎవ్వరు క్షత్రియులు, ఎవ్వరు వైశ్యులు, ఎవ్వరుశూద్రు
లన్న విషయమైబహువివాదములు కల్గి దేశమంతయు గలహార్ణవంబున మునింగి
పోవునని వేరెరుంగరు కాబోలు. పూర్వకాలంబున విశ్వామిత్రుండు తాను క్ష
త్రియుడయ్యు బ్రాహ్మణు డనిపించు కొనుటకై వసిష్ఠునితో జేసిన ఘోర
యుద్ధంబు పురాణములవల్ల దెలియుచున్నది కదా రాజ్యలక్ష్మిని సమస్తవిష
య భోగంబులను విరాగంబుచే బరిత్యజించి యీశ్వరధ్యాన సాగరనిమగ్నుం
డై యీశ్వరసృష్టికి బ్రతిసృష్టి జేయుసామర్థ్యంబు సంపాదించినవాడైనను
విశ్వామిత్రుండు వర్ణవిషయమై యభిమానంబును పోగొట్టుకో జాలక లోకము
లనెల్ల గంపము నొందించు సంగర వ్యాపారంబున బ్రవేశించెను. ఇకవిషయ
సౌఖ్యములందు మునిగి తేలుచున్న పామర జన సముదాయంబు జాతివిషయ
మై పట్టుదల లేనివారై యుందురనియు కలహంబులకు దూరముగానుందురని
యు నెట్లూహింప శక్యంబగు ?

మఱియు నెంతో ప్రయాసపడి తుదకు బ్రహ్మఋషి తుల్యు డనిపించు
కొనునప్పటికి బ్రహ్మాండమైనది, అట్టియెడ నీనాటి జనశిఖామణులు బ్రహ్మక్షత్రి
య వైశ్యశూద్రులని సులభముగా ననిపించుకొనశక్తులౌదురు కాబోలు !
శక్తులౌదురేని, వారిబ్రహ్మత్వము మఱియేయితర వర్ణత్వముగాని పేరుమాత్రాని
కంటేకాని వాస్తవముకాదని చెప్పసాహసింపుచున్నాను.

మఱియు; విశ్వామిత్రునికిగల తపస్సామర్థ్యము విషయ వైముఖ్యము
గలవా రెవ్వరో వారితరవర్ణోత్కృష్టులయ్యు బ్రాహ్మణులనిపించుకొన బ్రయ
త్నించిన బ్రయత్నించుకొందురుగాక. అట్లుకాక కొంచెము భగవద్భక్తి గ
ల్గినతోడనే బ్రాహ్మణుడననియు కొంచెము యుద్ధాభిలాష వొడమినతోడ
నే క్షత్రియుడననియు; కొంచెము వాణిజ్యవ్యాసంగము గలిగిన తోడనే వై

శ్వపచనియు ; కొంచెము దాసత్వార్హత్వము కనుపడినతోడనే శూద్రుడన నియు భావించుకొనుట మాత్రము చెల్లుమాట.

ఇంతేకాదు జాతివిషయమై యహంకృతివహించుటపామరత్వ సూచ కంబు. వివేకియైనవాడును తాన్ జాతియని వివాదింపబోడు. మఱియు, నవీన సంస్కర్తలు సమస్తజాతులు సమాన గౌరవంబులని యేకదానియూహించుచు న్నారు. అట్లైనచో మరలజాతిమీదికి వీరేలధ్వజ మెత్తుచున్నారో. తెలియ కున్నది. జాతులు యథార్థముగా సమాన గౌరవంబులు కానిచో, జాతిని నిర్మూలనంబునకై ప్రయత్నించుట హేతుయుక్తంబగు. అట్లుగాక, అవిస మానగౌరవములనియేమసమంగీకరించినయెడల, మఱలవాని పనిమట్టముగు జేయ బూనుకొనుటకేవలమువివేకము. కాబట్టియన్నిజాతులు ప్రపంచస్థితికి సమాన ముగానే యవసరమనియు కాబట్టియొక జాతిగౌరవ సహితమై యింకొకటి గౌరవహీనము గాక సమస్తజాతులు సమానమైన గౌరవమేకలవనియు ప్రజ లకు మనము బోధించుట న్యాయ్యముకాని జాతులే యుండగూడదనుట స మంజసము కాదు.

మఱియు వర్ణభేదము సనాతనధర్మచోదితమైనట్లింకొక విషయమును బట్టి కూడ తెలియవచ్చుచున్నది. బీజప్రాధాన్యముచే దండ్రివర్ణముననుసరించి పుత్రునివర్ణము నిర్ధారింపవలెనని శాస్త్రమునందచ్చటచ్చట నుచ్చరింపబడిన ది. స్వగుణవిశేషంబుననుసరించియే వానివర్ణము నిర్ధారణీయమైనయెడల, నీ విధముగా దండ్రివర్ణమపేక్షించి పల్కుటకు గతంబుండనేరదు. అప్పుడు తండ్రివర్ణము నెత్తుటకే యవకాశముండదు.

ఇకనొకవిషయము విచారింతము. బ్రాహ్మణకులోద్భవుడొకడు సత్వ గుణుడైనయెడల వానిని సద్బ్రాహ్మణుడనియు బ్రాహ్మణోత్తముడనియు ; దుర్మార్గుడైనయెడల దుష్టబ్రాహ్మణుడనియు బ్రాహ్మణాధముడనియుమత గ్రంథములందును నాటకాదులందును పిల్చుటకలదు. కేవలసత్వగు ణమే బ్రాహ్మణత్వమును సిద్ధింపజేయునేని బ్రాహ్మణుడనిన జాలదా ?

మరల "సత్" అన్న విశేషణముకూడ ఎందులకు? కాబట్టి సద్బ్రాహ్మణుడ
నుట దోషాశ్రితంబు కావలసివచ్చునుగదా? అటులనే, దౌష్ట్యమున్నప్పుడు
బ్రాహ్మణత్వమున కవకాశము లేదన్నచో, దౌష్ట్యమున్నవానిని కేవలము
దుష్టుడనిన జాలదా? దుష్టబ్రాహ్మణుడని మరల బ్రాహ్మణుడనుట కవకాశ
మెక్కడిది? ఐనప్పటికి బ్రాహ్మణాదులకు యుక్తంబులైన గుణంబులు లేని
వారలనుకూడ బ్రాహ్మణాదులనుట మతగ్రంథములన్నన్నట్టుచున్నది, కాబట్టి
తద్వాక్యముల సమర్థించుటకు బుట్టుకతోడనే వర్ణమేర్పడునని యంగీక
రింపకతీరదు.

పురాణాదులందచ్చటచ్చట నొకజాతియందు బుట్టుక గలవాడైనను
మరి యొకజాతివాడుగా నెంచబడుట కలదందురేని అది గౌణపరముగాగాని
ముఖ్యముకాదు. సింగమునకుండుగుణంబులు కల్గినమనుష్యుని సింహమనుట యె
ట్లో బ్రాహ్మణగుణంబులు కల్గినశూద్రకులసంజాతుని బ్రాహ్మణుడనుటయు
నట్లే. పురుషుని సింహమనిన యథార్థముగా సింహమెట్లుకానేరడో శూద్రుని
గాని క్షత్రియునిగాని వైశ్యునిగాని బ్రాహ్మణుడనిన నిజముగా బ్రాహ్మణుం
డుకాజాలడు,

అటులనే యొకవర్ణమువాడింకొక వర్ణమువాడు కాజాలడు. కాజాలు
నేని తెనాలిరామలింగని నల్లకుక్క తెల్లకుక్కగా మారియుండును! ఒకవ
ర్ణము శునకము మరియొకవర్ణముశునకముగా మారుట యెట్లనుభవవిరుద్ధమో
యొకవర్ణముమనుష్యుడింకొకవర్ణము మనుష్యుడుగా మారుటయునట్లె! ఏలనన
వర్ణమీశ్వరసృష్టముగానిమానవసృష్టముగాదు. కాబట్టియే సత్వగుణప్రధాను
లైనప్పటికి విదురాదులుబ్రాహ్మణులుగాబరిగణింపబడియుండలేదు. విదురుం
డు సచ్ఛూద్రుడుగా నెంచబడినాడు. కాని బ్రాహ్మణుడుగామాత్రము పి
లువబడలేదు. గుణవర్ణవాదమంగీకరించినచో నిట్టియాచారమున కవకాశముం
డనేరదు. కాబట్టి జన్మననుసరించియే వర్ణమని సిద్ధాంతము.

ఇంతయేల, బ్రాహ్మణాది వర్ణంబులకుశాస్త్రవిహితంబులైన శమముమొ

పైనగుణంబు లేనరియందున్నచో వారిం దావర్ణంబులని భావించుకొనిన నది యొకవిధంబుగా బాగుండును. తద్గుణహీనులు మాత్రిమట్లనుకొనుట సరిపడదు. కించిద్గుణసాదృశ్యముచే నేకత్వము నిరూపించుటకూడ సమాదరణీయంబు కాదు. ఒకటి రెండు బ్రాహ్మణగుణంబులున్నతోడనే యితరకుల సంజాతుండు బ్రాహ్మణుండు గాజాలడు. కాజాలునేని, మనుష్యతుల్యంబులగు గుణంబులు కొన్నిగలవుగాన వానరంబు మనుష్యజాతిలో జేరవలసివచ్చును; అటులనే గుడ్లగూబ కోకిలకావలసివచ్చును ; అటులనే బ్రాహ్మమతము వేదాంతమతము కావలసివచ్చును; అటులనే ఆర్యమతము వైదికమతము కావలసివచ్చును. కాబట్టి గుణవర్ణవాదమును వాదముకొరకంగీకరించినను గుణవిశేషముల బాగుగ గుర్తించి వాని ననుసరించి వర్ణవిభాగము సరిగాజేయుట దుష్కరము. కొందరాధునికులు వేదకాలమున (Vedic period) వర్ణభేదముండి యుండలేదని నుడువుచున్నారు. కాని వేదభాగమైన పురుషసూక్తములోని "బ్రాహ్మణోస్యముఖమాసీత్" అనుమంత్రమందును వేదములోనే యితరస్థలములందును వర్ణభేదము వక్కాణింపబడియుండుటవలన నీవాదము పడిపోవుచున్నది.

వేదకాలంబున జాతిభేదంబు లేదని వాదముకొరకంగీకరించినప్పటికి అది జాతిద్వేషులకేమియు ననుకూలించదు. వేదకాలమున లేదుగనుక నిప్పుడు నుండకూడదనుట కేవలము యుక్తిబాహ్యము: భూతకాలంబున లేనిది వర్తమానకాలంబున నుండగూడదాయేమి ? వేదకాలమున ధూమశకటాదులు లేవుగనుక నింకెప్పుడునవియుండకూడదనుటమంచిదా ? వేదకాలమున లేని దిప్పుడు నుండగూడదనిన, నప్పుడీ యసంగతసిద్ధాంత దూషితంబులగు నార్య సమాజ బ్రహ్మసమాజంబు లుండి యుండలేదు ; అట్టి యభినవమతంబులు మాత్రమిప్పుడేల సమాదరణీయంబులగు ? కాబట్టి యేదియైనను పూర్వకాలంబున లేకపోయినప్పటికి బురుషార్థ సాధనంబైనచో నిశ్శంకముగా స్వీకరింప నగు నని తేలుచున్నది.

ఇప్పుడు, జాతిభేద మేవిధంబున బురుషార్థసాధనంబని శంక పుట్టవచ్చును. కొందరు జాతిభేదముచేతనే మనదేశము నానాటికి క్షీణత్వమునంది పరరాజులకనేకులకు లోబడవలసివచ్చినదని నుడువుచున్నారు. కాని వీరి మాటసత్యమునకు కడుదూరము. స్వదేశపండితులే కాక పాశ్చాత్యపండితులు కూడ ననేకులీవర్ణభేదమూలముననే హిందూదేశము పేరునకైన నిలచినదనియు లేనియెడల దక్షిణపు నమెరికా మొదలగు దేశంబులందలి యిండియనులు మొదలగువారివలెనే దేశమునకుసంభవించిన దండయాత్రలు మొదలగు నరిష్టపరంపరచే కేవలము నామమాత్రావశేషులైయుందురనియు సిద్ధాంతము జేయుచున్నారు. అనిష్టమైనదానితలపై సకలానర్థములకారణమును ద్రోయజూచుట మనుష్యస్వభావమేకదా!

హిందూదేశచారిత్రంబు నిష్కళంకమైన చిత్తంబుతో జదివినవాడెవ్వడును దానిప్రకృతపుహీనస్థితికి గారణంబు జాతియొక్కకట్టుబాటని చెప్పసాహసింపడు. ప్రజలకు వైరంబులుస్వభావజనితంబులు కావునహిందువులొకరితో నొకరు కలహించుచుండినమాట సత్యము; కాని తద్వైరములన్నియు జాతిభేదప్రకల్పితంబు లనుటమాత్రము సాహసము. రాజ్యలోభత్వము మొదలగు కారణములచే గల్గిన వైరములసంఖ్యకంటెజాత్యభిమానమువలనసంభవించిన వైరముల సంఖ్యబహుస్వల్పతరమని హిందూదేశ చరిత్రప్రకటించుచున్నది. ప్రతివైరమును జాత్యభిమాన జనితమనుట గొప్పతప్పు. మతవిషయమై హూణదేశమునందెన్ని ఘోరయుద్ధములు జరిగెనో యెవ్వడెరుంగడు ? హూణదేశముకంటెను జర్మనీమున్నగు దేశములకంటెను హిందూదేశమునందు జాతివిషయమైకాని మతవిషయమైకాని మిక్కిలితక్కువగా యుద్ధములు సాగినవన్నమాట ముఖ్యముగా జ్ఞాపకముంచుకొనవలసినది. అట్టిదేశములెవ్వియు దన్మూలముచే బాధుకాలేదని యొప్పుకొనినయెడల నిక హిందూదేశము మాత్రము జాతిమతవైరములమూలమున హీనస్థితి వచ్చినదనిచెప్పుట యెట్లు న్యాయసమ్మతమగును ? అంతియ కాదు. హిందూదేశమునొక్క యొకరా

జధాని (Presidency.) యొక్క స్వల్ప భాగమాత్ర పరిమితమైన యిం
గ్లాండు దేశమునందే మతాభిమానమువలన ననేకఘోర యుద్ధంబులై రక్త
ము నదీరూపంబున బ్రవహించియుండగా నీకమహాభూఖండంబనదగుభరత
ఖండంబునందెంత భయంకరంబుగా రక్తస్రావమై యుండవలెనో మఱల జె
ప్పవలయునా ? కాని అట్లుకాలేదు ! హిందువులుసర్వ మతానుకూలురని స్థి
రీకరించుటకీయంశంబె చాలును. కాబట్టి మన దేశముయొక్క హైన్యము
నకు జాతిభేదపద్ధతి కారణమనుట మూఢజనప్రలపితమై యు
న్నదికాని వేరుకాదు.

కొందరు మనుష్యాధములు జాతినే పురస్కరించుకొని దురభిమాన
ముచే నితరజాతులవారిని ద్వేషించి వారితో గలహించుచుందురన్నమ ట
మరచినవాడగాను. వారిదుష్టప్రవర్తనంబునకు రాక్షసస్వభావ జనితదుష్టప్రవృత్తి
యే కారణంబుగాని జాతిభేదంబుగాదు. పరులద్వేషించుస్వభావము గలమా
నవరాక్షసుడు జాతిభేదమున్నను లేకపోయినను ద్వేషింపకమానడు. ద్వేషిం
చునుగాన జాతిభేద ముండగూడదనుట యసమంజసంబు. దుర్మార్గుడు పరుల
ధనాధిక్యము జూచి యోర్వలేడు. తన్మాత్రమునవారు ధనంబు బరిత్యజింపవ
లెననుట న్యాయ్యంబగునా ? అటులనేయొకజాతి వాడింకొక జాతివానిని
చూచిద్వేషింపవచ్చును ; తన్మాత్రమున జాతినే విసర్జింపుమనుట యుక్తమా?
కానేరదు. పురుషులకుద్వేషోద్బోధకం బేదికాదు ? ప్రపంచమున ధనధా
న్యాదుల తారతమ్యమును అధికారాదుల తారతమ్యమును దుర్జనునిద్వేషాన
లంబునుద్దీపింప జేయుచునే యుండును. అట్టితారతమ్యమే శూన్యమైనచో
బ్రపంచవ్యాపారమే సాగకుండును.

ఈజాతిభేదము ప్రపంచమున కేమిలాభము జేయుచున్నదని ప్రశ్నిం
చినయెడల, తద్విహితంబులైన కర్మంబులజేయుటవలన మనుజునిమనంబు
నిర్మలంబై శమదమాదులు సమకూరును. దానివలన జ్ఞానసంపాదనంబునకును
తన్మూలమున మోక్షసుఖప్రాప్తికిని యోగ్యుండగును. ఇది పారమార్థికంబైన

ప్రయోజనంబు లౌకికంబైన ప్రయోజనంబుకూడగలదు ఎట్లన, నేవర్ణంబున కేధర్మంబులు విహితంబులో యాధర్మంబులాచరించుచుండుటవలన నన్నివృత్తులకై పరువిడనక్కరలేకుండ ఎవరివృత్తులు వారికేర్పడి చిత్తంబునకు శాంతిగల్గి ప్రపంచమునందు జీవనోపాధికై బహుప్రయాసం బక్కరలేకుండ స్పర్ధలు పోటీలుపోయి సుఖజీవనము సంప్రాప్తమగును.

వర్ణవ్యవస్థ లేదేని ధర్మవ్యవస్థ లేకపోవును. అనగా, నేయేధర్మంబు లేయేవర్ణములవారాచరింపవలెనో తెలియకుండును. వర్ణముండినగదా తద్వ్యక్తధర్మంబు లాచరింపగల్గుట! ఒకవర్ణమువాడింకొకవర్ణమువాని ధర్మంబులాచరించుట వర్ణసంకరమందు సంభవించును. అట్లు పరధర్మాచరణంబువలన పైనచెప్పబడిన లౌకికపారమార్థికఫలంబుల బోగొట్టుకొనినవాడేకాక ప్రత్యవాయంబుగూడ బొంది నరకాదులనుభవించునని "పరధర్మోభయావహః" మొదలగు గీతావాక్యములు ఘోషించుచున్నవి. అర్జునుండు కూడ "సంకరోనరకాయైవకులఘ్నానాంకులస్యచ" అనుశ్లోకమునందును అటుపిమ్మటి రెండుశ్లోకములందును వర్ణసంకరము నరకాదుల దెచ్చిపెట్టునని వక్కాణించియున్నాడు. కాబట్టి స్వధర్మము నాచరింపక పోవుటయు బరధర్మము నాచరించుటయు గూడ దుఃఖావహంబులని స్పష్టము. ఇట్టిస్వపరభేద జ్ఞానంబునకు వర్ణభేదమాధారమని కూడ స్పష్టము.

స్వధర్మమనగా స్వస్వభావమున కనుగుణమైన ధర్మమని భగవద్గీతలయందలి 18 వ యధ్యాయములోని 59, 60 శ్లోకముల వర్ణనభిప్రేతంబని చెప్పుదురేని, అట్టిస్వస్వభావము స్వవర్ణముననుసరించియే యున్నదని ప్రత్యుత్తరమిచ్చుచున్నాము. ఏధర్మమాచరణీయము? స్వధర్మము. స్వధర్మమననేమి? తనస్వభావములేక ప్రకృతిచే సూచింపబడినధర్మము. అట్టిస్వస్వభావము దేనిచే సూచింపబడినది లేక దేనికనుగుణమైనది? స్వవర్ణముచే సూచింపబడినది; స్వవర్ణమునకనుగుణమైనది. స్వవర్ణమన నెయ్యది? తన జనకుని వర్ణమేదో అదే. కాబట్టి స్వభావనియతమైన ధర్మమన

స్వకుల నియమప్రమైన ధర్మమని యర్థము.

వంశములో పూర్వులచే నేధర్మమాచరింపబడినదో యాధర్మమే యాధునికులుకూడ నాచరింపవలెననుటకు ప్రమాణమేమని ప్రశ్నించినయెడల, నితిహాసపురాణాదులలో బలుతావుల రాజఋషిచరిత్రములందు "నీపూర్వులీవిధముగా నడచినవారు; నీవును వారిమార్గముననే నడువవలసినది. వారీధర్మములనాచరించెడువారు. నీవునట్టి ధర్మములనే యాచరింపవలెను" ఈవిధముగా ఋష్యాదు లితరులకు బోధించినట్లు చూపట్టుచున్నది. ఒకజాతిలోని పూర్వులాచరించిన ధర్మములను మనముకూడ నాచరించుట యుక్తమని గ్రంథముల యభిప్రాయము కాదందురేని, పైనుదాహరింపబడిన బోధనలవంటి బోధనలుండుటకు గతంబుండ నేరదు. హిందూమతమునకు బర్యాయపదమైన సనాతనధర్మముయొక్క వ్యుత్పత్త్యర్థమే ప్రాచీనమార్గానుసరణీయతనుదృఢీకరించుచున్నది. మరియు, స్వవర్ణ సూచితమైన ధర్మముగాక; స్వస్వభావ సూచితమైన ధర్మమే అనుసరణీయమని యభిప్రాయమున్నచో "నీస్వభావము నిన్నేకర్మ జేయుమని ప్రేరేపించిన నాకర్మనే చేయుము." అని చెప్పుటకుమారుగా " నీవర్ణమునకే కర్మయుచితమో యాకర్మంబె చేయుము. నీవర్ణములో బ్రముఖులైన ప్రాచీనులేధర్మంబుల నాచరించెడివారో ఆధర్మంబులనే నీవుకూడ ఆచరింపుము" అని చెప్పుట కెంతమాత్రము అవకాశముండదు.

అంతియకాదు. నీస్వభావము ప్రకారము నడచుకొమ్మనుట కేవలమనవసరము. అట్లు విధించుట నిరర్థకంబు. ఎవనిస్వభావము ననుసరించి వానికి బ్రవర్తించుట నైసర్గికంబు. కాబట్టిస్వభావమైనదానినే శాస్త్రము మరలవిధించుచున్నదనుట కడు నవివేకము. ప్రకృతి ప్రేరేపించిన మార్గమవలంబించుట ప్రాణులకు స్వభావమే యైనప్పటికి తన్మార్గము మంచిదికాదను బుద్ధిచే విసర్జించునేమోయన్న భయముచే నట్లు విధించుట యుపపన్నమందురేని, అదిసరికాదు. ఏలన నొకనికి దొంగిలించుట స్వభావమైనప్పుడు తత్స్వభావమునకు విరోధముగ నడువవలసినదికాబట్టి దొంగిలింపుమని శాస్త్రము విధిం

చునట్లగును. జారత్వము స్వభావచోదితముగనుక జారత్వము యోగ్యమే యని యు పాణిపీడనంబు స్వభావచోదితంబుగనుక బాణి పీడనంబు కర్తవ్యమే యనియు శాస్త్రము సమ్మతించినట్లగును. ఇంతకంటె నీచమైన బోధనే శాస్త్రంబును చేసియుండదు. హిందూమతము నిజముగా నిట్టి తుచ్ఛమతమే గ్యైనచో దానిని ఖండించి నిర్మూలము జేయుట కెవ్వని బుద్ధియుద్యమింపదు?

ఇకనొక విషయము విచారింతము. స్వభావమేప్రమాణమైనయెడల, మఱలవేదములేల, స్మృతులేల, పురాణములేల? వీనితో నేమిప్రయోజనము? తద్గౌరవమెక్కడ? తత్పఠనప్రయాసంబెందుకు? “సత్యంవదధర్మంచర” మొదలగువిధు లేప్రయోజనంబుకలవి? నాస్వభావమునన్న సత్యమ్ము బలుకుమని ప్రేరేపించినప్పుడు స్వభావముప్రకారమే! ప్రవర్తించుట విధియైనయెడల మఱలసత్యము బలుకుమను విధివాక్యమున కేమియవకాశంబుకలదు? ఆవిధివాక్యములు తత్ప్రకార మాచరించువారలకే యుద్దేశింపబడినవందురేని, తత్ప్రకారమాచరించని స్వభావముకలవారల నుద్దేశించి పల్కినవాక్యములు మాత్రమేల లేకపోవలె? స్వభావముగానే సత్యముపల్కి ధర్మము చరించెడువానికి మరలనట్లు విధించుటవల్ల నేమిఫలము? ఎవని యిష్టముప్రకారము వానిని బ్రవర్తింపుమనిన నికవిధి నిషేధముల యేర్పాటునకవకాశముండదు; విధినిషేధములున్నప్పుడు స్వచ్ఛందప్రవృత్తికవకాశముండదు.

మఱియు భగవద్గీతల యందలి 16 వ యధ్యాయములోని 23, 24 శ్లోకములు కార్యాకార్యవ్యవస్థితి యందుశాస్త్రముప్రమాణముకాని యిచ్ఛప్రమాణముకాదనియు శాస్త్రవిధిని తిరస్కరించియు స్వేచ్ఛగా సంచరించువా డైహికపారమార్థికసుఖభ్రష్టు డగుననియు విస్పష్టముగ సాక్షాత్కరింపుచున్నవి.

ఆశ్లోకము లేవియన, శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్యవర్తతే కామకారతః। నససిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిం॥23॥ శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ। జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం కర్మకర్తు

మీమాంసా సూ॥24॥'

'స్వభావనియతం కర్మకుర్వన్నాప్నోతికిల్బిషం' అనుగీతావాక్యము
చెప్పిన స్వభావముచే ప్రేరేపింపఁబడిన హింసాదికర్మంబు లాచరింపఁబడి
నను ప్రత్యవాయప్రదంబులు కావందురేని అది యనుపపన్నంబు. ఏలన,
దానితరువాత నున్న శ్లోకమునందలి 'సదోషమపినత్యజేత్' అనువాక్యము
నం దభిప్రేతంబైన దోషము సామాన్యమైన హింసవంటి దోషముగాక, వర్ణ
విహితమైన కర్మనంటుకొనిన దోషము. దోషము రెండువిధములు. అధ
ర్మముగా నొకనిహింసజేయుటవంటిది యొకవిధమైన దోషము. ధర్మయు
ద్ధమందు శతృవులకు హింసజేయుటవంటిది యింకొకవిధమైనదోషము. ఈ
రెండవవిధమైనదోషము నాల్గువర్ణములకు విహితంబులైన కర్మంబులందును
కలదు. ఎట్లన, బ్రాహ్మణునకు యజ్ఞాదికర్మంబులందు హింసారూపమైన
దోషము; వైశ్యునకును శూద్రునకును కృష్యాదికర్మంబు లందునుదోషము క
లదు. ఐనప్పటికి నట్టిదోషము వారి కంటుసేరదు. విషములో బుట్టినపురుగు
నావిషమెట్లు బాధింపసేరదో అవిధంబుననే వర్ణమునఁ బుట్టినవానికి త
ద్విహితములైన కర్మలయొక్క దోష మంటుసేరదు. ఈపైదృష్టాంతము శంక
రాచార్యులవలన గీతాభాష్యమునం దీయబడినది. కాఁబట్టి భగవద్గీతాదుల
నాధారము జేసికొని వర్ణము జన్మతోడనే కల్గినది కాదనియు గుణవిశే
షములచే నేర్పడుచున్నదనియు జెప్పవీలులేదు.

కొందరు, గుణవిశేషములనుబట్టివర్ణభేద మనిసిద్ధాంతముజేయుటకు
వజ్రసూచికోపనిషత్తును ప్రమాణముగా నిచ్చుచున్నారు. అది సరికాదు.
ఎందువల్లననఁగా తద్వాక్యములు కేవలము బ్రహ్మజ్ఞానులశ్లాఘించుటకును బ్ర
హ్మజ్ఞానసంపన్నుల సర్వోత్కృష్టతనిరూపించుటకు నుద్దేశింపఁబడినవేకాని
వర్ణము జన్మతో నారంభమగునను అంశంబును విరోధించుటకుగాదు. ఈవి
షయము బ్రాహ్మణేతరుల నిర్ధారణ జేయక మొదటినుండి తమవర్గమును
బ్రాహ్మణప్రశంసనే చేయుచుండుటచేతను తమకుబ్రాహ్మణులన నిట్టివార

ని సిద్ధాంతీకరించుటచేతను సువ్యక్తమగుచున్నది. అట్లుకాదని వాదము కొర
కంగీకరించినను, తత్సిద్ధాంతము సర్వశ్రుతిస్మృతిపురాణేతిహాసవిరుద్ధముగా
న దుర్బలమై నిరసనీయమైనది. అనేక ప్రబల ప్రమాణము లుండఁగా, త
ద్విరోధార్థబోధకం బగువజ్రసూచికోపనిషత్తొక్కటియే ప్రమాణముగ
నెట్లంగీకరింప నగును? ఇంతేకాదు. వజ్రసూచికోపనిషత్తు కలకత్తానగరం
బున నొకవంగదేశీయపండితునిచే నూతనముగా వ్రాయఁబడెనని ఇండియను
రివ్యూ (Indian Review) యొక్క యొకసంచికయందు వ్రాయఁబడె
ను. ఈమాట నిజమైనయెడల నది ప్రాచీనోపనిషద్గణములోఁ జేరనేరదు;
కాన తత్ప్రామాణ్యం బుత్తమపక్షములోనిది కాఁజాలదు.

కొందరు పండితమ్మన్యులు, సృష్ట్యారంభమున వర్ణభేదము లేదు,
కాఁబట్టి యిపుడు కూడ జాతిభేద ముండకూడదని నుడువు చున్నారు.
పూర్వకాలమున గొంత కాలము జాతిభేదము లేదనియంగీకరించినను పిమ్మ
ట నదివచ్చుటకుఁ గారణమేమని వీరి నడుగుచున్నాను. నాఁటికి హిం
దూమతము క్షీణదశకు వచ్చి తత్సంప్రదాయము ప్రజలు మఱచినవా రౌట
చేతను దురహంకారాదులు వారికిఁ బ్రబలుటచేతను చాతుర్వర్ణ్యము జనిం
చిన దందురేని అట్లుభావించుట కేమియాధారము కలదు? ఏమియు నా
ధారము లేనిమాటసత్యము; కాఁబట్టి మనప్రతిపక్షు లూహించిన హేతు
వంగీకార్యముకాదు. మఱి నిజమైన హేతువిశేషం బేదియని ప్రశ్నించిన
యెడల, ప్రజల కనుభవము క్రమక్రమముగా నతిశయించి ప్రపంచస్థితికి
జాతిభేద మగత్యమని దృఢముగా దోఁచుటచేతనని ప్రత్యుత్తరం బిచ్చు
చున్నాను. లేదా, ప్రప్రథమంబునఁ బ్రజలు సత్వగుణప్రధానులైయుండి
బ్రహ్మధ్యాననిమగ్నులై ప్రపంచవిస్మృతి కలవారై యుండుటచేత వర్ణవిభా
గ మవసరముగాఁ గాన్పింపక, క్రమక్రమముగా రజోగుణ తమోగుణ ప్ర
ధానులైన పురుషులు బయలుదేరుటచేత నప్పుడు వర్ణవిచక్షణ మవసరము
గాఁ దోఁచి అట్లుచేసిరనియు నూహింప నగు. కాఁబట్టి సృష్టియొక్క యా

రంభమున గొంత కాలము వర్ణవ్యవస్థ లేదన్నను తదనంతరమది సనాతన ధర్మసంప్రదాయవిస్మృతి వలన వచ్చియుండక వర్ణవిభాగము లాభకరమని దృఢముగా ననుభవము మీద దెలియుటవలన మాత్రమే వచ్చియుండెనని సిద్ధమగుచున్నది.

కొందరు నవనాగరికులు వర్ణపద్ధతి పూర్వకాలంబునకుఁ దగియున్నను స్థితిగతులు మిక్కిలి మారినందువలన వర్తమానకాలంబునకు సరిపడదని పలుకుచున్నారు. కాని అట్లు కాదు ఏలన, కొన్ని స్థితిగతులు మాత్రమే మారినవిగాని సమస్తస్థితిగతులు మారలేదు. ఏస్థితిగతులు పూర్వకాలమునందుండగా వర్ణాశ్రమాచారపద్ధతు లగత్యంబులు నత్యాజ్యంబులై యుండెడివో ఆస్థితిగతు లిప్పటికిని కలవు; కాన వర్ణాశ్రమాచారపద్ధతు లిప్పటికి నగత్యంబులు నత్యాజ్యంబులే. వర్షఋతువు వచ్చినది కాఁబట్టి భోజనము చేయఁగూడదనిగాని ఆకాశమెత్తుగానున్నది కాఁబట్టి స్నానముఁ జేయఁగూడదనిగాని చెప్పుట యెంతరసవంతముగా నుండునో ఆంగ్లేయుల పరిపాలన కాఁబట్టి వర్ణభేదముండఁగూడదనిగాని విద్యుచ్ఛక్త్యాదులజ్ఞానము కలుగుచున్నది కాఁబట్టి వర్ణమక్కరలేదనిగాని నుడువుట అంతరసవంతముగా నుండును. కొబ్బరిచెట్టెందుకెక్కితివి. దూడగడ్డికొరకు? వర్ణాశ్రమపద్ధతుల నెందుకుఁ దృణీకరించితివి? ఆంగ్లేయులప్రభుత్వముగనుక! ఇట్టితర్కము సరిపడదు, కాఁబట్టి వర్ణాశ్రమపద్ధతులుండుటకు వీలుచిక్కనివ్వని ప్రతిబంధకము లెవ్వియు దేశమునందు లేవని సిద్ధము.

కొందరు నవనాగరికులు లోకములో నితరదేశములలో నెక్కడను కాన్పింపక హిందూదేశమునందుమాత్రమే వర్ణాశ్రమపద్ధతులు చూపట్టుచున్నవి గనుక నవి భగవన్నిర్మితములుగాక కేవల మనుష్యనిర్మితము లనియు అందువలన వానిని పరిత్యజింప వలెననియు వాదించుచున్నారు. కాని వీరి వాదము నిలువదు. ఇతరదేశములందెక్కడలేనే లేవని చెప్పుట మొదటితప్పు. ఎందువల్లనన, పశ్చిమఖండదేశములలోని జనులయందుకూడ పూర్వకాలము వర్ణ

భేద ముండియున్నట్లు పాశ్చాత్యపండితులు సప్రమాణముగ వెల్లడించుచు న్నారు. పారశీకులం దిప్పటికి వర్ణాశ్రమచిహ్నంబులు కొన్నికొన్ని కాన్పిం చుచున్నవి. ఇతరదేశములందెచ్చటలేవుగనుక హిందూదేశమందు నుండగూడ దనుట కెండవతప్పు. అట్లనుట యాంగ్లేయదేశమునందుసింగములు లేవుగను క నాఫ్రికాదేశమందు నుండగూడదనున ట్లుండును. భూభాగముయొక్క ఉ త్తరప్రదేశములందు ఆరోరాబోరియాలిస్ (Aurora Borealis) అనువిచి త్రజ్యోతిదృశ్యముగాదు గనుక లాప్లాండు మొదలైన ప్రదేశములందును ఉండకూడదు కాఁబోలు! కాఁబట్టి యితరదేశములం దెక్కడను జాతిభేద ము లేకున్నను హిందూదేశమం దుండుటన్యాయసమ్మతమే. మరియు, సమ స్తదేశములందును లేక హిందూదేశమునందు మాత్రమే యున్నది కాఁబట్టి భగవన్నిర్మితము కాదనుట మూఁడవతప్పు. ఏలన, పైదృష్టాంతములలోని సిం గమును, ఆరోరా బోరియాలిసును భగవన్నిర్మితములు గాకపోవలసివచ్చును కాని యవిభగవన్నిర్మితములే. చాతుర్వర్ణ్యంబును భగవన్నిర్మితమే ఇందుకు ప్రమాణములు 'బ్రాహ్మణోస్యముఖమాసీత్' ఇత్యాది శ్రుతులు 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం' ఇత్యాదిస్మృతులును కలవు. మరియు భగవన్నిర్మితముకాదు. గనుక త్యాజ్య మనుట నాల్గవతప్పు. ఏలన నప్పుడుగృహము మొదలైనవి ఈశ్వరసృష్టిలోనివిగాక మనుష్యసృష్టిలోనివిగనుక వాని నన్నిటినిత్యజింపవల సివచ్చును. ఈశ్వరసృష్టమైనమాత్రాన స్వీకరణీయమైనచో సర్పవృశ్చికా దు లీశ్వరసృష్టిలోనివి. కాఁబట్టి స్వీకరణీయంబులే కావచ్చును! లాభకర మాకాదా యనుసంశము బాగుగ మనకుపయోగించును; కాన యీశ్వరసృష్ట మా మానవసృష్టమా యనివిచారించుట అంతగా నుపయోగించదు. కాఁబట్టి భగవన్నిర్మితము కాదని యంగీకరించినప్పటికి వర్ణభేదము మనచేఁ బాటింపఁ బడుటకు యోగ్యమే. మరియు, మనుష్యనిర్మితమైనది గనుక విసర్జనీయమను ట పైహేతువులచేత నే యైదవతప్పు.

కొందరు నవనాగరికులు జాతిభేదము నాగరికత బాగుగాలేనికాలము

న బొడసూపు ననియు నాగరకత మెండుగా గల్గిన యిక్కాలమున నది హా
స్యాస్పదముకాన విడువదగిన దనియు నుడువుచున్నారు. కాని వీరి వాదమే
హాస్యాస్పద మగుచున్నది. వీరినాగరికతయే హాస్యాస్పదంబు. నాగరికతయ
న వీరియభిప్రాయమేమో? పరులవేషభాష లవలంబించి ధూమశకటంబుల
లోఁ బ్రయాణంబుసల్పినమాత్రముననను మధుమాంసాదుల దుష్పూరోదరంబు
లఁ బూరించిన మాత్రమునను సజ్జనధిక్కారంబుఁ గావించుచు మేమేసర్వజ్ఞు
ల మని విఱ్ఱవీగుచు యథేచ్ఛముగా విహరించుచుండిన మాత్రముననను నాగరిక
త వీరి కబ్బినది కాఁబోలు! ఆధునికులమైనమనము ప్రకృతిశాస్త్రమునం దెంత
(కాదు, ఈప్రకృతిశాస్త్రపాండిత్యమైనను మనకులేదు పాశ్చాత్యులకుగాని!)
పరిశ్రమజేసినవారమైనను అధ్యాత్మశాస్త్రమునందు మనపూర్వులు తీసికొనిన
పరిశ్రమలో సహస్రాంశమైన దీసికొనుచుండ లే దనుట నిర్వివాదాంశము
మన ప్రకృతిశాస్త్రనైపుణ్యముమన పూర్వులపారమార్థికశాస్త్రనైపుణ్య
మున కెంతమాత్రము సమానము గాదని నిశ్శంకముగా నొక్కిచెప్పగలను.
పారమార్థిక విషయంబులు లౌకికదృష్టితోఁ జూచిన నెట్లుహాస్యాస్పదంబు
లో లౌకికవిషయంబులు పారమార్థికదృష్టితోఁ జూచిన నట్లే హాస్యాస్ప
దంబులు కాని, పారమార్థికదృష్టియే సత్యనిర్ధారణమందు ప్రమాణము.
వ్యాధిలేని దృష్టియే ప్రమాణము. కాని తిమిరరోగయుక్తమైన చూపుకా
దు. ఆస్తిక్యవిహీనులైన నవనాగరికులు ప్రాచీనుల మతసిబంధనలఁ జూ
చి యపహసింతురు. కాని, ప్రాచీనులకు వీరిచేష్టలే నవ్వుపుట్టించునన్న
మాట యెరుంగరు.

మరియు ప్రాచీనుల యుపదేశంబు లన్నియునాగరికతాశూన్యము
లైనచో తండ్రిమాట కొమరుండు మన్నింప నక్కరలేదు. ఏలన తండ్రిక
న్నకొమరుండు తరువాతఁ బుట్టినవాఁడు గాఁబట్టి యెక్కువనాగరికత గల
కాలమునం దుద్భవించినవాఁడు. అటులనే భగవంతుఁ డున్నాఁ డ
నునమ్మకము పూర్వకాలమునం దుండెడిది కాబట్టి నాగరకతగల యిక్కా-

లంబున నది సమ్మతముకా నేరదు అటులనే నీతిశాస్త్రము (Ethics) ప్రాచీనపురుషప్రణీతము కాబట్టి అది పరిష్కృతజనసమాదరణీయంబుకాజాలదు కాబట్టి జాతిభేదము పూర్వకాలమున బయలుదేరిన దన్న వ్యాజమున నసాగరికతాసూచకం బనితృణీకరించుట యుక్తియుక్తముకాదు. నీతిశాస్త్రము మొదలైనవి శాశ్వతస్వభావము కలవిగనుక నిప్పటికిని ఉపాదేయము లన్నయెడల వర్ణవ్యవస్థయు నట్లే సర్వదా యుపాదేయంబని సమాధానము.

కొందరు, జాతిభేదము లుండుటవలన నన్నివర్ణముల వారు సమావేశమై ఏకీభవించుటకు వీలులేకపోవుటచేత రాజ్యకృత్యంబులం దసమర్థులై స్వరాజ్యమును (Self-Government) పోఁగొట్టుకొందురని వాదించుచున్నారు. కాని వీరివాదము నిరాధారము ఏలన నేకీభావమున కేకజాతిత్వముండితీరవలె నన్నవిషయ మనుభవవిరుద్ధమని దేశచారిత్రలు స్ఫుటీకరింపుచున్నవి. ఏకజాతిత్వ మున్నప్పు డేకీభావము సులభసాధ్య మన్నమాట సత్యము. కాని, ఏకజాతిత్వములేనప్పు డేకీభావ మసంభవ మనుటమాత్ర మనుభవవిరుద్ధము. నిజముగా నసంభవమే యైనయెడల, జర్మనీ మున్నగు దేశములందలి భిన్నజాతులజను లన్యోన్య మేకీభవించి యేకకుటుంబము (Nation) వారై స్వరాజ్య మనుభవించుట కెట్లు వీలుండును? ఐనను జర్మనీ, ఇటలీ, అమెరికా మొదలగు దేశములందలి జనులు పలుతెగలు కలవారైనప్పటికి స్వరాజ్యసంపత్తిగోల్పోయిన వారు కారని చూచుచునేయున్నారముకదా. ఇక జాతిభేదము హిందూదేశమునందు మాత్రము స్వరాజ్య సంప్రాప్తికి ప్రబల ప్రతిబంధక మెట్లు కాఁగలదు?

ఇంతేకాదు, ఏకపంక్తిని భోజనాదులు సల్పినంతమాత్రమునఁ గాని యొకరితో నొకరు వివాహసంబంధములఁ గల్పించుకొన్నంతమాత్రమునఁగాని యైకమత్యము కుదిరి జనులు వైరముల విడిచి యుందురని చెప్పుటకు శక్యము కాదు. ఆవిధముగా నైకమత్యము తప్పక కుదిరిన పక్షమున వర్ణభేదమును మాన్పించుట క్షేమకర మగును. అట్లు కానప్పుడు వర్ణభేదము తీసివేయుట

లాభములేనిపని. ఏకపంక్తినిభుజించుట వివాహసంబంధములఁ గలుపుకొనుట తప్పకయైకమత్యమునే కల్గింపసమర్థములైనచో నొకయింటిలోనే పుట్టిపెరిగిన సహోదరుల కన్యోన్యము గర్భశత్రుత్వ ముండుటకుఁ గతంబేమి? అటులనే, బంధువర్గంబునందెల్ల ననివార్యంబులైన వైరంబులు కల్గి యొకరితో నొకరు పోరాడుటకు కారణంబేమి చెప్పుదము? "Familiarity breeds contempt" అను న్యాయముచొప్పున నన్నివర్ణముల నొకటిగాఁ జేర్చుటవలన నైకమత్యమునకు మారుగా వారిలోవారికి ద్వేషము లతిశయించునేమో!

వర్ణభేదంబు మాన్పించుటవలన దేశమునం దైకమత్యము తప్పక సిద్ధించునని వాదముకొరకంగీకరించినను వర్ణభేదము లేకపోవుటవలన నైకమత్యముమూలముగా స్వారాజ్యసిద్ధియను నశ్వరమైన లాభముకంటె హిందూమతమున కాధారభూతమైన వర్ణపద్ధతి నశించుటవలన దేశమునకు సంభవించెడు స్వారాజ్యసిద్ధిలభింపక పోవుట యనునష్ట మధికతరము కాఁబట్టి జాతిభేదంబుజంపివేయుట శ్రేయస్కరంబుకాదు.

కొందరు పండితమ్మన్యులు, హిందూమతమందలి వేదాంతభాగము మాత్రి మచ్చముగా హిందూమత మనియు వర్ణాశ్రమములతో కూడిన తదితరమైన భాగ మంతయు నిజమైన నిర్మలమైనహిందూమతము కాదనియునూత్నకల్పిత మనియు కాఁబట్టి వర్ణాశ్రమాచారపద్ధతులు పరిత్యజింప వలెననియుఁ జెప్పుచున్నారు. వేదాంతేతరమైన భాగము హిందూమతములోనిది కాదనుట మొదటి కల్ల. నిర్మలమైనది కాదనుట రెండవది. నూత్నకల్పిత మనుటమూడవది. పరిత్యజింప వచ్చుననుట నాల్గవబొంకు. పరిత్యజింప వలెననుట యైదవ దోషము.

హిందూమతము కర్మకాండ జ్ఞానకాండ యనుకాండద్వయసమన్వితమైనదని లోకమునందెల్ల తెల్లమేకదా.

మరియు నీకర్మకాండయందు వర్ణాశ్రమంబు లంతర్భూతంబులైనవన్నవిషయంబు విజ్ఞాతంబేకదా. కర్మకాండస్వీకరణీయమగునా కాదా? స్వీక

రణీయమేని తద్గర్భితవర్ణాశ్రమంబు లెట్లు స్వీకరణీయంబులు కావు? కర్మ
కాండస్వీకార్యము కాదందురేని, జ్ఞానకాండమాత్రమెవ్విధంబున స్వీకరింప
నగును? జ్ఞానకాండ యుపాదేయమందురేని కర్మకాండమాత్రమేలగాకపోవ
లె? కర్మకాండకంటె జ్ఞానకాండ పిమ్మటవచ్చినదికాబట్టిజ్ఞానకాండయొక్క
ప్రామాణ్యమే బలవత్తరమయినదని వాదింతురేనిజ్ఞానముకన్న కర్మప్రథమం
బున వచ్చియుండుటచేత కర్మకాండ జ్ఞానకాండకు సాధనప్రాయమని మా
త్రము చెప్పుటకేమియాక్షేపంబు? కర్మకాండ, జ్ఞానకాండయందు ఖండింప
బడి పూర్వపక్షము చేయబడియున్నందున కర్మకాండ ప్రమాణముకాదందు
రేని వర్ణాశ్రమంబులు ఖండింపబడియుండలేదు గనుకను జ్ఞానోత్పత్తికి బరిక
రంబులుగా బరిగ్రహింపబడియున్నవి గనుకను వానిని పరిత్యజింపవలెననుట
ప్రమాదము. ఇందుకు ప్రమాణములనేకములు కలవు.

కొందరు జాతిభేదపద్ధతి సాంఘికపద్ధతి (Social Institution)
కాని మతసంబంధమయిన పద్ధతికాదనియు నందుచేత జాతిపద్ధతినిమనయి
ష్టానుసారము మార్చుటకుగాని మాన్పించుటకుగాని మనమధికారులమనియు
వాదించుచున్నారు, కాని వీరిట్లు వాదించుటకు మతజ్ఞానశూన్యతయే కార
ణము. మతమన వీరియభిప్రాయమేమో? ఏకేశ్వరుగూర్చియు నంతరాత్మ
గూర్చియు చక్కగా ప్రసంగించుటమాత్రమే మతముగాబోలు! వర్ణాశ్ర
మపద్ధతులు మతసంబంధమయినవి కావని చెప్పుటకేప్రమాణములు కలవో
వానినుదాహరింతురుగాక. ఈపద్ధతులు నాస్తికమతసంబంధమయినవి కాని
మాటనిజము. అటులనే నాస్తికమతసమానములయిన కొన్ని యభినవమతము
లలో సంబంధముకలవి కానిమాటసత్యము. కాని హిందూమతసంప్రదాయ
ములోనివి కావనుటమాత్రము హిందూమతమెరుంగకుండుటయే.

మరియు గుణములేక, వృత్తులవలన వర్ణమను వాదముకూడ సంప్ర
దాయవిరుద్ధము. ఏలన వీరివాదము ప్రకారముపాశ్చాత్యులు రాజ్యతంత్ర
ములందు బహు నేర్పరులుగాన క్షత్రియులని తేలుచున్నదికదా. కాబట్టి

క్షత్రియవంశమునకెల్ల తేజోమణియనదగుచిత్తూరు (ఉదయపురపు) మహా రాజా తనకొమరిలను పాశ్చాత్యులకిచ్చి వివాహముచేసి వారికూతురు దాను వివాహము జేసికొనవలెను ! ఎందుచేత ? రాజపుత్రులు పాశ్చాత్యులును క్షత్రియులేకాబట్టి. మొగలాయీలుకూడ క్షత్రియులేకదా. అయినప్పటికి నుద యపురపు మహారాజు తనపుత్రిక మొగలాయిచక్రవర్తికిచ్చి అతని పుత్రి కను తాను స్వీకరించలేదు. ఇదెందుచేతనో మన ప్రతిపక్షులు సమాధానము జెప్పెదరుగాక. ఇట్టిపని తన క్షత్రియత్వమునకు గళంకము దెచ్చిపెట్టునని యేకదా. జయపురము జాడ్పురము మొదలగు దేశముల రాజులు మొగలా యిచక్రవర్తితో బాంధవ్యముఁ గల్పించుకొనుటచేతనేకదా వారినందరిని ఉదయపురపురాజు కడుహీనులుగాను క్షత్రియాధములుగాను చూచి మొ న్నటివరకును బహిష్కరించెను? పిమ్మటవారు చేసినపని తప్పని యంగీరించి యుదయపురపురాజును క్షమింపుమని వేడుకొనలేదా? తత్పూర్వమైనను, త మచేష్టలచే క్షత్రియవంశమంతయు గళంకితమైనందుకు సిగ్గుపడలేదా? వృ త్తిచేత వర్ణమన్నపక్షమున పైవ్యవహారమేమియు సంభవము కానేరదుగను క జన్మచేతనే వర్ణమని సిద్ధాంతము.

ఇఁకనొకవిషయము విచారింతము. రాజపుత్రులు (రాజపుత్రులు = Rajaputs) క్షత్రియులేనా? క్షత్రియులే. ఇట్టివారికితండ్రియైనరాజుక్షత్రి యుడేనా? క్షత్రియుడే. పుత్రులు క్షత్రియులైనప్పుడు తండ్రికూడ క్షత్రి యుఁడని యెట్లుగ్రహింపనగు? తండ్రికిని పుత్రులకుఁగల పరస్పరసంబంధము బట్టి యవ్విధంబున నూహింప శక్యమన్నప్పుడు, వారివర్ణములు సమానములే యని యంగీరించుట యగుచున్నది. కాఁబట్టి కేవలము గుణముచేతనే వర్ణమ నుట సరికాదని తేలుచున్నది. మరియు, తండ్రివర్ణమే పుత్రులకు వర్తించ దన్నయెడల, (రాజుక్షత్రియుఁడైనను) రాజపుత్రులు క్షత్రియులు కాక పోవలసివచ్చును; క్షత్రియులు కారుగనుక తండ్రియొక్క రాజ్యాదుల క ర్తలు కాకపోవలసివచ్చును; అప్పుడు రాజు లంపరు వనములకేగవలసివచ్చు

ను. కాఁబట్టి ఇట్టివాపము జనకాదులచే సంచితంబైన ధనాదికముకొఱకు పుత్రాదులకుఁగలసహజాధికారమునకు (Right of Inheritance) భంగకరమై యుండుటయేకాక లోకమున కమితసంక్షోభంబు పుట్టించి మహావిపత్తి సంఘటింపఁజేయును.

ప్రశ్న—తులసీదాసు, కబీరు, తుకారాము, నానకు, మీరాభాయి మున్నగు మహాత్ములు మహాత్ముగాంధియును జాతిభేదమును పాటింపక నన్నిజాతులతోను కలసిమెలసి మెలఁగెడువారు. వీరందరు గొప్ప భక్తకోటిలోనివారు. వారి మార్గమును మన మంగీకరించుట మంచిది. కాఁబట్టి వారివలె జాతిభేదముఁ ద్రుణీకరించి యేకజాతివారముగా సంచరించుట కర్తవ్యము.

ఉత్తరము.—ఏకజాతివారమా యన్నట్లైకమత్యము కలిగి ప్రవర్తించుట మంచిదే; కాని యేకజాతివార మగుటకాదు. వారివలెసమదృష్టికల్గి జాతిద్వేషములు లేకుండ సంచరించుట శ్రేయస్కరంబెకాని జాతిభేదముల నశింపఁజేయుటకాదు. మహాత్ము లెవ్వరో కల్లుత్రావెడివారుగదాయని మనముకూడ సురాపానముఁ జేయుదు మేనిమహాత్ముఁ డొక్కఁడు సీసమును కరఁగించి పానముచేసెనని మనముకూడ అట్లుఁ జేయబోయి మూతిని కాల్చుకొనినవారమగుదుము! మహాత్ము లట్టికృత్యములఁ జేసినను తత్ఫలంబు భరించుకొనగల్గిరి. మనమట్లుచేసి తీవ్రఫలమును సహింపఁ గలమా? సహింపఁగలవా రెవ్వరో వారు మహాత్ములవలె విధినిషేధముల సరకుగొనక ప్రవర్తించిన ప్రవర్తించెదరుగాక! పామరజనంబు లవ్విధంబున బ్రవర్తించిన పక్షమున నిషిద్ధకర్మాచరణజనితం బగుదుఃఖఫలం బనుభవింపక తప్పదు.

ప్ర—మహాత్ములకు మాత్ర మట్టిఫలం బేలముట్టదు?

ఉ—కర్మఫలంబును ఖండింప సాధనం బగుభక్తిజ్ఞానవైరాగ్యసామగ్రి వారియందుండుటచేఁ గర్మఫలంబు తమ కంటకుండ నాపుకొనసమర్థులు. సామాన్యజనులం దట్టిసాధనసామగ్రి కలదా?

ప్ర—మహాత్ములమార్గ మవలంబనీయ మనికదా శాస్త్రము. కాబట్టి

[illegible]రిననుసరించి జాతిభేదముల విసర్జింపవలయు.

ఉ—కాదు. ఏమన నాశాస్త్రమే, అనఁగా తైత్తిరీయోపనిషత్తు మహాత్ముల మంచి కర్మలనే మన మవలంబింపవలయుననియు నిషిద్ధకర్మల నెల్ల త్యజింపవలయుననియు విస్పష్టముగ వక్కాణింపుచున్నది. మరియు, పూర్వకాలపు ఋషులు కొందరు మాంసభక్షణము, సురాపానము మొదలైనకృత్యములఁ జేయుచుండెడివారన్నచో వారు నానాఁటికి, తత్కర్మలు ఘోరముల నియు నరకప్రదంబులనియు పాపభూయిష్ఠములనియు ననుభవంబు మీఁద గ్రహించి వానినన్నిటిని నిషేధించిరి. కాఁబట్టి అట్టినిషిద్ధంబులగు లదాచారం బులనే స్వీకరింతుమేని, అమూల్యమైన వారియనుభవ ధనము నవివేకముగా బూడిదలోఁ బోసినవారమగుదుము.

ప్ర—మీరాభాయి మొదలైనవారు కీర్తనలలో జాతిభేదమంతయు సత్యముకాదని నుడివిరి. కాబట్టి విసర్జింపవచ్చు.

ఉ—కాదు. ఏలన నట్టివాక్యములు కేవలము భక్తియొక్క మహిమ నభివర్ణించుట కుపయోగింపఁ బడినవేకాని జాతిభేదమును నిరసించుటకుఁ గాదు. ఇందుకొక దృష్టాంతము నిచ్చుచున్నాను. మీరాభాయి యొకచోట అహింసయేప్రధానమైనయెడల వృకాదు లేమియుహింసఁజేయవుగనుక వాని నన్నిఁటికిని మహాత్ములనవలసి వచ్చును. కాబట్టి యహింస ప్రధానముగాదు. భక్తియే సర్వోత్కృష్టమైనది" అని, చెప్పినది. మీరాభాయి యభిప్రాయ ము అహింస వదలివేయుమనియా? కాదు. మరియేమి? కొంద రహింసనే ప్రధానముగా భావించి భక్తిని తృణీకరించుటకలదు. కాబట్టి అట్లుచేయక భక్తినేప్రధానముగాఁ గైకొనవలయునని మీరాభాయి యభిప్రాయము. ఇట్టి యభిప్రాయమే యితరభక్తులు కలవారని గ్రహింపవలెను. మరియు, భక్తిరసాతిరేకముచే నహింసాదిమహాధర్మంబులు వారికిఁ దృణప్రాయములు గాఁ గాన్పించుట సహజము. కానవా రట్లుచెప్పుట సంభవంబు కాన జా తిభేదము త్యాజ్యము.

కొందఱు, ఆత్మస్వరూప మందరియందు నొక్కటియే కనుక వర్ణభేదము జేయుటచే నాత్మభేదము జేసినట్లగును. కాబట్టి! వర్ణభేద మంగీకరింపరాదని నుడువుచున్నారు. కానివీరివాదముదుర్బలమైనది. ఆత్మతత్వ మొక్కటియేయను పరిజ్ఞాన మేవేదాంతశాస్త్రప్రమాణముచే లభ్యమగుచున్నదో, ఆట్టి ప్రమాణముచేతనే చిత్తశుద్ధికిసాధనముగా వర్ణవ్యవస్థవిధింపఁబడుచున్నది. భగవద్గీతలో “స్వకర్మణా తమభ్యర్చ్యసిద్ధింవిందతిమానవః” (తనకు విహితములైన కర్మలననుష్ఠించుటమూలముగా నీశ్వరుని సేవించుచు మానవుడు చిత్తశుద్ధి బడయుచున్నాడు) అనిచెప్పబడుచున్నది. అపరోక్షానుభూతియను గ్రంథములో శ్రీశంకరాచార్యులు “ స్వవర్ణాశ్రమధర్మేణతపసాహరితోషణాత్ । సాధనంప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయం॥ ” (పురుషులకు, తమవర్ణాశ్రమములకు యుక్తములైన ధర్మముల నాచరించుటచేతను, తపం బాచరించుటచేతను, మరియు నీశ్వరప్రీతికరంబులగు సర్వభూతదయాదులుకలిగియుండుటచేతను, జ్ఞానసంపాదనంబునకు సాధనంబగు వైరాగ్యాది గుణచతుష్టయ ముద్భవించుచున్నది) అని వక్కాణింపుచున్నారు.

మఱియు శ్రీకృష్ణులర్జునునికి క్షాత్రధర్మంబగు ధర్మయుద్ధంబుమానవలదని యానతిచ్చియున్నారు. వర్ణవ్యవస్థచే నాత్మయొక్క యేకత్వమునకు భంగము తటస్థించునని కృష్ణుడు నిజముగా తలచెనేని, వర్ణవిభాగము నంగీకరించి తదనుగుణధర్మాచరణంబు విధించియుండుటకేమియు నవకాశముండకపోవునుగదా. కాని, కృష్ణుడు చాతుర్వర్ణ్యమును సమ్మతించుటయే కాక తద్విహిత కర్మాచరణంబు జ్ఞానోపకరణంబని కూడ బోధించియున్నాడు.

అంతేకాదు ఆత్మజ్ఞానమునకు బ్రమాణగ్రంథములైన యుపనిషత్తులు వేదాంతసూత్రములు మొదలగునవికూడ వర్ణపద్ధతి నెక్కడనిషేధింపకపోవుటయే కాక చిత్తశుద్ధినిసాధించునని కూడ నిరూపించుచున్నవి. కాబట్టి వర్ణవిభాగమద్వైతసిద్ధాంతవిరోధము కాదనుట స్పష్టము

మనప్రతిపక్షులు వేదాంతము సన్న్యాసప్రధానమైనదనియునది వర్ణా

శ్రీమాచారములు! సన్యసింపుమని విధించుచున్నదనియు వాదింతురేమో. వీరి వాదమపడిబోవును. ఏలన, వేదాంతము సర్వకర్మసన్యాసమును విధించుచున్నది; కాని! కేవలము వర్ణాశ్రమవిహితకర్మల సన్యసించుటమాత్రమే కాదు. "త్యజధర్మమధర్మంచ" (ధర్మమును, అధర్మమునుకూడ బరిత్యజింపుము) అనుశ్రుతివాక్యముచొప్పునను, "సర్వధర్మా న్పరిత్యజ్య" (సమస్తధర్మముల ను విసర్జించి) అను గీతావాక్యము చొప్పునను సర్వధర్మపరిత్యాగము శాస్త్రము చేనభిప్రేతంబు. కాని వర్ణాశ్రమ ధర్మ పరిత్యాగమమాత్రమే కాదు. వర్ణాశ్రమములతో సంబంధములేని ధర్మములుకూడ (అనగా, సర్వసాధారణ ధర్మములు) కొన్ని కలవు. అట్టిధర్మములు కూడ విసర్జనీయములని శాస్త్రము యొక్క యాశయము. ఇట్లు, సమస్తధర్మముల బరిత్యజింపసమర్థుడు మాత్రమే వర్ణాశ్రమధర్మ పరిత్యాగమునకు యోగ్యుడు. అట్లుకాక, తనకిష్టమువచ్చినధర్మములను మాత్రమే విసర్జించి తదితరములైన ధర్మములమూలముననే తాము కృతకృత్యుడు కాగలననితలచి వాని నాసక్తితో నాచరించువాడు, వర్ణాశ్రమపద్ధతులనుల్లంఘించుట కధికారి కానేరడు.

ఎట్టివాడు సర్వకర్మసన్యాసముగలవాడన, నైష్కర్మ్యసిద్ధికలవాడు, అనగా జ్ఞానపరిపాకావస్థయందున్నవాడు. కర్మలు లేకపోవుటయే నైష్కర్మ్యము కాఁబట్టి వర్ణాశ్రమకర్మలు చేయకపోవుట చేతనే నైష్కర్మ్యము సిద్ధించుననియు నందుచేత సర్వజనులు వర్ణాశ్రమపద్ధతుల ధిక్కరించుట కధికారులేయనియు వాదించినయెడల, నదియుక్తముకాదు. ఏలన కేవలకర్మాభావము నైష్కర్మ్యమనిపించు కొనబడదు. ఈయర్థమే భగవద్గీత "నకర్మణామనారంభా న్నైష్కర్మ్యంపురుషోశ్నుతే।నహిసన్యసనా దేవసిద్ధింసమధిగచ్ఛతి" (కర్మములు చేయకుండిన మాత్రమునబురుషుడు నైష్కర్మ్యముబొంపజాలడు. ఏలన, కేవలము సన్యసించుటచేతనే సిద్ధిని పొంపజాలడు) అనుశ్లోకమునందు ప్రతిపాదించుచున్నది. కాబట్టి జ్ఞానములేకయే, ఈ.

ర్ణాశ్రమధర్మపరిత్యాగము సర్వపురుషార్థభ్రష్టతకు గారణమగుట సిద్ధము.

సర్వకర్మసన్యాసముండిన పిమ్మటనే జ్ఞానముపరిపక్వమగును. కాబట్టి మొదటనే సమస్తజనులు సర్వకర్మల బరిత్యజింపవలయునని యాక్షేపించిన యెడల, నదిసత్యముకాదు ఏలన, నైష్కర్మ్య సిద్ధ్యనంతరము (సర్వకర్మసన్యాసానంతరము) జ్ఞానపరిపాకమనుట సరిగాదు. ఏలన, నైష్కర్మ్యసిద్ధియు జ్ఞానపరిపక్వతయు సమకాలికములు. సూర్యుడుదయించినసమయముననే యంధకారంబు నాశనమగురీతి జ్ఞానము పరిపక్వమైనతోడనే కర్మసముదాయమునశించి నైష్కర్మ్యము సిద్ధించును. కాబట్టియే 'నకర్మాణిత్యజేద్యోగీ కర్మభిస్త్యజ్యతేహ్యసౌ' (యోగికర్మలనుత్యజింపడు ఏలన కర్మలచేతనేయా తడువిడువబడుచున్నాడు) అనిశాస్త్రముచెప్పుచున్నది. కాబట్టి జ్ఞానపరిపాకముకలవాడు తానేస్వయముగా కర్మపరిత్యాగము చేయ బ్రయత్నింప నక్కరలేదు. కర్మలేవానిని పరిత్యజించిపోవును. వసంతకాలమువచ్చినతోడనే జీర్ణపర్ణములు వృక్షములనుండి పడిపోవువిధమున జ్ఞానపరిపాక కాలమున జ్ఞానినుండి కర్మసముదాయమువిడిపోవును, నైష్కర్మ్యము సిద్ధించును. కాబట్టి కేవలకర్మసన్యాసము నైష్కర్మ్యసిద్ధికి గారణము కాదని సిద్ధాంతము.

కేవల సర్వకర్మసన్యాసమే నైష్కర్మ్యసిద్ధికి అనగా జ్ఞానసిద్ధికి గారణ మన్నచోనట్లుచెప్పుట " నకర్మణామనారంభాత్ " ఇత్యాది శ్లోకార్థములను విరోధించును. సన్యాసము జ్ఞానహేతువు కానిచో, జ్ఞాన పరిపాకావస్థయందు స్వయముగానే సిద్ధించునన్నచో 'త్యజధర్మమధర్మంచ' (ధర్మాధర్మముల బరిత్యజింపుము) "ప్రవ్రజేత్" (సన్యసింపవలెను) " సర్వధర్మాన్పరిత్యజ్య" (సమస్తధర్మములనుసన్యసించి) ఇత్యాదిశ్రుతిస్మృతివిధులునిరర్థకములు కావలసివచ్చునేయని శంకించినయెడల, సమాధానము జెప్పుచున్నాను. సన్యాసము రెండువిధములు. ఆశ్రమచతుష్టయములోనొకటియై కాషాయాంబరదండధారణాదిలాంఛనములతో గూడినది యొకవిధమైనది. వర్ణాశ్రమములతోనే సంబంధమునులేక, జ్ఞానావస్థయందు మనోనిరోధాదిలక్షణ

లక్షితంబగు సన్యాసము రెండవ విధమైనది. దానికి ప్రాథమిక సన్యాసము అనగా నాశ్రమసన్యాసము, అనగా, బాహ్యసన్యాసము సాధనమై మెట్టున లెనున్నది. కాబట్టిసన్యసింపుమను విధియభిప్రాయము, ఆశ్రమసన్యాసము ద్వారాపారమార్థిక సన్యాసమున కేగవలయునని. అనగా సన్యాసమున కధికారులు, ముందుబ్రహ్మచర్యాద్యాశ్రమములకు విహితంబులగు ధర్మంబులు బరిత్యజించి నాల్గవయాశ్రమంబైన యత్యాశ్రమంబు ప్రవేశించి తద్విహిత ధర్మంబులాచరించుచుజ్ఞానపరిపక్వ సమయమున నాయాశ్రమధర్మములు కూడవిసర్జించి కేవలమాత్మైక్యలోలురై సంచరింపవలయునని సన్యాసవిధివాక్యముల యభిప్రాయము.

మఱియు, కర్మానుష్ఠానముచేతనే మోక్షములభించునని భ్రమపడునవివేకుల నేకులుందురు కాన కేవలకర్మానుష్ఠానముచేతనే మోక్షము సంభవించదనియు కర్మసహాయతలేకయే జ్ఞానముచేతనే యది పొందనగుననియు బోధించుటకై శాస్త్రము సన్యాసమును విధించుచున్నదని కూడయూహింపనగు.

ఆశ్రమసన్యాస మందరు ఎరింగినదియే. ఇక పారమార్థిక సన్యాసమెట్టిదో "సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖంవశీ। నవద్వారేపురేదేహీనైన కుర్వన్న కారయన్" ॥అ 5 శ్లో 13

(కామ్యప్రతిషిద్ధకర్మలను వివేకబుద్ధితో బరిత్యజించి యేమియు జేయకుండ చేయించకుండ నవరంధ్రములు కలదేహమనుపురమందు జితేంద్రియుడై, త్యజింపబడిన వాఙ్మనఃకాయ చేష్టలుకలవాడుగనుకనే నిరాయాసుడై వసింపుచున్నాడు) అను గీతాశ్లోకముచే సూచింపబడుచున్నది. ఇట్టియుత్కృష్టసన్యాసము దేహమే యాత్మయను భావముకల పామరజనులకందరకు సాధ్యమగునదికాదని భగవద్గీతయొక్క 3వ అధ్యాయమందలి "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్। కార్యతేహ్యవశః కర్మసర్వః ప్రకృతిజైర్గుణైః" (అజ్ఞాని యెవ్వడును క్షణకాలమైనను ఒక సమయమందైనను ఏవిధమైన నొకకర్మజేయకుండ నుండజాలడు. ఎందుచేతననగా ప్రకృతి

సంభవంబులగు సత్వరజస్తమోగుణములచే బ్రతియజ్ఞానియు నవశుడై కర్మ జేయింపబడుచున్నాడు) అను 5వ శ్లోకము తెలియజేయుచున్నది,

ఇట్టి యజ్ఞానులు వర్ణాశ్రమధర్మముల బరిత్యజింపవచ్చునా ? కూడ దు. మఱి యేమిచేయవలయును ? సంసారసుఖములందు విరక్తికల్గినవారు అనగా, నాశ్రమ సన్యాసాధి కారులాశ్రమసన్యాసము స్వీకరింపవలెను. ఇట్టివారింక నభ్యాసావస్థయందే యున్నవారుకాబట్టి నాలుగాశ్రమముల ధర్మములగూడ విసర్జింపకూడదు. మఱి యేమిచేయవలయుననన, నాల్గవయా శ్రమమైన సన్యాసాశ్రమమునకు విహితములైన ధర్మముల నాచరింపుచుండ వలెను. అట్లెంతవరకు చేయుచుండవలెనన జ్ఞానవైరాగ్యాదులు పరిపక్వముల గువరకు. అప్పుడు సర్వాశ్రమముల దాటినవారగుదురు.

మఱియు నాశ్రమములతో నొకనికి నెంతవరకు పనియున్నదో అం తవరకును వర్ణముతోకూడ నాతనికి పనియున్నది. ఆశ్రమాతిక్రమణకాల ము సంప్రాప్తమైనప్పుడు మాత్రమే వర్ణాతిక్రమణ కాలమునువచ్చును. వర్ణ పద్ధతి యక్కరలేదని వాదించువారిని, ఆశ్రమపద్ధతి అగత్యమా ? కాదా యని యడుగుచున్నాడను. ఆశ్రమపద్ధతి శాస్త్రప్రోక్తము గనుక నగత్య మన్నయెడల, వర్ణపద్ధతికూడ శాస్త్రప్రోక్తము కాబట్టి యగత్యమేమై యున్నది.

వర్ణపద్ధతి భేదబుద్ధివలన అనగా నజ్ఞానమూలముగా వచ్చుచున్నది గనుక విసర్జనీయమన్నయెడల ఆశ్రమపద్ధతికూడ నాత్మతత్వజ్ఞాన శూన్య తచేత సంభవించుచున్నది, కాబట్టి విసర్జనీయమే ! వర్ణపద్ధతియు నాశ్ర మపద్ధతియుగూడ విసర్జనీయములన్న యెడల నదియేయవస్థయందని ప్రశ్నిం పుచున్నాను. అజ్ఞానావస్థయందుకాదని సప్రమాణముగ వెల్లడించియేయు న్నానుకదా ! కాబట్టి జ్ఞానావస్థయందున్న జనులు మాత్రమే వర్ణాశ్రమప ద్ధతుల నుల్లంఘించి వర్తించుటకధికారులని రూఢియగుచున్నది.

మఱియు వర్ణాశ్రమపద్ధతులు, శాస్త్రసమ్మతము లైనవ్యాకిజతొప్పటి

ములన్నచో, వాని బ్రతిపాదించుశాస్త్రమే త్యాజ్యము కావలసివచ్చును. కాని శాస్త్రదూషకుల మాటపాటికాదు. కాబట్టి వర్ణభేదమాత్ర సర్వభూతములందును సమానమేయని బోధించు వేదాంతశాస్త్రమునకు విరోధముకాదని వ్యక్తమగుచున్నది. కాబట్టి యాత్మయొకటియైనను వర్ణవ్యవస్థనాశయ్యము.

ఐతే వర్ణభేదముచే నాత్మభేదము జేయునట్లు గాలేదాయని యాక్షేపించినయెడల గాలేదని యుత్తరమిచ్చుచున్నాను. ఆత్మయథార్థముగా నొక్కటియా కాదా ? ఒక్కటియేయని యంగీకరించినపక్షమున దానికినానాత్వ మెట్లుసంభవింపగలదు ? యథార్థముగా నేకమైనవస్తువు నానాత్వమునందుట యసంభవముకదా. భిన్నవర్ణత్వసంపర్కముచే నాత్మకు భిన్నత్వమే నిశ్చయముగా సంఘటించునేని భిన్నోపాధి వాసముచే మాత్రమాత్మకు భిన్నత్వమేలసంఘటింపక పోవలె ననియడుగుచున్నాను. అనేకోపాధి (శరీర) సాంగత్యముచే నాత్మకనేకత్వము సంభవింపదని యంగీకరించినపక్షమున, భిన్నవర్ణపరిసంగముచే మాత్రమాత్మకు భిన్నత్వము తటస్థించుననుట యెట్లు న్యాయసమ్మతము కాగలదు ? కాఁజాలదు.

మఱియు వర్ణభేదవిషయమయి యికనొక యంశము ముఖ్యముగా జ్ఞాపకముంచుకొనదగినది. అదియేదియన, వర్ణాశ్రమవ్యవస్థ లాత్మనుద్దేశించి చేర్కొనబడలేదని. అట్టివ్యవస్థలు కేవలాత్మకు వర్తించవు. కాఁబట్టి యేశంకరాచార్యులు సిద్ధాంతబిందువను గ్రంథమందు "నవర్ణానవర్ణాశ్రమాచారధర్మాః" అని వ్రాసియున్నారు. ఆత్మవస్తువు శరీరత్రయ విలక్షణమయినది. దానికి వర్ణాశ్రమాదు లెంతమాత్రము వర్తించవు. అది "నైనంఛిందంతిశస్త్రాణి" ఇత్యాదిగీతావాక్యములచే లక్షితమయినది. ఆత్మకు వర్ణాశ్రమభేదములను కల్పనచేయువారు నిందార్హులనుటసత్యము. కాని శ్రుతిస్మృతిపురాణేతిహాసచోదితమైన సనాతనధర్మము నవలంబించు హిందువులట్లాత్మకు వర్ణాశ్రమముల దెచ్చిపెట్టుటలేదు. కాఁబట్టి యిట్టి వారినాత్మయందు

వర్ణాశ్రమధర్మము లారోపించుచున్నారని నిష్కారణముగా నిందించుచున్న నవపాషండపండితుల యుద్యమం బెంతయు హాస్యాస్పదంబు. కాఁబట్టి వర్ణాశ్రమపద్ధతుల మూలమున నాత్మకు నానాత్వము సంభవించుననుటగాని, యుపాధివ్యతిరిక్తమయిన శుద్ధాత్మయందు వర్ణాశ్రమచిహ్నములు ప్రతిష్ఠింపఁబడుచున్నవనుటగాని మౌఢ్యము.

మఱియు, వర్ణము కేవలము స్థూలశరీరమునకు వర్తించునది కాదు స్థూలశరీరమునే పురస్కరించుకొనియున్న పక్షమున, సమస్తస్థూలశరీరములు సమానములను వ్యాజమున నవియన్నియు నేకవర్ణములోనివేయని మన ప్రతిపక్షులాక్షేపించుట కవకాశముండును. కాని అట్లు కాదుగనుక, వీరి యాక్షేపంబు నిరర్థకంబగుచున్నది. వర్ణము కేవలశరీరమునకే వర్తించునేని, మృతశరీరమునకు కూడ వర్ణము వర్తించునని చెప్పవలసివచ్చును. అట్లు వర్తించునేని, మృతకళేబరముకూడ తద్వర్ణమునకు విహితములయిన కర్మల ననుష్ఠింపవలసివచ్చును. కాని మృతకళేబరము కర్మలనాచరించుట యసంభవము. కాఁబట్టి మృతశరీరమునకు వర్ణము చెప్పబడలేదని తేలుచున్నది. కనుక శరీరమాత్రమునకు వర్ణము వర్తించదని సిద్ధము.

కొందఱు పండితమ్మన్యులు, పూర్వకాలమున కేవలశరీరము ననుసరించియే వర్ణమేర్పడుచుండెడిదనియు, దేహము శుక్లవర్ణముగలదైనయెడల నది బ్రాహ్మణవర్ణములోనిదని, కృష్ణవర్ణముకలదైనయెడల నది శూద్రవర్ణములోనిదనియు, నీవిధముగా దేహముయొక్క రంగుననుసరించి వర్ణభేదము సిద్ధించునాచారముండెడిదనియు వాదించుచున్నారు. కాని వీరివాదము నిలువదు. ఏలన, మృతకళేబరముకూడ కళేబరమేకాఁబట్టి, కళేబరమునకేదియో రంగు కలదుకాఁబట్టి యది తద్వర్ణము (రంగు) న కనుగుణమైన వర్ణముగలదని చెప్పవలసివచ్చును.

# THE PHILOSOPHY OF CASTE.

## వర్ణతత్వము.

ఇప్పుడు వర్ణభేదము దేనికివర్తించునో కొంతవిచారింతము. వర్ణభేద
ము శరీరముతో కూడుకొన్న ఆత్మకు వర్తించును. ఆత్మస్వరూప మొక్కటి
యైనను భిన్నంబులగు నుపాధులయందు వేరువేరుగా జీవరూపముగా ప్రతిఫ
లించుట చేతన నేకంబులగు నాత్మప్రతిబింబములు కలవు. ఉపాధులులేనిచో
బ్రతిబింబములుండ నేరవు; జలభేదంబులులేనిచో జంద్రప్రతిబింబములుండ
నేరవు. కాబట్టి యుపాధులననుసరించి యాత్మకుభిన్నత్వముగాని, స్వాభావి
కంబుగా కాదు. మరియు నాత్మసహితంబులైన దేహంబులకు వర్ణభేదంబు
లు కాని యవి కేవలాత్మకు గాని కేవలదేహములకు గానివర్తించవు. చంద్రప్ర
తిబింబముల భిన్నవర్ణత్వము (పలురంగులు)చంద్రునిభిన్నత్వము నెట్లుసూచిం
పజాలదో యావిధంబున నాత్మప్రతిబింబముల భిన్నవర్ణత్వము (భిన్నజా
తిత్వము) ఆత్మభిన్నత్వమును ప్రకటింపజాలదు. కాబట్టియాత్మయొకటి యే
యైనను, తత్ప్రతిబింబములైన జీవులతో కూడినశరీరములకు వర్తించువర్ణంబు
లు (జాతులు) భిన్నంబులైయుండవచ్చునని సిద్ధాంతము

దేహధారులకు వర్ణభేదము కల్పింపబడవలెను గనుక సమస్తజనులు దే
హధారులే కాబట్టి యందరు మనుష్యులు నొక్కవర్ణము వారే కాని భిన్నవర్ణ
ములవారనుటకు వీలులేదని శంకించినచో నిట్లుసమాధానము నిచ్చుచున్నాను. స
మస్తజనులు దేహధారులైనప్పటికి వారియందు తారతమ్యముండుటచే దానిన
నుసరించి వర్ణవైచిత్ర్యము వ్యవహరింపబడవలెను. అందరు దేహధారులను మి
షచే నేకవర్ణము వారే యనుట యంతయుక్తియుక్తముగా కాన్పించదు. ఇందు
కొక దృష్టాంతమునిచ్చుచున్నాడను. జ్వరము సజీవదేహమునకే సంబంధించున
ది. అది కేవల దేహమునకు వర్తించదు. కేవలాత్మకును వర్తించదు. ఆత్మదేహము
లు రెండును న్నసమయమున మాత్రమే జ్వరము సంభవించుచున్నది. ఏల
న నాత్మవిహీనమైన అనగా జడస్వరూపమైనదేహమునకే రోగమును గల్పిం
చుటకు వీలులేదు. కాబట్టి యాత్మసహితమైన దేహమునకుజ్వరముసంబంధిం
చును గాన ప్రతియాత్మయుక్తదేహమునకు నొక్క జ్వరరోగమే సంఘటించు

చున్నదనుట యెట్లసంగతమో అటులనే యాత్మసహితమైన దేహమునకు జాతిసంబంధించు హేతువుచేత బ్రతియాత్మయుక్త దేహమునకునొక్క జాతియే సంఘటించుచున్నదని వాదించుట యుక్తిశూన్యమైనది. మనుష్యదేహధారులందరునొక్క గణములోని వారైనప్పటికి నానారోగములెవ్విధంబున వారినాక్రమించుచున్నవో ఆవిధముననే మనుష్యదేహధారులందరు నేకవర్గములోని వారైనప్పటికిని భిన్నవర్ణములు, వారికిసంబంధించవచ్చును. కాబట్టిమానవశరీర ధారులందరు నేకవర్గమువారను వ్యాజమున నేకవర్ణము వారనుట తప్పు.

మరియు స్థూలదేహములన్నియు నేకవర్గములోనివైనప్పటికి నేకవర్ణము(రంగు)కలవా? మానవులందరు నేకకోటిలోని వారైనప్పటికి నేకవర్ణము(జాతి)కలవారా? కాజాలరు.

ఇకనొకవిషయము విచారింతము.మానవునకు మాంసాదిపూరితమైన స్థూలశరీరమొక్కటిమాత్రమేలేదు. అంతఃకరణాదులుకల్గినసూక్ష్మశరీరమునుఅవిద్యాస్వరూపమైన కారణశరీరమును అందరియందు నొక్కవిధముగానే యుండునవికావు. ఏకర్మ చేసినను దానిసంస్కారము సూక్ష్మశరీరమున కంటుకొనియుండును. మరణకాలమున నట్టి సంస్కారయుక్తములైన సూక్ష్మ కారణదేహంబులగైకొని జీవుండు నూతనంబగు స్థూలదేహంబున బ్రవేశించును. అట్టిసంస్కారములు భిన్నములనుట తెల్లముకదా. అట్లు కాదేని యొకనికిగంగలోదిగవలయునని బుద్ధిపుట్టినప్పుడు అందరును గంగాప్రవేశము జేయవలసియుండును. కానియట్లు జరుగుటలేదు. కాబట్టి సంస్కారములు వేరువేరనిస్పష్టము. కాబట్టి తత్సహితంబులైన సూక్ష్మాదిదేహంబులును భిన్నస్వరూపములు. కాబట్టి యవియన్నియు నేకవర్ణమనుటతప్పు.

సంస్కారగుంభితమైన సూక్ష్మశరీరంబు ననుసరించి వర్ణభేదమేర్పడును కాబట్టే దానికనుగుణంబుగ వర్ణవిభాగము చేయవలయును గాని తలిదండ్రుల జాతిననుసరించి కాదందురేని, అట్లుకాదు. ఏలన సంస్కారము ఇంద్రియములకగోచరముగాన దత్కార్యమైనస్థూలజన్మనువలన ననుమేయము.

అట్లైననిక వర్ణవిచక్షణయెట్లనబుట్టుక ననుసరించియని సమాధానము. ఒకనిజ నకుండు బ్రాహ్మణుండేని తానును బ్రాహ్మణవర్ణములోని వాడు.శూద్రుండేని శూద్రవర్ణములోనివాడు—ఈవిధముగా వర్ణనిర్ధారణంబు జేయనగు.

ప్రశ్న—సంస్కారము ననుసరించి వర్ణమన్నచో బిత్రువర్ణము ననుస రించి కానేరదు. తండ్రివర్ణమనుసరించి తనవర్ణముకూడ కలుగునన్న పక్షమున దనసంస్కారములేక స్వభావముననుసరించి కాకపోవును. కాబట్టియీరెంటి లో దేనినసరించియో యసందిగ్ధముగ జెప్పుము.

ఉత్తరము—రెంటిలో దేనినసరించి యైనను.

ప్రశ్న—ఎందుచేత ?

ఉత్తరము—ఒకదానికొకటి యనుగుణమై యుండునుగనుక..ఎట్టిసం స్కారమో అట్టిజన్మమేకలుగును. తనసంస్కారమెట్టిదో దానికి దగినవర్ణము గల జనకునకేజన్మించుట తటస్థించును. తానేవర్ణముగల వానికిబుట్టుననగా, తనసంస్కారమే వర్ణమువానికి బుట్టుటనపేక్షించునో యావర్ణమువానికే.

ప్రశ్న—సంస్కారమునకును జన్మమునకు వర్ణమునకును కలయన్యోన్య సంబంధమును వ్యక్తీకరించుమను దాహరణంబులనిమ్ము.

ఉత్తరము—బ్రాహ్మణవంశమున జన్మించుటవలన తదనుగుణంబుగా సత్వగుణోపేతంబగు సంస్కారమని యూహింపనగు. సత్వగుణోపేతసం స్కారమైనచో నట్టివానివర్ణము తదనుగుణంబుగా బ్రాహ్మణవర్ణమై యుం డునని సిద్ధాంతీకరింపనగు.

బ్రాహ్మణవంశమున బుట్టినంతమాత్రమున తదనుగుణంబైన సత్వగుణ ప్రధానమైన సంస్కారముండియుండునని యెట్లూహింప శక్యమగునని ప్ర శ్నించినయెడల, సంస్కారమనుసరించియే జన్మకలుగుచున్నదా లేదాయని యడుగుచున్నాను. లేదన్నయెడల, బ్రపంచమందు ప్రాణులయవస్థలందు దారతమ్య ముండుటకు గతంబేమనిమిలల ప్రశ్నవేయుచున్నాను. అట్టియవ స్థావైషమ్యమునకు గారణంబు సంస్కారముకాదనియు గర్మవైచిత్ర్య

మేమనియు ప్రత్యుత్తరమిచ్చినయెడల, సంస్కారవైచిత్ర్యము కర్మవైచిత్ర్యము ననుసరించి యేయుండునా కాదా యని యికనొకసారి ప్రశ్నించుచున్నాను. అట్లనుసరించియుండదనిన, సంస్కారమన నేమని యడుగుచున్నాను. సంస్కారము కర్మజన్యమైనచో సంస్కారవైచిత్ర్యము కర్మవైచిత్ర్యమునకనుగుణమైనదని యొప్పుకొనకతీరదు. కాబట్టికర్మభేదములకనుగుణంబైన వంశమున జన్మకలుగుచున్నప్పుడు, సంస్కారభేదముల కనుగుణంబుగానే అట్టిజన్మకలుగుచున్నదని యంగీకరింపకతీరదు.

మరియు పూర్వజన్మంబున నెట్టికర్మసంచితము (లేకసంస్కారవిశేషము) కలదో అట్టిజన్మమే వర్తమానకాలంబున సంభవించునని యంగీకరించిన పక్షమున బ్రాహ్మణవంశమున బుట్టినప్పుడు బ్రాహ్మణుడనిపించుకొనుటకే యట్లుజన్మించెనని చెప్పుటకేమి యాక్షేపంబుకలదు? బ్రాహ్మణపదయోగ్యుడు కాడేని మఱి యితరవర్ణములవారికి జన్మింపక బ్రాహ్మణులకుమాత్రమేజన్మించుట కేమికారణము చెప్పెదము? బ్రాహ్మణజనకులకు జన్మించుటవలన బ్రాహ్మణపదమునకు యోగ్యుడు కాడన్నయెడల, పితృధన ధాన్యాదులకు మాత్రమెట్లుయోగ్యుడు కాగలడు? పితృసంభవసంపర్కములవలన సంభవించెడు సుఖదుఃఖములకు మాత్రమెట్లర్హుడు కావలెను? అర్హుడగుట లోకమున జూచుచునేయున్నారముకదా.

అర్హుడుకాడన్నచో, నట్టితలిదండ్రులకు జన్మించుటవలన దనపూర్వజన్మకర్మఫలమెవ్విధంబున ననుభవింపబడుచున్నదని చెప్పవచ్చును? తద్వంశమున బుట్టుటతనపూర్వజన్మకర్మఫలమెట్లుకాగలదు?

అట్టివంశమునందుద్భవించుటపూర్వకర్మఫలముకాదందురేని, మరిదేని ఫలమో చెప్పెదరుగాక! ప్రపంచమున ప్రాణులయవస్థల తారతమ్యముల నెట్లుసమన్వయించెదరో సమన్వయింతురుగాక? కాబట్టిజన్మవైచిత్ర్యము పూర్వజన్మకర్మవైచిత్ర్యము ననుసరించియే యుండునని సమ్మతించిన పక్షమున, బ్రాహ్మణాదులకు జన్మించుట బ్రాహ్మణాదు లనిపించుకొనుటకే యని యంగీకరింపక తీరదు కాబట్టిజన్మనుబట్టి వర్ణమనిసిద్ధము.

కొందరు, బ్రాహ్మణునకు జన్మించినవాడు బ్రాహ్మణుండైతే బ్రాహ్మణునకుండవలసిన దయాసత్యశౌచాదులు లేని బ్రాహ్మణులెట్లున్నారనియు కాబట్టి కేవలము జన్మచేతనే వర్ణముకాక గుణముచేత నగుననియు గొప్పయాక్షేపణ జేయుచున్నారు. కానివీరియాక్షేపంబు నిలువజాలదు. ఎందుచేతననగా, బ్రాహ్మణయోగ్య గుణంబులు లేకపోయినను బ్రాహ్మణవర్ణత్వము లేదనుట శక్యముకాదు. బ్రాహ్మణవర్ణప్రాప్తికి నర్హత్వముండియున్నందున బ్రాహ్మణవర్ణమును తద్వర్ణమువానికి జన్మించిసంపాదించిపిమ్మట బ్రాహ్మణ విరుద్ధములైన గుణంబుల గనుపరచి నంతమాత్రమున నాతని బ్రాహ్మణవర్ణయోగ్యత నశింపనేరదు. ప్రథమంబున నర్హతయుండునది. పిమ్మట నర్హమైన వర్ణము. అటుపిమ్మట, తద్వర్ణమునకనుగుణమైన గుణసంపత్తిగాని తద్వర్ణమునకు విరోధమైనగుణసంఘాతంబుగాని సిద్ధింపవచ్చు.

వర్ణమునకవిరోధముగానే సర్వదాగుణసముదాయ ముండుననుటతప్పు. పూర్వజన్మఫల మనేకరూపములుగా ననుభవింపబడుచున్నది. అట్టిరూపములలో, తగినవర్ణమున బుట్టుట యొకటి. అట్లు పుట్టిన పిమ్మట, నావర్ణమునకుపగని చేష్టలావర్ణమును పోగొట్ట సమర్థములు కానేకావు. ఎందుచేతననగా నెట్టికర్మలకట్టి ఫలంబులే సిద్ధించును. ఏకర్మలజేయుటచేత బ్రాహ్మణవర్ణము సిద్ధించినదో యాకర్మలును ఏకర్మలాచరించియుండుట చేతనీజన్మమునందు బ్రాహ్మణవర్ణమునకు యుక్తములుకానిపరద్రవ్యాపేక్షాది దుర్గుణంబులుద్భవించునో యాకర్మంబులును, భిన్నంబులు. కానమొదటి తరగతిలో జేరినకర్మలకు ఫలంబు బ్రాహ్మణవర్ణమున జన్మించుటయు, రెండవతరగతిలో జేరినకర్మములకు ఫలంబు పరద్రవ్యాపేక్షాదిదుర్గుణగణంబులైయున్నవి. ఏకర్మకాఫలము. కాబట్టి బ్రాహ్మణయోగ్యగుణంబులు చూపట్టుటలేదు కదా యని బ్రాహ్మణవర్ణము కాదనుట తప్పు. అటులనే శూద్రయుక్తగుణంబులు లేవుకదాయనిశూద్రవర్ణము కాదనుటకల్ల.

ప్రతిప్రాకృతకర్మంబునకును ప్రత్యేకము ప్రత్యేకముగా ఫలంబును

భవింపదనియు, నన్నికర్మలుమిళితమై కర్మసంఘాతం (aggregate) జే
ర్పడిదానినుండి యేఫలంబుద్భవించుననియు, మనప్రతిపక్షులు వాదింతురేని,
అట్టికర్మసంఘాతంబుయొక్క ఫలంబేకరూపముకాక బహురూపంబై యుం
డుటకేమి కారణమనియడుగుచున్నాను. మఱియుకారణ మొకటైనప్పుడు
కార్యములన్యోన్య విరుద్ధంబులెంతమాత్రము కానేరవుకదా. కర్మసంఘాతం
బేకంబుగా గారణంబైనచో, నొక్కమనుజునకే యైశ్వర్యము, దారిద్ర్యము,
ఆరోగ్యము, జాడ్యము, సుఖము, దుఃఖము, మొదలగు పరస్పరవిరోధంబుల
గు కార్యములెట్లుకలుగగలవు? అయినను ప్రతిమానవునకు నైశ్వర్యము, దా
రిద్ర్యము మొదలైన భిన్నంబులైన యవస్థలు సంఘటిల్లుచుంటలోకములో
మనముచూచుచుండిన విషయమేకదా. కాబట్టిప్రాచీనకర్మ సంఘాతమేక
ముగా బ్రకృతపు జన్మావ్యవస్థలకు గారణము కాకపోవలెను.

కారణమేయని యంగీకరించినప్పటికి, బ్రకృతజన్మంబున మనుష్యుని
భిన్నావస్థలు సంభవంబులైనప్పుడు, భిన్నజాతిగుణములుమాత్రమేల సంభవ
ములుకాజాలవు? పూర్వకర్మంబులు సాంఘికముగా గారణమైనప్పుడు మను
ష్యునికి నవస్థాభేదంబులు త్పన్నములగుచుండగా భిన్నావస్థారూపమైన భి
న్నవర్ణగుణసద్భావము మాత్రమెట్లు సంభవింపనేరదు? ఐశ్వర్యముకలవాని
కే కొంతకాలమునకు దారిద్ర్యమెట్లు సంప్రాప్తముకావచ్చునో, బ్రాహ్మణయో
నికిబుట్టి బ్రాహ్మణత్వము సంపాదించినవానికే కొంతకాలమునకు బ్రాహ్మణవి
రుద్ధగుణంబులుండవచ్చు. దారిద్ర్యదశయందున్నవాడు పూర్వమెన్నడును ఐ
శ్వర్యదశయందుండి యుండడనుట యెట్లసంగతమో, దౌర్జన్యదశయందున్న
వాడు తత్పూర్వము బ్రాహ్మణజాతియందుండి యుండడనుటయు నసంగత
మే. మనుష్యున కనేకావస్థలజూచుచున్నారము. బ్రాహ్మణత్వముగాని, శూ
ద్రత్వముగాని, ఐశ్వర్యాదికమువలెనే యొకఅవస్థయై యున్నది. ఒకఅవస్థ,
మఱియొక అవస్థలేదనలేదు. బ్రాహ్మణవిరుద్ధ గుణములున్న అవస్థయందలి
మనుజుడు బ్రాహ్మణావస్థ బొందియుండలేదనుటకు వీలులేదు.

ప్రశ్న-దారిద్ర్యావస్థయం దైశ్వర్యముండ నేరదు. ఐశ్వర్యదశయందు
దారిద్ర్యముండుటకు వీలులేదు. అటులనే దౌర్జన్య దశయందు సౌజన్యమసంభ
వంబు. సౌజన్యసమయంబున దౌర్జన్యముండుట కవకాశములేదు. కాబట్టి బ్రా
హ్మణవిరుద్ధధర్మములున్న కాలంబున బ్రాహ్మణత్వమున్నదని చెప్పుటకు వీలులే
దు. అందుచేత జననసమయంబున నొకడు బ్రాహ్మణుండై నప్పటికి, బిమ్మట
తద్విరుద్ధగుణంబులున్న సమయంబునమాత్రము బ్రాహ్మణుండు కాజాలడు. అ
టులనే యొకడు జననకాలంబున బ్రాహ్మణేతరుండైనప్పటికి, తదనంతరంబు
బ్రాహ్మణయుక్తగుణంబులు వానియందు కలలేనివాడు బ్రాహ్మణుడే యగు
ను. కాబట్టి జననసమయమందలి వర్ణమే యామరణమును వర్తించుననువాదము
యుక్తియుక్తముకాదు.

ఉత్తరము—ఇట్లనుటసరికాదు. ఏలన, నైష్టికకర్మకర్తృఫలమేయని మున
దుస్థాపించియున్నాను. ఒకవిధమైన కర్మలనాచరించుటకు ఫలము బ్రాహ్మణ
జాతిని పొందుటయైయున్నది. మఱియొకవిధమైన కర్మలనాచరించుటకు ఫల
ముదుష్టస్వభావమునుపొందుటయైయున్నది. కాబట్టి బ్రాహ్మణజాతిని పొందు
టయు దుష్టస్వభావముబొందుటయు నెంతపరస్పర విరోధంబులైనను, ఒక్క
దానినొకటి నశింపజేయక, ఏకకాలముననుండుట అసంభవముకానేరదు. ఇ
ష్టానిష్టములేక కాలంబున బ్రాప్తములగుట సంభవమైన విషయమే. ఎట్లన
నొకడు లౌకికవ్యాపారమున గొప్పధనలాభముబడయుసమయముననే వ్యాధి
గ్రస్తుడగుటకలదు. ఈయుదాహరణమందు, వ్యాధియనునది యనిష్టమును
సూచించును; ధనలాభమనునది యిష్టమును తెలియజేయుచున్నది. పరస్పర
విరుద్ధ ధర్మములుగలకార్యములు ఏకకాలంబుననుండుటకలదు. కాబట్టి బ్రాహ్మ
ణత్వమును బ్రాహ్మణవిరుద్ధ ధర్మసముదాయంబును ఏకకాలంబుననుండవచ్చున
నుట న్యాయసమ్మతమైనది. ఇంతయేల, పైదృష్టాంతమందలివ్యాధివలెనే బ్రాహ్మ
ణునకయోగ్యములైన గుణంబులున్నవి. ధనలాభమువలెనే బ్రాహ్మణజాతియు
న్నది. ఈరెండు విధములైన ఫలంబులును భిన్నకర్మలకార్యములు.

మరియు ఒకమనుజుని చేష్టలే సుగుణత్వమును దుర్గుణత్వమును ఎట్లు సూచింపవచ్చునో, అటులనే బ్రాహ్మణత్వయోగ్యతను తదయోగ్యతను కూడ వెల్లడింపవచ్చును. ఈదృష్టాంతములోని సుగుణత్వ మొకవిధమైన కర్మలఫలము; అటులనే బ్రాహ్మణత్వ మొకవిధమైన కర్మలఫలము. దుర్గుణత్వము మరియొకవిధమైన కర్మలఫలము; అటులనే బ్రాహ్మణత్వమునకు యోగ్యములు కానిగుణంబులు మరియొకవిధమైనకర్మలఫలము. ఒకమనుజుడే సుగుణవంతుడనియు దుర్గుణవంతుడనియు నెట్లు చెప్పవచ్చుననగా, ఒకడు మిక్కిలిజారుడైనప్పటికి దుఃఖించుప్రాణులందు పరమదయగలవాడై యుండవచ్చు. ఇట్టివ్యవహారములోకమున జూచుచునే యున్నారముకదా. ఇప్పుడు, దుర్గుణమున్నసమయమున సుగుణములేదనుట యెట్లనుభవవిరుద్ధమో, బ్రాహ్మణునకయోగ్యంబులగు గుణంబులున్న సమయంబునవానికి బ్రాహ్మణవర్ణములేదనుటయు నట్లే. మరియు, సుగుణమున్న సమయమున దుర్గుణములేదనుట యెట్లుఅనుభవవిరుద్ధమో; బ్రాహ్మణవర్ణమున్న సమయంబున వానిక యోగ్యగుణంబు లుండవనుటయు నసమంజసంబు. కాబట్టి నైశ్వర్యా ద్యవస్థలెట్లు పురాకృతకర్మజన్యంబులో బ్రాహ్మణాది వర్ణములునట్లేయని స్పష్టము. కాబట్టి పితృవర్ణమే పుత్రునివర్ణము.

పూర్వపక్షము——బ్రాహ్మణాదివర్ణములు పుట్టుకతోడనే ప్రాప్తములైనను వానికనుకూలమైన రీతిననేకులు ప్రవర్తించుటలేదు కాబట్టివర్ణములు పుట్టుకతోడనే పుట్టునవికావు. బ్రాహ్మణవర్ణము లభించినప్పుడు శమదమాదులచే దానిని సద్వినియోగముచేయుచున్న మానవులసంఖ్య బహుస్వల్పము. సరియైనవినియోగముకొరకే వర్ణములభించుచున్న దన్నపక్షమున, నిటుసద్వినియోగములేదు కాబట్టివర్ణమను నదియేలేదు.

సిద్ధాంతము——సద్వినియోగము లేదుగనుక నొకవస్తువులేనేలేదనుట న్యాయముకాదు. ఏలన సద్వినియోగములేకపోయినప్పటికి నొకవస్తువుండుటచూచుచున్నారము. కొందరుధనవంతులు ధనమును తామనుభవించి గా

బీదలకిచ్చిగాని సద్వినియోగము జేయుటలేదు. వీరికిధనమేలేదా యేమి?శూర్పణఖవంటి రక్కసినఖములతో బ్రాహ్మణులరక్కితనయుక్కను దుర్వినియోగము వసికొనుచున్నది. పాపముదానికి బలమేలేదు కాబోలు! లోకములోననే కులుపరోపకారముచే తమశరీరంబుల సార్థకపరచుకొనుటలేదు. అట్టివారికి దేహములేలేవాయేమి? వారిజీవులన్నియూనే యాధారమునులేకయే యాకసమున వేర్లాడుచుండును కాబోలు! ఇదివిదేహముక్తికి బహుసులభమైన మార్గము!

మఱియు నొకడునుచకార్యమెద్దియైన జేసి బహుమానంబున కర్హతసంపాదించి కొంతద్రవ్యమును బహుమానముగా బడయును. ఆధనమునువాడు సద్వినియోగమైన జేయుటగలదు. దుర్వినియోగమైన జేయుటగలదు. అటులనేకొంత సత్కర్మనుపార్జించి బ్రాహ్మణవర్ణమునకు యోగ్యతను సంపాదించి బ్రాహ్మణజాతిని పొందును. ఆట్టిబ్రాహ్మణత్వమును వేదాధ్యయనాదులచే సద్వినియోగమైన జేయుటకలదు, పరధనపరదారాపేక్షలచే దుర్వినియోగమైన జేయుటకలదు. దుర్వినియోగము జేయుచున్నారు గదాయని బహుమానమే పొందలేదనుట యెట్లనుభవవిరుద్ధమైన విషయమోఅటులనే దుర్వినియోగము జేయుచున్నారు కదాయని బ్రాహ్మణవర్ణమే పొందలేదనుట యుక్తమైయున్నది. ఇటులనే, యేజాతివాడైనప్పటికి నాజాతికనుగుణంబులైన గుణంబులు చూపట్టుట లేదన్నవ్యాజమున నావర్ణమువాడు కాడనుట సరికాదు.

పూర్వకాలంబున గొంతకాలమువరకు బ్రాహ్మణాదివర్ణముల బుట్టుటయేకాక తద్వర్ణముల కనుగుణంబులైన గుణంబులుకల్గివర్తించెడి వారనేకులుండెడివారనితోచెడిని. బ్రాహ్మణకులోద్భవులకు దయాసత్యశౌచంబుల వశ్యముగానుండి యుండెడివి. అట్లుకాక బ్రాహ్మణులయ్యు దుర్వినీతులైనవారు స్వల్పసంఖ్యగా నుండెడివారు. అటులనేవైశ్యుండు వైశ్యజాతి కనుగుణంబులైన వాణిజ్యకౌశల్యాదులు కల్గిశోభించెడివాడు. కానినానాటికి సత్త

సంకరమై యేజాతివానికుండవలసిన గుణంబులాజాతివానికి లేకపోవుటతటస్థ
మైనది కాబట్టి జాతిపద్ధతికి పునరుజ్జీవనము కల్గించుటకర్తవ్యము; జాతినిర్మూ
లనము కాదు. జాతికిదోషమంకురించినందున జాతినే త్రుంపజూచుట శరీర
మునకు రోగముజనించినదని శరీరమునే నశింపజేయుట వంటిది.

మఱియు, జాతివిషయమై యికనొకవిషయము ముఖ్యముగా జ్ఞాపక
ముంచుకొనవలసినది. వర్ణము రెండువిధములు. ఒకటిజన్మవర్ణము. రెండవదిగుణ
వర్ణము. జన్మవర్ణమనగా జన్మనుండికల్గినవర్ణము.అనగా పితృవర్ణము. గుణవర్ణ
మనగా సాత్వికాదిగుణంబుల ననుసరించి కల్గినవర్ణము. ఎట్లన, దైవభక్త్యా
దులతిశయముగా గాన్పించినయెడల వానివర్ణము బ్రాహ్మణవర్ణము; యుద్ధ
శౌర్యాదులు మిక్కుటముగా దృశ్యములైనప్పుడు క్షత్రియవర్ణము; ఈవి
ధముగా వర్ణములేర్పడుచుండును. ఈరెండవవిధమైనవర్ణము గౌణార్థముకల్గి
గౌరవార్థమైనది కానియథార్థమైనది కాదని వెనుక దెల్పియున్నాను.

కాబట్టి బ్రాహ్మణాదులకు శాస్త్రముచే విధింపబడినకట్లు పాట్లుగు
ణబ్రాహ్మణాదులకు వర్తించవు. శాస్త్రప్రోక్తములగు వర్ణధర్మములు జన్మము
నుండి వర్ణముకల్గినవారలకే యుద్దేశింపబడినవి. కాని, గుణములబట్టి వర్ణము
సంభవించిన వారలకుగాదు. కాబట్టి యీరెండుతెరంగులైన వర్ణములవారు
నొకరితో నొకరేకమైన మానాచారంబులాచరించుటకు దగరు.

మఱియు, జాగ్రతలో స్వప్నము, స్వప్నములోజాగ్రత, జాగ్రత
లోసుషుప్తి ఈమొదలైన యవస్థలెట్లు కలవో, ఆవిధంబున బ్రాహ్మణత్వము
లో క్షత్రియత్వము, క్షత్రియత్వములో బ్రాహ్మణత్వము, బ్రాహ్మణత్వము
లో వైశ్యత్వము, వైశ్యత్వములో బ్రాహ్మణత్వము, క్షత్రియత్వములో వైశ్య
త్వము, వైశ్యత్వములో క్షత్రియత్వము మొదలయినవి కలవు. జాగ్రతలో
స్వప్నమన నేమియన, నవస్థజాగ్రదవస్థ యైనప్పటికి, చక్షురాదీంద్రియము
లకు ప్రపంచమేమియు గోచరముకాక అంతరింద్రియమ్మునకు మాత్రము గో
చరమగుట. ఇటులనే యితరావస్థలు నూహింపనగు. బ్రాహ్మణత్వములో క్షత్రి

యత్వమనగా వర్ణము బ్రాహ్మణవర్ణమైనప్పటికి గుణములు క్షత్రియయోగ్యంబులయిన శౌర్యాదులగుట. దీనికి ఉదాహరణములు, పరశురాముడు, అశ్వత్థామ, చాణక్యుడు మొదలయినవారు. క్షత్రియత్వములో బ్రాహ్మణత్వమనగా, క్షత్రియవంశోత్పత్తియైనను గుణసంపత్తి బ్రాహ్మణవర్ణోచితజ్ఞానాదికమై యుండుట. దీనికుదాహరణము, జనకాదులు. శూద్రత్వములో బ్రాహ్మణత్వమనగా జన్మము శూద్రజన్మమైనను బ్రాహ్మణసామాన్యములయిన శమదమాదులు కల్గియుండుట. ఇందుకుదాహరణము విదురుడు, ఇటులనే యితరపక్షములు నుగ్రహింపనగు.

ఈకాలమునందైనను బ్రాహ్మణాదులకు వారివారి కుచితంబులగు ధర్మంబులు బొత్తుగా నుత్పన్నములు కాలేదు. బ్రాహ్మణవంశోద్భవులందు జ్ఞానాదులుపూర్తిగానశింపలేదు. క్షత్రియకులసంజాతులందుసంగరనైపుణ్యాదులుఇప్పటికిని చూడగలము. వైశ్యులందు వాణిజ్యకౌశల్యాదులు మెండుగాగలవు. కాబట్టి బ్రాహ్మణాదులందు జ్ఞానాదులు పూర్తిగా నదృశ్యములనుటకు వీలు చిక్కదు. కాబట్టి తద్వ్యాజముచే వర్ణముజన్మవలననను వాదము నిరాధారమనుట కాధారమెంత మాత్రమును లేదు.

మఱియు, నీజన్మమందలి గుణవర్ణముత్తరజన్మమందు జన్మవర్ణమును కలిగించుట కవకాశముకలదు. కాని యీజన్మమందే జన్మవర్ణముగా మారజాలదు. ఎందుచేతనన, జన్మవర్ణము జన్మనుండియారంభమై యుండునది. వర్తమానజన్మమున శూద్రకులసంజాతుని కెవ్వనికైన దయమొదలయిన బ్రాహ్మణుని కుండవలసిన గుణమణులున్నయెడల అట్టివాడు రాబోవుజన్మమునందు బ్రాహ్మణవర్ణమునబుట్టి బ్రాహ్మణుడనిపించుకొనుటకు వీలున్నది. కాని, యీజన్మమందే బ్రాహ్మణుడు కానేరడు. ఇటులనే యితరవర్ణముల సంగతియు నెరుగవలెను.

ఇకనొకవిషయమున కేగుదము తైత్తిరీయోపనిషత్తులోని శిక్షావల్లియందు 11 వ యనువాకమున గర్మవిచికిత్సగాని వృత్తవిచికిత్సగాని కల్గినచో

నట్టివిచికిత్స సంభవించిన దేశకాలములందున్నట్టియు- యుక్తాయుక్తవిచారము జేయగలసామర్థ్యము కల్గినట్టియు, స్వార్థపరత్వములేక- ధర్మస్థాపనార్థమే ప్రవర్తించునట్టియు, బ్రాహ్మణులెవ్విధంబున వర్తించిన తదితరులును ఆవిధమున నేనడువవగినదని, శాసింపబడినది. ఇప్పుడుజాతిభేదమగత్యమాకాదాయనుధర్మసందేహమా సేతుహిమాచలములగల శిష్టాచారమును పరిశీలించుట వలనదీరును. అటులనే వర్తమానజన్మమందలి గుణంబుల ననుసరించి వర్ణములు నిర్ధారణీయములా, లేక, పితృవర్ణముల ననుసరించి యాయను మీమాంసయు దేలును. ఎట్లన దేశమునంతటను గల, తపోయోగాదులచే శోభిల్లుచున్న సత్పురుషులు జాతిభేద మగత్యమేయని వక్కాణింపుచున్నారు గాన జాతిభేదపద్ధతి యెంతమాత్రమును విసర్జనీయముకాదు. అటులనే పితృవర్ణముబట్టియే పుత్రునివర్ణము నిర్ణయింపవలయునని భరతఖండమునందలి యనేకమహానీయుల యభిప్రాయముకాబట్టి పితృవర్ణమే పుత్రునివర్ణముగా బరిగణింపవలసియున్నది.

అట్లుగాక జాతిభేదమును విసర్జింతుమేని శిష్టాచారమును తృణీకరించిన వారమాదుము. శిష్టాచారమును తృణీకరించుటచే వేదమునుగూడ తృణీకరించిన వారమాదుము. ఏలన వేదమందు, అనగా తైత్తిరీయోపనిషత్తునందు, శిష్టాచారమంగీకార్యమను నంశంబు ప్రతిపాదింపబడినదని పైన నుదాహరించియేయున్నాను. గుణమునుబట్టి వర్ణమనుటయు శిష్టాచారవిరుద్ధముగాన వేదవిరుద్ధము. కాబట్టి నిబర్హణార్హంబు.

—శరీరవర్ణముబట్టి వర్ణభేదమా ?—

శరీరవర్ణముబట్టి వర్ణభేదమేర్పడునని వాదించువారు గుణమునుబట్టి కాదని యొప్పుకొనవలసినదే కదా. ఏలన పురుషునిదేహవర్ణమెట్టిదో అట్టి శీలమేయుండునని నుడువుటకు వీలులేదు. శ్వేతవర్ణముగల మనుష్యుడు సత్వగుణమవశ్యముగా గల్గియుండునని నిర్ధారించుటయెట్లు? అతడుతమోగుణప్రధానుడు మాత్రముకాగూడదా? అటులనే, సత్వగుణప్రధానులైన నరులు

సర్వదా శ్వేతదేహులనుట సరిపడదు. కాబట్టి వర్ణవర్ణవాదము నంగీకరించిన పక్షమున, గుణవర్ణవాదమును త్రోసివేయవలెను; గుణవర్ణవాదమును స్వీకరించినచో దేహవర్ణము (రంగు) ను బట్టివర్ణమను వాదమును విసర్జింపవలెను.

పూర్వకాలమున బ్రాహ్మణాదులుసితలోహిత పీతాసితవర్ణములు వరుసగాగల్గియుండెడివారని చెప్పువాక్యములుకలవందురేని, ఉండనిండు. అందువలన రంగుననుసరించిజాతిభేదమును నంశమెట్లు తెలియగలదు? బ్రాహ్మణులు శ్వేతగాత్రులని చెప్పిన చెప్పవచ్చు; గాని శ్వేతగాత్రులే బ్రాహ్మణులని నిర్దేశించువాక్యములెవ్వి? శరీరకాంతుల తారతమ్యమువలన వర్ణవిభాగముజేయవలయునని యెచ్చటనుదాహరింపబడినది? అట్లుపూర్వకాలమున నెన్నడైన జరుగుచుండెనని నుడువుపలుకుశే గ్రంథమునందును గానరావేమి? కాబట్టి మన ప్రతిపక్షుల పలుకులు విఫలములు. ఇందుకు హేతువు, ప్రమాణదౌర్బల్యము.

మఱియు, నాంగ్లేయులు శ్వేతదేహులను వాక్యము శ్వేతదేహులందరును ఆంగ్లేయులేయైయుందురని యెట్లుసూచింపగలదు? ప్రతిశ్వేతశరీరియు నాంగ్లేయుడు కాగలడేని, బుడుతకీచులు (Portuguese) కూడ నాంగ్లేయులు కావలసివచ్చును. అది యసంగతముగదా. కాబట్టి యాంగ్లేయులు శ్వేతగాత్రులనునట్లు బ్రాహ్మణులు శ్వేతగాత్రులని నుడువబడినది. ప్రతిశ్వేతగాత్రుడును ఆంగ్లేయుడుకానిచందమున ప్రతిశ్వేతగాత్రుడును బ్రాహ్మణుండుకానేరడు. ఏలన బ్రాహ్మణాదులు మాత్రమే సితాదివర్ణములు వరుసగాగల్గియుండెడివారని తెల్పుసాక్ష్యమేమియును గానరాదు. రాజులు భుజపరాక్రమశోభితులన్నప్పుడు, ప్రతిభుజవిక్రమవంతుడైన కింకరుడును రాజు కాజాలడుకదా!

శ్రీ బాలగంగాధరతిలకువలన బ్రణీతమైన సిద్ధాంతము (The Theory of the Arctic Home of man) ప్రకారము, ఆర్యులుత్తరధ్రువసముద్రప్రాంతవాసులైనప్పుడు శీతవాతాదికమువలన శ్వేతశరీరవిశిష్టులైయుండిరి గనుక నంపలు బ్రాహ్మణవర్ణమువారేయని వాదించినపక్షమున,

క్షత్రియాదివర్ణత్రయముకూడ నుండెనని జెప్పుచుపురుషసూక్తోక్తులకేమిసమాధానము జెప్పగలరో!

ఋగ్వేద మాకాలమునందుద్భవించినదేనా? ఔనన్నయెడల, దద్భాగమైనపురుషసూక్తంబువలన, జాతుర్వర్ణ్యమప్పటికేయుండియున్నట్లు తెలియవచ్చుచున్నది. కాబట్టి బ్రాహ్మణవర్ణ మొక్కటిమాత్రమే యక్కాలంబున నుండెనని చెప్పుటనిజమా? అందుచేత, రంగునుబట్టి జాతిభేదమనుట కల్లయేకదా.

ఋగ్వేదము తత్కాలీనము కాదన్నపక్షమున, దస్తదీర్ఘరాత్రాది ప్రసంగమసంగతమే కదా. అహోరాత్రములపరిమాణములన్ని దేశములందువలెగాక విలక్షణముగా ఋగ్వేదమునందు వర్ణింపబడినవి కాబట్టి యట్టిగ్రహచారలక్షణము త్తరధ్రువసమ ప్రదేశమీపంబున మాత్రమే సంభవంబైయున్న హేతువుచేత తద్ఋగ్వేద మంత్రములు తదానీంతనములేయని కదా శ్రీతిలకుగారి సిద్ధాంతము. అప్పుడు రచింపబడినవి కానిచో నప్పటిప్రస్తావము లందుండ నేరవు కాబట్టివానిని బట్టి ఋగ్వేదకాలనిర్ణయము శక్యమగును. కాని తత్కాలనిర్ణయము చేయబడుచున్నది గనుక నామంత్రము లాకాలమునందే విరచింపబడియుండవలెను. కాబట్టి తన్మంత్రవర్ణితంబగు వర్ణభేదంబుకూడ నార్యులుత్తర దిగ్భాగమధిష్ఠించిన సమయమున నే యధివసించియుండును. ఇట్లు చాతుర్వర్ణ్యముండెనని తేలుచున్నప్పుడు బ్రాహ్మణవర్ణ మొక్కటిమాత్రమే యుండెనని యెట్లు చెప్పనగును?

రంగునుబట్టివర్ణమన్నచో నప్పుడెన్నిరంగులుండెను? నాల్గురంగులన్నచో నుత్తరధ్రువప్రాంత శీతోష్ణస్థితిగతులకు విరుద్ధమని త్వత్సిద్ధాంతమేకదా. మఱియు, నాల్గురంగుల మనుష్యులుండిరని చెప్పుదురేని, నాల్గుజాతులుకూడ నుండెనని యంగీకరింపుడు! అంగీకరింపరేని, రంగులననుసరించి జాతిభేదము కల్గెననువాదము విడిచిపెట్టవలెను. తెల్లటిరంగుగల జనులుమాత్రమే యుండిరన్నపక్షమున, జాతిచతుష్టయమును వర్ణించుఋగ్వేదమంత్రములు

మాటయేమిచెప్పెదురు? అవియప్పటివి కావందురేని వేదకాలము నిర్ణయించు తిలకుసిద్ధాంతమునకే భంగముతటస్థించు హేతువుచేతఁ నదిమీపక్షమున కెట్లా ధారముకాగలదు?

మఱియు, యజుర్వేదాదులు ఋగ్వేదానంతరమవతరించె నన్నపక్షమున, యజుర్వేదాదులందు క్షత్రియవైశ్యశూద్రజాతులు ప్రత్యేకముప్రత్యేకముగా నభివర్ణింపబడవలెను కదా. అప్పుడు, యజుర్వేదమునందు క్షత్రియ ప్రశంసయు ప్రసన్నమగునేకాని ఋగ్వేదమునందెట్లగును? కాని, ఋగ్వేదమునందు గూడ క్షత్రియాదుల ప్రస్తావమున్నది. కాబట్టి యజుర్వేదాదులార్యుల ప్రయాణక్రమమున ప్రభవించియుండ నేరవు. క్షత్రియాదివర్ణత్రయము నట్లే. అంతేకాదు. వర్ణభేదములార్యుల ప్రయాణక్రమమున నుద్భవించుచు వచ్చెననుటకు ప్రమాణమేమియునులేదు.

మఱియు శీతోష్ణభేదముల ననుసరించి శ్వేతాదివర్ణము లంపహాంతర భేదములుద్భవిల్లుచుండుటంజేసి, వానిననుసరించి గణనాతీతజాతులుద్భవింపవలెను కదా. అట్టిజాతులేవి? అందుకాధారమేమి? ఆర్యులొకదేశమునకు రాగా నొకరంగుగలవారై మఱియొకదేశము బ్రవేశించినతోడనే మఱియొకరంగునొంది మఱియొకజాతి బొందవలసినవారు కదా. అట్టినానాజాతుల జేర్కొనరేమి? కాబట్టి శీతోష్ణస్థితుల ననుసరించి రంగులుమారుచున్నప్పటికి, రంగులననుసరించి జాతిభేదము పొసగదు.

తిలకుయొక్క సిద్ధాంతము తప్పనియీపుస్తకమున నేను వాదించుటలేదు. అదియొప్పైనను తప్పైనను, దేహవర్ణమును బట్టి జాతిభేదమను నంశమును సాధింపజాలదు. దాన, బుట్టుకననుసరించి జాతియను నాసిద్ధాంతమునకు భంగములేదు.

మఱియు, శ్వేతవర్ణముగలవారు బ్రాహ్మణులను మాప్రతిపక్షుల సిద్ధాంతము ప్రకారము, వర్తమానకాలమున బ్రాహ్మణులుగా బరిగణింపబడుచున్న హిందూదేశపు జనులు బ్రాహ్మణులు గాక పోవలసివచ్చును. ఏలన న

ష్ణదేశమైన హిందూదేశమందలి బ్రాహ్మణపదవాచ్యులందఱును శ్వేతవర్ణము
కలవారుకారు. హూణులు ప్రాయికంబుగా శ్వేతవర్ణముగలవారుగాన బ్రా
హ్మణులు కావలసివచ్చును. కృష్ణద్వైపాయనుఁడు (వ్యాసుఁడు) కృష్ణవర్ణము
కలవాడుకాన బ్రాహ్మణుడుకాక పోవలసివచ్చును. కాని, బ్రాహ్మణుడనియే
లోకప్రసిద్ధి. కృష్ణద్వైపాయనుడు బ్రాహ్మణుడను శాస్త్రప్రమాణమును
లోక ప్రసిద్ధిరూపమైన లౌకికప్రమాణము నంగీకరింతుమేని, వర్ణముదేహవర్ణ
మునను సరించివచ్చునను సిద్ధాంతమును విసర్జింపకతప్పదు. మఱియు, శ్రీకృ
ష్ణుడుకృష్ణవర్ణముకలవాడుగనుక శూద్రవర్ణువాడనిచెప్పవలసివచ్చును, కా
ని క్షత్రియవర్ణముకలవాడేయని గ్రంథములువక్కాణింపుచున్నవి.ఇట్టిప్రమా
ణములజూడ శరీరవర్ణమున ననుసరించి వర్ణమేర్పడుటలేదని తేలుచున్నది.

పూర్వకాలమున స్థూలశరీరముయొక్కవర్ణము ననుసరించియే, బ్రాహ్మ
ణాదివర్ణములేర్పడుచుండెడి వననిక్కాలమునతదాచారంబువిస్తీర్ణమైన భరత
ఖండమునందెక్కడనుండకుండుటకు దగినకారణము కాన్పించదు.

మఱియు, దేహకాంతి ననుసరించి వర్ణనిర్ధారణజేసి వృత్తులను విభ
జింపవలసినంత యుగత్యము కాన్పించదు. దేహకాంతి కనుగుణమైన యోగ్యతా.
విశేషమే యుండునుగనుక దేహకాంతి ననుసరించి వృత్తివిభజనము చే
యవచ్చునన్నయెడల, నదిసరికాదు. అట్టియోగ్యతావిశేషములు త్తరదిగ్భాగ
మునందు మానవకోటినివసించు కాలమునందు మాత్రమభివ్యక్తములై యుండ
నేరవాయేమి? ఆయోగ్యతావిశేషముల ననుసరించి యప్పుడుమాత్రము భిన్న
జాతులు పుట్టియుండకూడదా? యోగ్యతావిశేషాదులున్నప్పటికి నక్కాలం
బున బ్రాహ్మణేతర జాతులు లేవన్నచో బిహ్మట మాత్రమవి యుద్భవిం
చుటకు గారణమేమి?

భిన్నవృత్తులనుటకు వీలులేదు ఏలన నట్టివృత్తులు తత్పూర్వమందును క
లవు. వృత్తిభేదముచేతనే జాతిభేదమన్నచో వృత్తిభేదము పురాతనకాలమున
కూడకలదుకాబట్టిజాతిభేదముండియుండెనని చెప్పవలసివచ్చును. కానియీవా

లంబున జాతిభేదములేదని మనప్రకృతపు ప్రతిపక్షులునుడివియున్నారుకదా. కాబట్టి కేవలవృత్తివైచిత్ర్యమునననుసరించి జాతివైచిత్ర్యముకల్గెనని మనప్రకృతపుప్రతిపక్షులు చెప్పవీలులేదు.

అంతియకాదు. దేహముయొక్క రంగు, యేవృత్తికి నొకడర్హుడో, దాని కనుగుణముగానే యుండునన్నపక్షమున, నట్టివృత్తులును తద్యోగ్యతా విశేషములును పురాతనకాలమునందుకూడ కలవుగనుక వానికనుగుణములైన దేహవర్ణవిశేషములుకూడ పూర్వంబుననుండి యుండవలెను. కాని శ్వేతవర్ణ మొక్కటిమాత్రమే యక్కాలంబున నుండెనని మనప్రతిపక్షులు ముందు అంగీకరించియున్నారుకదా. కాబట్టి దేహవర్ణము వృత్తియోగ్యతల నవశ్యమనుకరించియుండు ననుటసరికాదు. కాబట్టి వృత్తియోగ్యతల ననుసరించియే చాతుర్వర్ణ్యముత్పన్నమగునని వాదముకొరకంగీకరించినప్పటికి, దేహవర్ణము (రంగు) బట్టియే నాల్గువర్ణములును జనించినవని చెప్పశక్యముకాదు.

ఇకనొకవిషయము విచారింతము. ఎవడైన నొకడు మఱియొకని సమీపమున కేగినప్పుడు నీవర్ణమెద్దియని వానినాతడడుగుట, కొన్ని మతగ్రంథములందు జూచుచున్నాము. దేహమురంగు ననుసరించియే, జాతికూడ నిర్ధారణీయమని మతగ్రంథముల యభిప్రాయమన్నచో, దేహవర్ణము స్ఫుటంబుగా దృశ్యమగుచునేయున్నదిగాన మఱల నీజాతియేదియని ప్రశ్నించుట కెంతమాత్రము నవకాశముండదుకదా. కాని దేహవర్ణము స్ఫుటముగా గోచరమగుచున్నను తద్వర్ణమును వీక్షించియే జాతినిర్ధారణము జేయక, నీజాతియేదియని ప్రశ్నించుటవలన, జాతినిర్ధారణము నిమిత్తము దేహవర్ణ మపేక్షింపబడలేదని స్పష్టమగుచున్నది. కాబట్టి జాతిభేదమునకు వర్ణభేదమాది కారణమనుట మతసంప్రదాయ విరుద్ధము.

ఈసందర్భమున నొకయుదాహరణంబు నిచ్చెదను. దుష్యంతమహారాజునకు శాకుంతల యేజాతిస్త్రీయై యుండునాయని శంకపొడమినది. శరీరవర్ణముచేతనే జాతినిర్ధారణీయమన్నయడల, ప్రత్యక్షముగా గోచరమగుచు

న్న తద్వనితయొక్క దేహవర్ణము ననుసరించి యామె జాతియూహింపబడవలె
నుకదా. కాని యట్లు కాలేదు. రంగునుబట్టి జాతియూహ్యమనుటకు మారు
గా "సతాంహిసందేహపదేషు వస్తుషుప్రమాణమంతఃకరణ ప్రవృత్తయః"
అను మఱియొక ప్రమాణముచెప్పిన దుష్యంతుడు సందేహమును నివర్తించు
కొనెను. కాబట్టి వర్ణముచేత జాతియను వాదము శాస్త్రవిరుద్ధముగా నను
పేక్షణీయము.

వర్ణము (రంగు) చేతవర్ణము (జాతి) సంభవించు నాచారముపూర్వ
కాలంబునలేదేని, రంగునర్థమిచ్చువర్ణ పదము జాతికిబర్యాయపదముగా నేల
బ్రయోగింపబడుచున్నదని ప్రతిపక్షియాక్షేపించినయెడల, నదినిలువదు.
కేవలశబ్దార్థమేప్రమాణమన్నచో, పుట్టుకతోడనే జాతియేర్పడదేని, పుట్టు
కనర్థమిచ్చు "జాతి" పదమువర్ణమునకు బర్యాయపదముగా నెందుకువాడబడు
చున్నది? వర్ణశబ్దము రంగును సూచింపుచున్నది గాన వర్ణభేదమురంగులనను
సరించి వచ్చినదన్నపక్షమున, జాతిశబ్దము పుట్టుకను సూచించుచున్నదిగాన
వర్ణభేదము (జాతిభేదము) పుట్టుక ననుసరించియే యుద్భవమగుననిమాత్రము
చెప్పుటకేమియాక్షేపంబు?

మఱియు, వర్ణమనిచెప్పబడుచున్నది గనుక వర్ణము (జాతి) రంగు
నుండి కలుగుచున్నదనివాదించినచో, వర్ణమనిచెప్పబడుచున్నది గనుక వర్ణము
(అకారాదికము) రంగునుండియే యుద్భవించుచున్నదని యొప్పుకొనవలసి
వచ్చునుకదా! కాని, వర్ణములనిపిలువబడుచున్న అ, ఇ మొదలైన యక్షరము
లు రంగునుండి పుట్టిన వనుట నమ్మతగినదిగాలేదు. కాబట్టి వర్ణమనిచెప్పబడు
చున్నది గాన వర్ణము (జాతి) దేహమురంగువలన బుట్టుచున్నదనువాదము
తప్పు.

మఱియు, "బ్రాహ్మణో శ్వేతవర్ణః ......ఇత్యాదినియమాభావాత్"
(శ్వేతవర్ణముగలవాడు బ్రాహ్మణుడు—ఇట్టినియమములేకపోవుటచేత) రం
గునుబట్టి వర్ణభేదమేర్పడదని వజ్రసూచికోపనిషత్తే వక్కాణింపుచున్నది

కదా. వజ్రసూచికోపనిషత్తు ప్రమాణమైనపక్షమున రంగును బట్టి వర్ణభే
దమను వాదమును విసర్జింపుడు. ప్రమాణము కానిపక్షమున, బ్రహ్మజ్ఞానము
చేత బ్రాహ్మణత్వమను వాదమును విడువవలెను. ఉభయపక్షములందును ప్ర
తిపక్షులకేనష్టము.

రంగునుబట్టి వర్ణమనిచెప్ప గ్రంథప్రమాణములున్న వందురేమో.
ఉండినను, అదిదేహముయొక్క రంగునుబట్టికాదు; సాత్వికాదిగుణముల రం
గునుబట్టి. సత్వగుణముమొదలైన వానికిరంగులుండుట యసంభవముకాదాయ
నిశంకించినచో, నదియౌపచారికమని సమాధానము. కాబట్టియే శ్రీబాలరామో
దాసీనస్వామి సాంఖ్యతత్వకౌము దీవ్యాఖ్యానమున నిట్లునుడివియున్నారు
"యద్యపిలోహితత్వాదయో వర్ణానరజః ప్రభృతిషుగుణేష్వద్ధా విద్యన్తేతథా
పియథాలోహితం మహారజనాది వసనంరఞ్జయతి తథారజోపిపరివృత్యామ
నోరఞ్జయతీతిలోహితం రజః, ఏవం యథాశుక్లం సలిలం విమలయతి తథా
సత్వమపిజ్ఞానాదినా మనోవిమలయతీతి శుక్లం సత్వం, ఏవం యథానీలంఘ
నపటలమావృణోతి తథాతమోపిజ్ఞాన మావృణోతీతి కృష్ణం తమః, ఇత్యేవముప
పచారేణ గుణానాంలోహితత్వాదిక మున్నేయం" శ్వేతవర్ణము నీటినెట్లు
విమలముగా జేయునో, అట్లుసత్వగుణము జ్ఞానాదులచేత మనంబును నిర్మ
లంబుజేయును. ఈవిధముగానే లోహితకృష్ణవర్ణములు నూహ్యములు. కాబ
ట్టి సత్వాదిగుణములకు శుక్లాదివర్ణములు పచరింపబడుచున్నవి: ఇదిసంస్కృ
తవాక్యముల సారాంశము. ఇటులనే, శ్వేతాశ్వతరో పనిషత్తునాల్గవఅ
ధ్యాయమున "అజామేకాంలోహిత శుక్లకృష్ణాం" అని ప్రకృతియొక్క
గుణత్రయమునకుశుక్లాది వర్ణత్రయము వర్ణింపుచున్నది. (అజాం=మాయాం.
లోహితేతి గుణత్రయమయీం. సరూపః=త్రిగుణః- ఇది శ్రీనారాయణ
కృతవ్యాఖ్య) (లోహిత శుక్లకృష్ణాం. తేజస్సృష్ట్వా తదవస్థాపన్నత్వా
ల్లోహితాం। అపః సృష్ట్వా తదవస్థాపన్న త్వాచ్ఛుక్లాం। అన్నశబ్దవా
చ్యాం పృథ్వీంసృష్ట్వా తదవస్థా పన్నత్వాత్కృష్ణాం. అథవా లోహి-

తాం =రజఆత్మికాం ; శుక్లాం=సత్వాత్మికాం ; కృష్ణాం=తమఆత్మి
కాం ; ఏవంలోహితశుక్లకృష్ణాం. ఇది శ్రీవిజ్ఞానభగవత్కృతవ్యాఖ్యానము.
(తథాచకార్యాణాం తేజోబన్నానాం యానిరూపాణితానిమాయాయావ
పిసన్త్యేవ- ఇది శ్రీశంకరానందవిరచితవ్యాఖ్యానము) త్రిగుణాత్మకప్రకృతి
సృష్టియందు తేజముయొక్క రూపముగా బరిణమించి యుండుటచే నాతే
ముయొక్క రంగైన రక్తవర్ణమునొందిన దని చెప్పవచ్చును. ఇట్లేయితరవర్ణ
ములు నూహ్యములు. లేదా, లోహితయనగా రజఆత్మిక. ఇట్లే యితరవర్ణ
ములును. ఇది విజ్ఞానభగవత్కృతవ్యాఖ్యానసారాంశము. కార్యమైన భూత
భౌతిక ప్రపంచమందే వర్ణములు కలవో యావర్ణములు కారణమైన
(Cause) మాయయందును కలవనిచెప్పవచ్చును. ఇది శ్రీశంకరానందవ్యా
ఖ్యానసారము. లోహితాదులు కలది యనగా గుణత్రయములు కలదియని
శ్రీనారాయణ కృతవ్యాఖ్యానసారము. వీనినన్నిటిని బట్టిచూడగా త్రి
గుణములతో నొప్పుచున్నమాయకు శుక్లాదివర్ణములు చెప్పబడుచున్న
వని స్పష్టమే కదా.

శ్రీమద్భాగవతదశమస్కంధములోని మూడవయధ్యాయమందు వసు
దేవుడు శ్రీకృష్ణునిట్లుస్తుతించియున్నాడు"సత్వంత్రిలోకస్థితయే స్వమాయ
యా బిభర్షి శుక్లంఖలు వర్ణమాత్మనః । సర్గాయరక్తంరజసోపబృంహితంకృష్ణం
చవర్ణంతమసాజనాత్యయే॥" (అట్టిపరబ్రహ్మస్వరూపుండవగునీవు త్రిలోకము
లసంరక్షించుకొఱకు సత్వగుణ ప్రధానమైన తెలుపు వర్ణమును; జగత్తుల సృ
ష్టించుకొఱకై రజోగుణముచే బ్రచురింపబడిన ఎఱుపువర్ణమును; లోక ప్రళ
యమునిమిత్తము తమోగుణము చేతనలుపు వన్నెను; స్వమాయవలననీ వొక్క
డవేధరింతువు) శ్రీపోతనభాగవతమున"నీవురక్తధవళ, నీలవర్ణంబుల । జగము
సేయఁగావ, సమయఁజూడఁ । దనరునట్లు నేడు, దైత్యులఁదండింపఁ । బృథివి
గావనవతరించితీశ"అనుపద్యముమూలశ్లోకమునకు బదులుగానున్నది.ఈరక్తధవ
ళనీలవర్ణములు సృష్టిస్థితిలయహేతువులగురాజస,సాత్విక తామసగుణములను

సూచించును. కాబట్టి యేశ్రీతిక్కనసోమయాజిరచించిన నిర్వచనోత్తరరామాయణమున "సత్వరజస్తమోగుణవశస్థితిఁగైకొని లీలనీవబ్రహ్మత్వముఁదాల్చి లోకముల కన్నిటికింజననంబొనర్తువి । విష్ణుత్వముఁదాల్చి వానికిమనోజ్ఞతరస్థితి ప్రవృత్తి జేర్తురు । దరిత్వముఁదాల్చి వానికుచితంబుగ సంహృతిఁగూర్తురాఘవా॥" కాబట్టి శుక్లాదివర్ణములు బ్రాహ్మణత్వాదులనునిర్ధారించునను వాక్యములు సత్వగుణము మొదలైనవి బ్రాహ్మణాదివర్ణముల గలుగజేయునను నభిప్రాయముగలవి. ఆగుణములు పూర్వజన్మమందలివని మొదటదెల్పియే యున్నాను కదా. అందువలన, స్థూలశరీరవర్ణము ననుసరించి జాతియనుట నిజముకాదు; జన్మనుబట్టియనుట సత్యము.

మఱియు. మేనుయొక్క రంగునుబట్టి జాతియన్నచో, శ్వేతరోగులే వర్ణమువారు? బ్రహ్మణబ్రహ్మో(Brahmin Brahmos)లన్నట్లు బ్రాహ్మణబ్రాహ్మణులాయేమి?

శరీరవర్ణవాదుల కీర్తికర్త్వారాదులకంటె నెక్కువగా దెల్లగానున్నదే! వీరిసత్వగుణము శుభ్రముగా నున్నప్పుడు, మాప్రకృతిసత్వగుణము మాత్రము శుభ్రముగానుండనేరదు కాబోలు!

—:పురుషసూక్తము—వర్ణభేదము:—

బ్రాహ్మణోస్య ముఖమాసీదిత్యాదియుక్క బ్రాహ్మణాది వర్ణసృష్టిని బోధించుటకు వచ్చినదా, లేక, బ్రాహ్మణాదులను విరాడ్విగ్రహముయొక్క ముఖముమొదలైన వానితో బోల్చుటకుద్దేశింపబడినదా? ఉభయపక్షములందును పుట్టుకననుసరించియే వర్ణవిభాగమను సిద్ధాంతమునకు భంగములేదు.

మొదట, రెండవపక్షమును స్వీకరించి విచారింతము.

పూర్వపక్షము:—బ్రాహ్మణుడు విరాట్స్వరూపుని ముఖమగుచున్నాడు. అనగా, వివేకప్రధానుడౌటచే నాతని ముఖమువంటివాడు. అటులనే క్షత్రియుడు బలవీర్యాది ప్రధానుడు కాబట్టి బాహువులనదగినవాడు. అటులనేశూద్రుడు శుశ్రూషజేయుటకు దగినవాడుగనుక పాదములవంటివా

ముఖముతో సమానుఁడు; ఈవిధముగానే యితరవర్ణముల వారును వారివా రిగుణముల చేతనే ఆయాయంగములని చెప్పెడుపక్షమున, బ్రాహ్మణునియం దువివేకాదులేలలేకపోవలెను? వివేకాదులున్నప్పుడే బ్రాహ్మణుఁడు విశ్వవిగ్రహుని ముఖముతో సమానుఁడుగదా. పరాక్రమాదులున్నప్పుడే క్షత్రియుఁడు బాహువులతో సమానుఁడుగదా. అట్టివివేకాదులే లేనప్పుడు ముఖసమానుఁడని చెప్పుటకు వీలుండనేవీలుండదు. పరాక్రమాదిగుణాభావమందు క్షత్రియుఁడు బాహుతుల్యుఁడనుటకు వీలుచిక్కనేచిక్కదు. అయినను పురుషసూక్తములోని వాక్యములు తుల్యుఁడనియే నుడువుచున్నవి. ఆమాటలునిరర్థకములా? ఆ శ్రుతివాక్యములు సార్థకము చేయవలెనన్న, వివేకాదిగుణంబులున్నవాఁడే బ్రాహ్మణుఁడనియు అట్టివాఁడే ముఖతుల్యుఁడనియు గ్రహింపక తీరదు. అంతియేకాని, పుట్టుక చేత బ్రాహ్మణుఁడును, పుట్టుక చేత క్షత్రియుఁడును కాఁడు. ఏలన జన్మబ్రాహ్మణులన్న యెడల, సాదృశ్యము సంఘటింపనేరదు. గాన, గుణములననుసరించియే వర్ణమని పురుషసూక్తముయొక్క యభిప్రాయము.

సిద్ధాంతము:—కాదు ఏలన, సామాన్యముగా బ్రాహ్మణాదులకు వివేకాదులుండును గనుక వారుముఖాదులతో బోల్పబడిరి. ఈకాలమున జన్మచేత బ్రాహ్మణులైనను, తదర్హంబులైన వివేకాదులును, క్షత్రియులైనను తదర్హంబులైన శౌర్యాదులును అంతగా లేనిమాటసత్యము. అయినను, పూర్తిగాలేవనుటకు వీలులేదు. కొందఱి యందాగుణంబులు మరుగుగానుండవచ్చు. మఱియు, బ్రాహ్మణాదులను విరాణ్మూర్తి ముఖాదులతో సరిజేసినప్పుడు, వివేకాదులున్న బ్రాహ్మణాదులే న్యాయముగా గ్రహింపవలయును. తద్గుణహీనులు కాదు. ఏలన, వివేకాదులులేని బ్రాహ్మణులన్న యెడల, ముఖాదులతో సాదృశ్యము సంఘటించనేరదు. పురుషసూక్తము సాదృశ్యము జెప్పుచున్నదనియే కదా మీరుగ్రహించిరి అట్టిసాదృశ్యమును సమన్వయించి నిల్పుటమనపని. అట్లునిల్పుటకు, వివేకాదులున్న బ్రాహ్మణులనియు, శౌర్యాదులున్న క్షత్రియులనియునీవిధముగా శ్రుతియుద్దేశించి పల్కుచున్నదని యెంచదగినది. బ్రా

హ్మణులు ముఖతుల్యులనగా, వివేకాదులుగల జన్మబ్రాహ్మణులే ముఖసమానుల
ని శ్రుతియభిప్రాయముగా మనముగ్రహించుట యుచితంబు. కాదన్నయె
డల, శ్రుతిసార్థకముగాని సాదృశ్యము ప్రసంగించు చున్నదని స్వీకరింపవలసి
వచ్చును. అదిమంచిది కాదుగదా. నాయభిప్రాయమును స్పష్టముజేయుట
కీ దృష్టాంతము నిచ్చుచున్నాను. గోవుమాతృసమానమన్నప్పుడు, క్షీరముగ
ల గోవనియా, లేక, గొడ్డుగోవనియా యభిప్రాయము? క్షీరమేమియునివ్వ
ని గోవన్నచో,మాతృసాదృశ్యమెట్లునిల్చును? తల్లివలెబాలిచ్చుటయెట్లు సంభ
వించును? పాలున్నగదా, పాలిచ్చితల్లితో సమానమగుట! పాలేలేనప్పుడిక
దల్లితో సమానమెట్లు కాగలదు? కాబట్టి' గోవుమాతృ సమాన'మన్నవాక్య
మును సమర్థించుటకు పాలిచ్చుగోవేమాతృ సమానమని వాక్యాభిప్రాయము
గా మనముగ్రహించుట యోగ్యము. అటులనే, బ్రాహ్మణుడు విరాట్పురుషు
ముఖోలువన్నప్పుడు,వివేకాదిగుణసంపన్నుడైనబ్రాహ్మణుడే ముఖమువంటివాడ
ని యభిప్రాయము. అంతియేకాని, వివేకాదిగుణహీనుడు కాడు. బ్రాహ్మణా
దులకు వివేకాదులు సాధారణముగా గల్గియుండుహేతువుచేతను, లేనిపక్ష
మున వివేకాదులు సంపాదించుట విధికాబట్టియు, బ్రాహ్మణాదులు ముఖా
దులతో సమముజేయబడినారని తెలియదగినది. ఈరీతినిశ్రుత్యర్థమును సమ
న్వయింపవచ్చును. కాబట్టి వివేకాదిసంపన్నులైన బ్రాహ్మణాదులు మాత్రమే
సాదృశ్యమున గ్రహింపబడిరని గ్రహింపవలయు.

పూర్వపక్షము:— ముఖాద్యవయవములతో బ్రాహ్మణాదివర్ణములకు
సంబంధము శ్రుతిప్రోక్తము గనుక, ముఖాద్యవయవగౌరవ తారతమ్యము న
నుసరించి బ్రాహ్మణాదిగౌరవ తారతమ్యము ద్యోతించుచున్నది. అందువల
న, నొకవర్ణమువారింకొక వర్ణమువారినిద్వేషించుట తటస్థించిదేశము దురవస్థం
జెందుచున్నది. కాబట్టి యీవర్ణవిభాగమునే మాన్పించుట శ్రేయస్కరం
బు. వర్ణభేదమున్నప్పుడు గౌరవభేదములుండకతప్పదు. గౌరవభేదములు
న్నప్పుడన్యోన్యద్వేషములుండక మానవు. అన్యోన్యద్వేషములున్న సమయము

నదేశమంతయు గలహానలముచే దహ్యమానముగాక మానదు. కాబట్టి యిట్టి కష్టము లేకుండజేయుటకు వర్ణవిభాగాభావోపకమగత్యము.

సిద్ధాంతము:—కాదు. ఏలన, నీబాహాప్రసంగమునకే యవకాశము లేదు. ఏలన, నన్యోన్యద్వేషములున్నప్పుడే కదా దేశముకలహానలముచే ద హింపబడుట. ద్వేషములకేయవకాశములేదు. ఎట్లనగౌరవభేదములున్నప్పుడు కదా ద్వేషములుండుట. గౌరవభేదమేలేదు. ఇదియెట్లు ? బ్రాహ్మణాదివర్ణ ములకు న్యూనత్వాధిక్యములే లేవుగనుక ; ముఖాద్యవయవములకు గురుత్వ ల ఘుత్వాదులే లేవుగనుక. బ్రాహ్మణులగ్రవర్ణమువారన, శూద్రులు నగ్రవర్ణ మువారే ; ముఖమొక యగ్రము, పాదద్వంద్వము మఱియొకయగ్రము ! బా హువు లొకయగ్రము, ఊరువు లికనొకయగ్రము—దేనికదే యగ్రము ! మఱి యు, ముఖాదుల నుతులయందు దూచినపిమ్మట నేయవయవము మిక్కిలిబరువు (గురుత్వము) కలదనితేలునో యాయంగము గౌరవాధిక్యముగలది, తత్సంబం ధమైన వర్ణమువారు గౌరవాధిక్యముగలవారు! దీనికేమి?

బ్రాహ్మణులకు వేదాధ్యయ నాదిక్లేశములు శాస్త్రము విధించుచున్న ది. కాని, శూద్రులకుగాదు. కాబట్టి బ్రాహ్మణులకన్న శూద్రులుగొప్పవా రు, అధికసుఖవంతులు. అటులనే వైశ్యులకన్నను, క్షత్రియులకన్నను, కూడశూద్రులు సుఖవంతులే. క్షత్రియులకు బ్రాణాపాయకరమైన సంగ్రా మకర్మవిధింపబడినది. కాని, బ్రాహ్మణవైశ్యశూద్రులకుగాదు. కాబట్టివీరు క్షత్రియులకంటెను ఘనులు, భాగ్యవంతులు. వైశ్యులకుగృషివాణిజ్యాదిక్లే శములు విధింపబడుచున్నవి. తదితరజాతులకు గాదు. కాబట్టి యాజాతుల న్నియు వైశ్యులకంటె నెక్కువయదృష్టము కలవి. శూద్రులకు విధింపబడిన ది యితరజాతులవారికి గాదు. కాబట్టివారు శూద్రులంటె గొప్పకారు. మఱియు బ్రాహ్మణులితరజాతుల వారిచే బూజింపదగిన వారు; కాననన్ని జాతులవారిలోను ముఖ్యులు. క్షత్రియులు సేవింపదగిన వారు. కాన, శ్రే ష్ఠతములు. వైశ్యులు గౌరవింపదగినవారు; గనుక ఘనతములు. శూద్రులుపో

షింపఁబడినవారు; కాబట్టి యుత్తమోత్తములు. కాబట్టి యన్నివర్ణములవారును ఘనతములే ఇక వివాద మెందుకు? ద్వేషమెందుకు ?

మఱియు ముఖమున్నది. అది దానిపని చేయనప్పుడు శ్రేష్ఠమగునా? బ్రాహ్మణులున్నారు; వారు విజ్ఞానాదివిహీనులేని, ఘనులా? బాహువులున్నవి; ఆవిపరాక్రమాది భూషితములు కావేని, శ్రేష్ఠములు కాఁగలవా? క్షత్రియులున్నారు; వారుప్రతాపోద్దీపితులు కారేని, ప్రముఖులా? ఊరుద్వంద్వము కలదు; అదిశరీరమును నిల్పుటమొదలైన పనులు చేయనిచో ముఖ్యమగునా? వైశ్యులున్నవారు; వీరు ధనధాన్యాదులను సంచితముచేసి, యితరవర్ణములవారికి జీవనాధారము గల్పింపరేని, ఉత్తములా? పాదములున్నవి; అవిగమనాదులకు బాగుగనుపయోగింపని పక్షమున శ్రేష్ఠములగునా? శూద్రులుకలరు; వీరితరవర్ణములవారికి సహకారులు కారేని, గొప్పవారు కాఁగలరా? కాఁజాలరు. కాబట్టి ముఖాదులకు గౌరవతారతమ్యమున్నను, వానికుండవలసిన లక్షణములున్నప్పుడు మాత్రమే, యాతారతమ్యము సంభవమగును. అటులనే, బ్రాహ్మణాదివర్ణములకు సహజముగా గౌరవభేదమున్నదన్నను, అది బ్రాహ్మణాదులకు వారివారి కుండవలసిన వివేకాదులున్నప్పుడు మాత్రమే సమంజసమగును.

మఱియు, కడుపునకు నితరావయవములకు స్పర్థకల్గియాయాయవయవములాయాపనులుమానినందున దటస్థించిన యవస్థయెట్టిదో బాల్యమునఁగథలు చదివిన వారెల్లనెరుంగుదురు. దేహమునం దెంతచిన్నయంగమునకు గీడుసంభవించినను, సర్వాంగములును తద్బాధననుభవించి కృశించుచందమున, వర్ణచతుష్టయముననే వర్ణమునకునష్ట మొదవినను, వర్ణములన్నియు నష్టమొందవలసినవే కొన్నికొన్ని యంగములు దూరదృష్టిలేని వారికి నీచములుగా గాన్పించినను, విమర్శింపసామర్థ్యముగల పండితులకు మాత్రమాయాయంగముల యావశ్యకతయు, నవిలేనందున గల్గుబాధయు, బాగుగా స్ఫురింపక మానవు. అందుచేతనే, విరాడ్విగ్రహునియవయవములతో వర్ణములకు సామ్యమువివ

రింపబడినది. "Body Politic" అని పశ్చిమదేశములందు వ్యవహరింపబడుమాటయు నీయర్థమే బోధించును. సాంఘికసౌధమునకు వర్ణచతుష్టయము స్తంభచతుష్టయము వంటిదని చెప్పవచ్చును. అన్నివర్ణములకును గౌరవముకలదు.

పూర్వపక్షము:-ముఖముతదితరావయవములకంటె శ్రేష్ఠతరమౌనా కాదా? శ్రేష్ఠతరమేని, బ్రాహ్మణులితరవర్ణములవారికంటె ఎట్లు శ్రేష్ఠతరులు కారు? పాదములితరావయవములకంటె నీచములౌనా కాదా? నీచములేని, శూద్రులితరవర్ణముల వారందరికంటెను నీచులేకదా. కాబట్టి ముఖాద్యవయవములవలె బ్రాహ్మణాదివర్ణములు సహజముగా గౌరవభేదములుగలవి.

సిద్ధాంతము:—పారమార్థిక దృష్టితో జూచినయెడల నొకయవయవమునకును, మఱియొకయవయవమునకును భేదమేలేదు. అన్నియునణుసంయోగముచే గల్గినవేకదా. అన్నియుభగవద్వికారములేకదా. ఇకవర్ణములందు మాత్రము పారమార్థిక భేదమెట్లుండగలదు? అయినను, లౌకికదృష్టితో జూచినయెడల, ముఖాదులకన్యోన్యభేదమున్నదని భావించుచున్నారు. అటులనే యొకవర్ణముకంటె మఱియొకవర్ణమధికమని లోకులుభావింపనిండు. లోకులైనను, ముఖాదులసహజచేష్టలబురస్కరించుకొనియే తారతమ్యంబు గ్రహించుట మనమెఱింగిన విషయమేకదా? ఏయవయవమున కుండుచేష్టలా యవయవమునకు లేనప్పుడు ఒకదాని కంటె మఱియొకటి ఘనతరమెట్లుకాగలదు ? ఏవర్ణమునకు విహితములైన ధర్మములావర్ణము వారాచరించని పక్షమున, నికనొకనికంటె నింకొకడు గొప్పవాడగుట యెక్కడిది? కాబట్టి ముఖముతనకుండవలసినవి జ్ఞానాదులు లేనప్పుడు, తనకుండవలసిన యుక్తసంచారాదిక్రియలుగల పాదములకంటె నీచము. అటులనే యొకబ్రాహ్మణుడు తనకర్మంబులైన ధర్మములులేని వాడైనచో, తనకుయోగ్యంబులైనసజ్జనశుశ్రూషాదులుకల్గిన శూద్రునికంటె నీచుడు: ఇటులనే, యితరులసంగతియు నూహింపవలెను.

ఇకనొకవిషయము మరువఁగూడదు. అదియేదియన, శూద్రాదిజాతులైనను విరాట్ పురుషుని దేహభాగములతోనే తుల్యములని శ్రుతి తెల్పియున్నది. మఱియు, "కదావాత్వాంపృష్ట్వాగిరిశతవభవ్యాంఘ్రియుగళంగృహీత్వాహస్తాభ్యాంశిరసినయనే వక్షసివహన్। సమాశ్లిష్యాఘ్రాయస్ఫుట జలజగంధాన్పరిమళానలభ్యాం బ్రహ్మాద్యైర్ముదమనుభవిష్యామిహృదయే॥" అని శివానందలహరీ స్తోత్రమునందు చెప్పబడినరీతిగా బ్రహ్మాదులకును అలభ్యములైన ఈశ్వరపాదపద్మములతో శూద్రులుసమానము జేయబడుటవారికొకింతయునగౌరవముగాదు; గౌరవావహమే. మఱియు, కటాక్షము సంపాదించుట కెవ్వరైన బాదములబడుదురుగాని, జుట్టుపట్టుకొనెదరా?

కాబట్టి విరాణ్మూర్త్యంగములతో సామ్యముమాత్రమే చెప్పబడినదన్నను, జన్మననుసరించియే వర్ణమనునంశముసిద్ధాంతితము. సమస్తవర్ణముల యావశ్యకతయు, సమానగౌరవమును స్పష్టముగా దెలిసికొన్నవారమైతిమి.

ఇప్పుడు, చాతుర్వర్ణ్యసృష్టిశ్రుతిచే స్వీకరింపబడినదనుపక్షమునించుక విచారింతము. ఇందుకు ప్రమాణము, విద్యారణ్యభాష్యము "ప్రశ్నోత్తరరూపేణబ్రాహ్మణాదిసృష్టింవస్తుంబ్రహ్మవాదినాంప్రశ్నా ఉచ్యన్తే" (ప్రశ్నోత్తరరూపముగాబ్రాహ్మణాదుల సృష్టినివివరించుటకు బ్రహ్మవాదుల ప్రశ్నలు చెప్పబడుచున్నవి.) మఱియు మహీధరభాష్యమునందునచ్చముగా నీమాటలే కలవు: అంతేకాదు "చాతుర్వర్ణ్యంమయాసృష్టం" అనుగీతాశ్లోకభాష్యమునశ్రీశంకరాచార్యులు "బ్రాహ్మణఃఅస్యముఖమాసీత్" అనుశ్రుతిని ప్రమాణముగాజూపియున్నారు. అటులనే శ్రీశంకరానంద కృతగీతావ్యాఖ్యయందు "బ్రాహ్మణోస్యముఖమాసీత్' ఇతిశ్రుత్యుక్త ప్రకారేణచత్వారోవర్ణాః:" అనియు "ముఖాదుత్పత్తితో వాప్రాప్తం=బ్రాహ్మణజాతేరర్హం" అనియు వ్రాసియున్నారు (అ 18-శ్లో 41, 42) మఱియు, మనుస్మృతియందీయర్థమే బోధించుశ్లోకముకలదు. అదియేదియనగా, "లోకానాంతువివృద్ధ్యర్థంముఖబాహూరుపాదతః। బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ

నిరవర్తయత్" లోకముల యభివృద్ధికొఱకై ముఖము, బాహువులు, ఊరువు
లు, పాదములు, వీనినుండి బ్రాహ్మణుని, క్షత్రియుని, వైశ్యుని, శూద్రుని,
సృజించెను) అనునది. వీరంపరును భ్రాంతులా? శ్రుతిస్మృతులేకీభవించుట
లేదా? తన్మార్గముననే శ్రీ విద్యారణ్యాదులు వ్యాఖ్యానములు వ్రాసిరి.

ఇతరవేదములం దెచ్చటను ముఖాదులనుండి బ్రాహ్మణాదిసృష్టి వర్ణిం
పబడియుండలేదు గనుక నీయర్థము వేదవిరుద్ధమందురేమో. అట్లనుటకు వీ
లులేదు. ఏలన, యజుస్సంహితయొక్క సప్తమకాండయందు ముఖాదులనుం
డి బ్రాహ్మణాదిసృష్టివిస్పష్టముగా వక్కాణింపబడుచున్నదని శ్రీవిద్యార
ణ్యులే భాష్యమునందు లిఖించియున్నారు. ఎట్లన, " ఇయంచముఖాదిభ్యో
బ్రాహ్మణాదీనాముత్పత్తిః యజుస్సంహితాయాం సప్తమకాండే 'సముఖత
స్త్రివృతంనిరమిమీత' ఇత్యాదావిస్పష్టమామ్నాతా" అనివిద్యారణ్యులు వ
చించియున్నారు. కాబట్టి వేదవిరుద్ధార్థమిందులేదు.

అయినను, ఔపమ్యమునిర్దేశించుచున్నచోట సృష్టిక్రమము నిర్దేశిం
చుచున్నదనుట యసమంజసముగాన, నితరవేదవిరుద్ధము కాక పోయినప్పటి
కి బురుషసూక్తప్రకరణార్థమునకే యీయర్థమువిరుద్ధమైనదనివాదించిన యె
డల నదిసరికాదు. ఏలన "చంద్రమామనసోజాతః' (చంద్రుడుమనంబునుండి
పుట్టెను)ఇత్యాదిపయిఋక్కులందును" తస్మాదశ్వాఅజాయన్త" అందువలన
అశ్వాదులు పుట్టెను) ఇత్యాది పూర్వపు ఋక్కులందును సృష్టిప్రసంగము
లుండుటంబట్టి యిది సృష్టిప్రకరణమనియే తేలుచున్నది. కాబట్టి విద్యార
ణ్య భాష్యముదానికనుగుణముగా నేయున్నది. యథాదధ్యాజ్యాదిద్రవ్యాణి,
గవాదయఃపశవఃఋగాదివేదాః, బ్రాహ్మణాదయోమనుష్యాశ్చతస్మా దుత్ప
న్నాః, ఏవంచంద్రాదయోదేవాఃఅపితస్మాదేవోత్పన్నాః"(దధిమొదలుగాగల
వస్తువులుపుట్టినవిధముననే, చంద్రాదిదేవతలును పుట్టిరి) అనిభాష్యము స్పష్ట
ముగా నుడువుచున్నది. కాబట్టి ప్రకరణ (context) విరోధములేదు.

విరోధమేకలదందురేని, చంద్రుడుమనంబునుండి పుట్టెనని యెట్లుచె

ప్పబడినది? మన మేచం(దునివలన నుద్భవించెనని చెప్పవలసియుండును గదా. అంతకు బూర్వమేచందా)దులున్న పక్షమున, జందా)దులవలన మనస్సు మొదలైనవి పుట్టెననిగాని,చందా)దులుమనస్సు మొదలైనవిగా భావింపబడిర నిగాని భావించుట భావ్యమగును. కాని, తద్వస్తుజాతము పూర్వములేక పో వుటచేతనే, మనస్సుమొదలయినవి పుట్టినట్లు చెప్పబడలేదు. మనస్సుమొద లయినవిగా భావింపబడెననియు జెప్పబడలేదు. ఒకవస్తువుండిన గ దా దానినుండి యింకొకవస్తు వుద్భవించుట; ఆవస్తువును మఱియొకవ స్తువుగా భావించుట?

తద్వస్తుజాతము యజ్ఞమునకు బూర్వములేదనుట యెట్లన, "బాహ్యా ద్రివ్యస్యానుత్పన్నత్వేనహవి రంతరాసంభవాత్పురుష స్వరూప మేవ మన సాహవిష్ట్వేనసంకల్ప్య"అనియారవ బుక్కుయొక్క భాష్యమునందుగలదు.

మఱియు, దేవతలు యజ్ఞముచేయుటకుగారణమేమైయుండునో తె లిసికొన్నప్పుడు బ్రాహ్మణాదివర్ణసృష్టివర్ణింపబడుచున్నదని తెలియగలదు! ఏ లన"ఉత్తరసృష్టిసిద్ధ్యర్థం" అనుభాష్యవాక్యానుసారముగా సృష్టి నెరవేరు టకే యజ్ఞమనుష్ఠింపబడెను. కాబట్టియే"సంభృతంపృషదాజ్యం" (దధిమి శ్రితమైనఆజ్యముసంపాదింపబడెను)"ఋచస్సామానిజజ్ఞిరే" (ఋక్కులుసామ ములునుత్పన్నములు)"పశూంస్తాంశ్చక్రే"(ఆపశువులనుత్పాదింపజేసెను)—ఈ మొదలైనవాక్యములు పురుషసూక్తమునందు గాల్పించుచున్నవి! ఈవాక్య ములుయజ్ఞముయొక్క యుద్దేశమును ప్రకటింపవేని, వాని నెట్లుసమన్వ యించెదరు?

ఇదివాస్తవయజ్ఞము కాదనియుసాంకల్పికమైన యజ్ఞమనియు, నందువలన బ్రా హ్మణాది సృష్టియసంభవమనియు వాదించినచో, మానసపూజవలన భక్తుని చే గోరబడినఫలములెట్లుసంప్రాప్తింపవచ్చునో,యావిధమునేమానసయజ్ఞ మువలననుసంప్రాప్తింపవచ్చునని ప్రత్యుత్తరము. "సంకల్పేనసమర్పయామి వరదే, సంతుష్టయేగృహ్యతాం" అనునట్లు అనేక కనకకలశపాయసాదులు

సంకల్పముతో సమర్పింపబడుచున్నవికదా. ఈసమర్పణము కేవలభావనయే కదా. అయినప్పటికి, భగవంతుడు సంతోషించి భక్తునివరంబులొసంగును. అటులనేమానసయజ్ఞమైనప్పటికి, బ్రాహ్మణవర్ణాద్యుత్పత్తికిగారణముకాగల దు. సంకల్పబలమట్టిది.

మఱియు, పురుషసూక్తమునందు మానసయజ్ఞ ప్రతిపాదకసూక్తములుకొన్నియు, బ్రాహ్మణాది సృష్టిప్రతిపాదకసూక్తములుకొన్నియుగల వు. సాంకల్పికయజ్ఞమునకు ఫలముబ్రాహ్మణాది సృష్టియే. కాబట్టి సూక్తములన్నియు సంకల్పపరములనుటకు వలనుపడదు; కొన్నిమాత్రమే యట్టివి. "తానిధర్మాణిప్రథమాన్యాసన్" (జగత్తునుధరించు ముఖ్యవస్తువులుకద్దెను) అని కడపటి ఋక్కునందు పసంహరింపబడినది కదా. కాబట్టి సృష్టిప్రకరణము లేకపోలేదు. చాతుర్వర్ణ్యమందుదాహరింపబడినది.

ముఖమొక్కటికి రెండేసికన్నుల చొప్పున వేయిముఖంబులకును రెం డువేలకన్నులుండవలెననియు, గాని- "సహస్రాక్షః" అనివేయికన్నులు మాత్రమే చెప్పబడుచున్నవిగాన, విరాట్టునకునిజముగా ముఖాద్యాకారములే దనియు, నందువలన ముఖాదులనుండి, బ్రాహ్మణాదులు జన్మించుట యసం భవమేయనియు గొందఱాక్షేపించుచున్నారు. మేమునుడువునదియునిదే! ఏ లన శ్రీమహీధరభాష్యమున "సహస్రశబ్దోబహుత్వవాచీ.సంఖ్యావాచకత్వే, సహస్రాక్ష ఇతివిరోధఃస్యాత్; నేత్రంసహస్రద్వయేన భావ్యం" అనివి స్పష్టముగా వ్రాయబడినది. అభినవపండితులకుగల గణితశాస్త్రజ్ఞానము ప్రాచీనులకును ఇంచుకకలదు. అయితే, సహస్రశీర్షత్వమెట్లన, "యానిస ర్వప్రాణినాంశిరాంసి తానిసర్వాణి తద్దేహాన్తః పాతిత్వాత్తదీయాన్యేవేతి సహస్రశీర్షత్వం" (సర్వప్రాణుల శిరస్సులేవికలవో అవియన్నియు నాత ని మూర్తియందంతర్భూతము లౌటచే,నాతనివే కాబట్టిసహస్రశీర్షత్వముసిద్ధిం చుచున్నది) అయితే, ముఖాదులనుండి బ్రాహ్మణాదులు వచ్చుటనిజమాయని న, బ్రహ్మాండదేహమునుండి రావచ్చును. పిండమునుండి కరచరణాద్యవయవ

ములుకల శిశువుపుట్టినే విధమున, బ్రహ్మాండమునుండి (విరాట్టు దేహమునుండి) కరచరణాద్యవయవములవలె బ్రాహ్మణాదులు బయలువెడలవచ్చును. పూర్వము అవిభక్తములై. యవ్యక్తములుగానున్న ప్రాణులు సృష్టిసమయమందు విభక్తములై వ్యక్తములై గోచరించును. విరాట్టునినతోడనే సర్వప్రాణి సమష్టిరూపత్వమభిప్రేతమగుచుండగా, నిక సృష్టికగ్రైననుట యసంగతమని యాక్షేపించినపక్షమున, సమాధానము జెప్పెదను. ముందుదాహరింపబడినట్లు, సర్వప్రాణిస్వరూపములు ప్రత్యేకము ప్రత్యేకముగా బ్రవిభక్తములై ప్రస్ఫురించుటకుబూర్వము కేవల బ్రహ్మాండాకారముగా నుండెను. ఆటుపిమ్మట సృష్టిప్రారంభించినప్పుడుఁ అందుండివివిధవస్తువులు వేరువేరుగా గాన్పింపసాగెను. కాబట్టి విరాడ్రూపమున విశ్వరూపమైనప్పటికి, బ్రాహ్మణాదిసృష్టిక్రమముగా నేయున్నదని తెలియవలెను. విరాణ్మూర్తికిముఖములు ప్రాణిముఖములైనపక్షమున, అశ్వాదులకును ముఖములుకలవుగాన అశ్వాదులముఖములు విరాణ్మూర్తిముఖములనియు, వానినుండి బ్రాహ్మణాదులు పుట్టిరనియు చెప్పవలసివచ్చుటచే నీసృష్టిప్రకారము హాస్యాస్పదమగుచున్నదని యాక్షేపింతురేమో. అందుకవకాశములేదు. ఏలన, "సహస్రశీర్షాపురుషః" ఇత్యాదిప్రాథమికఋక్కులు విరాడ్విగ్రహము సృష్ట్యనంతరమెట్లున్నదో తెలియజేయుట కుద్దేశింపబడినవి. సహజముగా విశ్వమువనకు మొదట గాన్పించునదిగాన దానినివిరాట్టుగా భావించుట సులభమగును కాబట్టి తద్రూపము ప్రథమంబున నిరూపింపబడినది. సృష్టికిబూర్వమే యీరూపమున్నదనుటకువీలులేదు. అట్లనుటపరిణామవాదమునకు సరియగును. కానిముత్యపుచిప్ప వెండిగాభ్రాంతివలన మారునట్లు పరమాత్మజగదాకారముగా మాయామహిమవలన నవభాసించునని చెప్పువివర్తవాదము విరాడ్విగ్రహమునకు వాస్తవత్వము నంగీకరింపదు. కాబట్టియే శ్రీవిద్యారణ్యభాష్యమున "స్వకీయాంకారణావస్థామతిక్రమ్య పరిదృశ్యమానాంజగదవస్థాం ప్రాప్నోతి నేదంతస్యవస్తుత్వం" అని ప్రతిపాదింపబడినది. కాబట్టి సృష్టికిబూర్వము విశ్వవిగ్రహములేదని స్పష్టము. వ్యావహారి

కేదశేయందు విశ్వముగోచరించుచున్నది; ఈవిశ్వమునందు మనుష్యాదుల ము ఖములున్నవి; ఈముఖములు విశ్వవిగ్రహునిముఖములుగా శ్రుతిభావింపజే యుచున్నది. కాబట్టి యీముఖములనుండి బ్రాహ్మణాదులు పుట్టిరని శ్రుతి యభిప్రాయముకాదు. మఱియేమన, పిండమునుండి యప్పుడప్పుడే ఒక్కొ క్కయవయవమే ప్రవిభక్తమై యావిర్భవించు నవస్థయందు బ్రహ్మాండమున్న ప్పుడు తన్ముఖభాగములనుండి వరుసగా బ్రాహ్మణాదులు విర్భవింపసాగిరని తెలియదగినది. ఇంతయేల, " సహస్రశీర్షాపురుషః ,, ఇత్యాదివాక్యములు భావనకుప్దేశింపబడినవి. " బ్రాహ్మణోస్యముఖమాసీత్ " ఇత్యాదులు సృష్టి వర్ణించునవి. బ్రహ్మాండముయొక్క ముఖ్యభాగములు వరుసగాముఖము, బా హువులు, ఊరువులు, పాదములు, అనిచెప్పబడి, వానినుండి వరుసగా, బ్రా హ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములు జనించెనని శ్రుతియభిప్రాయము " The neck of a tumbler (చెంబుయొక్క మెడ) అన్నప్పుడు చెం బునకునిజముగా మెడయున్నదని యాయర్థము? పాత్రమునగళము నొక్కివేసిన చో, నూపిరియాడక మరణించునా? అటులనే, విరాడ్విగ్రహమునకును ము ఖాదులు కల్పింపబడినవని భావింపుడు. లేదా, మనుష్యదేహమెట్లు పుట్టుచు న్నదో, విరాడ్దేహమునట్లే పుట్టియుండవచ్చునని భావింపుడు. దోమకునగళే బరమున్న విధమున, గజమునకును కళేబరముండవచ్చును గదా. పిండాండ మునుండి శరీరమువెలువడు రీతి నేబ్రహ్మాండమునుండియు నొకగొప్పశరీరమావి ర్భవించెననియు, దానిముఖాదులనుండి బ్రాహ్మణాదులు పుట్టిరనియు దలచి నమనపుట్టి మునిగినదా?

గర్భమునుండి పుట్టుటసంభవమైన విషయముగాని, ముఖాదులనుండి పుట్టిరనుట యనుభవవిరుద్ధము కాదాయని ప్రశ్నించినయెడల, విరుద్ధముకా దని సమాధానము. మనశిరస్సునందలి పేలన్నియు మనయోనులనుండియే పు ట్టుచున్నవాయేమి? జగమునబ్రాణులనేకవిధములుగా బుట్టుటగలదు. మనముపుట్టినచందమునసే యితరప్రాణులును పుట్టవలెనని నిర్బంధించుటకు

మనకు శక్తిచాలదు. కాబట్టి ముఖాదులనుండి జన్మించుటయు సంభవము కానేరదు;

పూర్వపక్షము:—బ్రాహ్మణాదులు తలిదండ్రులకు జన్మించుచున్నారు. ఇది ప్రత్యక్షముగా జూచుచున్నారము. విరాడ్దేహమునుండి పుట్టుచున్నారనుట యనుభవమునకు విరోధమైన విషయమేకదా!

సిద్ధాంతము:—ఇప్పటి బ్రాహ్మణాదుల మాటయిది. ప్రాథమిక బ్రాహ్మణాదుల మాటఅది. ఇట్లు సంతోషించి యూరకుండుము. ఇప్పుడైనను విరాడ్దేహమునకు బాహ్యముగా నేమియు నుండ నేరదుగనుక, జనకాదులకు జన్మించినను, విరాడ్దేహమునందే జన్మించుచున్నారు. మఱియు, దశరథునకు మారుడైన రాముడు రఘునందను డనునట్లు, పుల్లన్నకుమారుడు మానవుడన్నట్లు, ఆధునిక జనకాదులకు జన్మించినవారై నప్పటికి, వారిమూలకారణమైన విరాట్పురుషు నపేక్షించి యాధునిక బ్రాహ్మణాదులుకూడ విరాట్పురుష ముఖాదిసంభవులే యగుచున్నారు. రాముడు దశరథాత్మజుడు, ఆదశరథుడు రఘునందనుడు; కాబట్టి రాముడు రఘునందనుడు. అటులనే యొకడు బ్రాహ్మణపుత్రుడు; ఆబ్రాహ్మణుడు, వంశక్రమమున విరాణ్ముఖసంభవుడు; కాబట్టి వంశపారంపర్యమువ్యాహతంబు కాదా? ఇప్పటిబ్రాహ్మణుడు, విరాణ్మూర్తికి ముఖమువంటివాడు. అతనిపుత్రుడును విరాణ్మూర్తియొక్క ముఖమునుండి పుట్టినవాడే. వర్తమానకాలమందలి బ్రాహ్మణుడు విరాణ్మూర్తిముఖమునుండి పుట్టెను; కాబట్టి యీతనిపుత్రుడైన బ్రాహ్మణుడును విరాణ్ముఖసంభవుడే. కాబట్టి "బ్రాహ్మణోస్యముఖమాసీత్" అనుశ్రుతి భూతకాలమునకు సంబంధించినను వర్తమానకాలమునకు సంబంధించినను కూడ, బ్రాహ్మణాదివర్ణములకు ముఖాదులు జన్మస్థానములగుట స్థిరపడుచున్నది.

ఇప్పుడిక నొకవిషయమునకు వత్తము. "ముఖంకిమస్య" ఇత్యాది ఋక్కువలన విరాట్టుకు ముఖమెద్ది, బాహువులెవ్వియని ప్రశ్నింపబడుచున్నదిగాన, దానికి తరువాతనున్న "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" అనుఋక్కు

కూడ తత్పరముగానే యన్వయింపబడినప్పుడు బ్రాహ్మణాదిసృష్టి తెలుటలేద నియు, బ్రాహ్మణాదిభావనయే తేలుచున్నదనియు వాదించినపక్షమున, "పద్భ్యాంశూద్రో అజాయత (పాదములనుండి శూద్రుడుజన్మించెను) అనువాక్యము నెట్లుసమన్వయింతువు? "అజాయత" (పుట్టెను) అనుప్రయోగము బ్రాహ్మణాదివర్ణత్రయమునకు గానరాక శూద్రుని విషయమాత్రము గానవచ్చుచున్నదికాన శూద్రుని గతికూడ బ్రాహ్మణాదులకు దుల్యమేయని వాదింతురేమో. అట్లైనచో, "చంద్రమామనసోజాతః" ఇత్యాదిబహు ఋక్కులందు జన్మనుద్దేశించు పదములువాడబడినవిగాన బ్రాహ్మణాది ప్రశంసయు సృష్టిప్రస్తావమునందే వచ్చియున్నదని తలంప రేలకో?

ఋక్కులన్నియు సంకల్పపరములేయని వాదించినచో, వేదమునందెచ్చటనైన సృష్టిప్రకారము వర్ణింపబడినదా, లేక, వేదమంతయు సంకల్పసహితమైన ఉపాసనమునే బోధించుచున్నదా. ఈరెండవది కానేరదు; ఏలననది, శ్రీశాంకరసిద్ధాంత విరుద్ధము. సంప్రదాయ విరుద్ధము. వేదమంతయు గర్మనుకర్మాంగోపాసనమును విధించుచున్నదనుసిద్ధాంతము, పూర్వమీమాంసకులలో గొందరిచే నుద్ఘాటింపబడినను శ్రీశంకరయుక్తి పాషాణపాటితము. వేదమునందు జ్ఞానభాగములుగూడ గొన్నికలవని సమ్మతించినచో, షడంగవేదపారగులై సంప్రదాయ విదులైన విద్యారణ్యాదుల వాక్యములను వేదవాక్యములుగా గ్రహింపుడు.

పదునొకండవఋక్కులో "పురుషంవ్యదధుః" (పురుషునిపుట్టించిరి) అని యుండుటచేత విరాట్పురుషుడు కేవలసంకల్పమాత్రుడేయనియు, ఘటపటాదిపదార్థజాతముభంగి నిజస్వరూపముగల వస్తువుకాడనియు శంకించిన పక్షమున, సాంకల్పిక (imaginary) దేహుడైనను వ్యావహారిక సత్యత్వముకలవాడేయని జ్ఞాపకము చేయుచున్నాను. పురుషుని యజ్ఞముచేయుట యనునది కేవల భావనయైయున్నది. పశువును హోమముచేసినట్లు పురుషుని నిజముగా హోమముచేసియుండక పోవచ్చును. కాని, పురుషవిగ్రహము

కేవలభావనలో నిల్చిపోలేదు. అంతటితో నంతమునొందినపక్షమున వర్తమా
నకాలమున ననుభూయమానమా విశ్వమెక్కడనుండివచ్చియుండును? కాబట్టి,
పురుషునికి విగ్రహవత్త్వము న్యాయ్యము. తన్ముఖాదులనుండి బ్రాహ్మణాద్యుత్ప
త్తి సమంజసము.

అట్లయినచో, "ముఖంకిమస్య" (వానిముఖమెద్ది) యను ప్రశ్నలనెట్లు
సమన్వయింపవలెనని యడిగినపక్షమున, ఇట్లని నుడువుచున్నాను:—అస్యము
ఖంకిం ఆసీత్ ? (వీనిముఖము ఎద్ది, ఏమయ్యెను ? మఱ్ఱివిత్తన మేమయ్యెనన్న
ట్లు.) బాహూకా అభూతాం ? (బాహువులేమయ్యెను, వేనినిపుట్టించెను ?
ఊరూకా, ఉచ్యేతే ? (ఊరువులు ఏమనిచెప్పబడుచున్నవి ? మఱ్ఱివిత్తనము
లంకురించినప్పుడు ఏపేరు పొందుచున్నవన్నట్లు) పాదాకాఉచ్యేతే? (పాద
ములేమని చెప్పబడుచున్నవి ? అంకురించిన విత్తనములట్ల) ఇవి విశేషవిష
యప్రశ్నలు. ఇక సామాన్యరూప (General) ప్రశ్న యేదియనగా, విరా
డ్రూపమా విర్భవింపజేయబడినప్పుడే యేప్రకారములుగా నావిర్భవింపజేయ
బడెను ? ఏయేయవయవమే యేరూపముగా సృష్టింపబడెను ? ఏయేయవయవ
మునుండి ఏయేవస్తువావిర్భవింప జేయబడెను ? ఇదిసామాన్యప్రశ్నయొక్క
యర్థము. మఱియు ముఖాదులను వేనితోబోల్చిరనిగాని, వేనిని ముఖాదులుగా
భావించిరనిగాని, సూచించు క్రియలెవ్వియు ముఖాదులవద్ద గాన్పింపవు.
కాబట్టి యీప్రశ్నలుబ్రాహ్మణాదులనెట్లు భావించిరనికాదు, బ్రాహ్మణాదు
లెట్లావిర్భవించిరను సంగతి నడుగుటకు వచ్చియున్నవి. ముఖాదులేరీతిగాను
త్ప్రేక్షింపబడుచున్నవనికాదు, ముఖాదులనుండి ఎవ్వి యావిర్భవించెనని య
డుగుట ప్రశ్నల యుద్దేశము. కాబట్టి పదునొకండవబుఋక్కు సృష్టిపరమైనది.

ఇప్పుడు 12 వ బుఋక్కును సమన్వయింతము. అస్య=వీని; ముఖం=
ముఖము ; బ్రాహ్మణః=బ్రాహ్మణరూపముగా ; ఆసీత్ = ఆయెను. (విత్తనము
చెట్టుగామారినట్లు) రాజన్యః=క్షత్రియుడు; బాహూ=బాహువులే; కృతః=
చేయబడెను (క్షత్రియుడు బాహువికారుడౌనట్లు పుట్టింపబడెను, ఆభరణ

మొకటి సువర్ణవికారముగా జేయబడినట్లు, అనగా, సువర్ణమునుండి యాభరణము చేయబడినట్లు.) తత్ = అప్పుడు; యదస్యోరూ = ఊరువులేవో అవివైశ్యః = వైశ్యుడు (అనగా, నూరువులు వైశ్యరూపముగా మారెను.) వైశ్యుడాయెను; అనగా, ఊరువులనుండి వైశ్యుడుద్భవించెను.) పద్భ్యాం = పాదములనుండి; శూద్రః = శూద్రుడు; అజాయత = పుట్టెను. కారణ (Cause) కార్య (effect) ములు సంస్కృతమున నొకదానిబదులు మఱియొకటి ప్రయోగింపబడువాడుక కలదు. గాబట్టి కారణమైన ముఖము కార్యమైన బ్రాహ్మణుడుగా జెప్పబడుట వింత కాదు. కాబట్టి 12 వ ఋక్కు కూడ సృష్టినే బోధించును

ఆసీత్ (అయెను), కృతః (చేయబడెను) అజాయత (పుట్టెను) అను మూడు క్రియలున్న "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" ఇత్యాది ఋక్కునందు బ్రాహ్మణాద్యుత్పత్తినే బోధింపుచున్నవి. క్రియాబలము కూడ సృష్టిపక్షమున కనుకూలించుచున్నది.

కొందఱుపండితబ్రువులు పురుషసూక్తము ప్రక్షిప్త (interpolation) మని పేర్లుచున్నారు. శైలిభేదము మొదలైనవాని వలననీవిషయము గనిపెట్టితిమని గంతులు వేయుచున్నారు. వీరికిష్టముకాని భాగములన్నియు నెవ్వరోరచియించి వేదాదులందిమిడ్చి యున్నారని నుడువుట వీరియాచారమైయున్నది. భగవద్గీతలు భారతమున బ్రక్షిప్తములు! దశమస్కంధము భాగవతమున బ్రక్షిప్తము! "బ్రహ్మకృపాహి కేవలం" "సత్యమేవజయతి" "నాన్యః పంథాఅయనాయవిద్యతే" "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" ఇట్టి వాక్యములుమాత్రము తమజయపత్రములలో లిఖించిప్రచురించిన రమ్యముగా నుండునని కాబోలుప్రక్షిప్తములు కావు! ఈవాక్యములనైనను ఓరకటాక్షించి నిల్పినందుకు వీరికెంతయు గృతజ్ఞులమైయుందుము. దానికేమిగాని, వీరిపాండిత్యముయొక్క లోతువీరికేవిదితము. జ్యోతిషవ్యాకరణాది సమస్తశాస్త్రజ్ఞులకు నైతముదురవగాహమైన శ్రుతికదంబము వీరికిగరతలామలకమగుట భాండాగారము గ్రంథసారగ్రహణ శక్తియుక్తమగుటయే. కాని వేరుకా

ము. పదచ్ఛేదమైనను చేయజాలని పాషండాధములు వినయమురోసి, మహోన్నతులై పండితవేషములతో విద్యారణ్యాదుల ధిక్కరించుట చిత్రముగానున్నది. వీరు శైలియందు భేదముగ్రహింపగల్గిరట! వీరికిసంస్కృతమంతయు నొక్కశైలి నేయుండును! సత్యమును గ్రహింపగోరువారు వీరివేషములను విశ్వసింపక, స్వయముగా పూర్వాపరసందర్భములతో, పురుషసూక్తమును విమర్శింతురుగాక.

మఱియు, వర్ణప్రశంసగల ఋక్కులుమాత్రమే ప్రక్షిప్తములను వారు "చంద్రమామనసోజాతః" ఇత్యాదిఋక్కులకును "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" అనురెండుఋక్కులకును శైలియందేమి వైషమ్యమున్నదో చదువరులకు జూపనిండు; ఊరకప్రలపించిన లాభములేదు.

ఇంతేకాదు. పురుషసూక్తము ఋగ్వేదములోనిది కాదేని, శుక్లయజుర్వేద వాజసనేయసంహితలోనిది కాకుండపోలేదుకదా. అందును ప్రక్షిప్తమేయనిన, కృష్ణయజుర్వేదారణ్యకమునందో? అక్కడకూడ బ్రక్షిప్తమేయందము. అధర్వణవేదములోనున్న పురుషసూక్తముమాట ఏమిచెప్పవలెను? కాబట్టి వేదమునుండిదానిని బహిష్కరింపజాలము. బహిష్కరించినను, దానియభిప్రాయములను మనుస్మృతి, పురాణములు మొదలైన వానినుండి తొలగించివేయజాలము. ఇంతయేల, శ్రీశంకరవిరచిత గీతాభాష్యమునందుగూడ వర్ణోత్పత్తిసూచక ఋక్కు కాన్పించుచున్నది. కాబట్టి ప్రక్షిప్తవాదమునకు జలాంజలినిత్తము.

పురుషసూక్తమునుబట్టి, జన్మననుసరించి వర్ణమను సిద్ధాంతము నిశ్చితము. ఇప్పుడు, పురుషసూక్తగానమునుండి నిష్క్రమింతము.

---

## — శాస్త్రిచర్చ —

మొదట ప్రతిపక్షులు జూపినప్రమాణములకు బరస్పర వైరుధ్యము బ్రదర్శించి, యటుపిమ్మట కొన్నివిషయముల కేగుదము.

కృతయుగమున నున్నవారందరును బ్రాహ్మణులే; అప్పుడు నాల్గువర్ణములును లేవు. (ఇందుకు ప్రమాణము:- "యథా కృతయుగే పూర్వ మేక వర్ణమభూత్కిల" కృతయుగమున బూర్వమొక్క వర్ణమే యున్నవిధమున। మత్స్యపురాణ) ఈవిషయమునకు విరుద్ధముగా, బ్రాహ్మణాదినాల్గు వర్ణములు గూడనుండెను (బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చకృతలక్షణాః - కృతే యుగే సమభవన్ స్వకర్మనిరతాః ప్రజాః॥......ధర్మోయం కృతలక్షణః" బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనుప్రజలు కృతలక్షణములు కలవారై, అనగా, స్వకర్మనిరతులైయుండిరి. ఇది కృతయుగధర్మలక్షణము—వనపర్వ, అధ్యా 149, శ్లో 18-23)

మఱియు, దుర్గుణములున్నప్పుడే చాతుర్వర్ణ్యముగాని,! లేనిచో, బ్రాహ్మణవర్ణమొక్కటి మాత్రమే యుండును. నాల్గువర్ణములని యెప్పుడు చెప్పబడెనో, అప్పుడు దుర్గుణములు వారికున్నవనియే భావించవలెను. (బ్రాహ్మణాః పూర్వసృష్టాహి కర్మభిర్వర్ణతాంగతాః । కామభోగప్రియా స్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః । త్యక్తస్వధర్మా రక్తాంగా స్తే ద్విజాః క్షత్రతాంగతాః ॥ గోభ్యోవృత్తింసమాస్థాయపీతాః కృష్యుపజీవినః । స్వధర్మాన్నానుతిష్ఠన్తి తేద్విజా వైశ్యతాంగతాః ॥" కామోపభోగప్రియులై, క్రోధనులై, కఠినులై, ప్రియసాహసులై, స్వధర్మముపర్జించినవారై, రక్తాంగులైయున్న ద్విజులెవ్వరోవారు క్షత్రియులైరి. ఇట్లేస్వధర్మపరిభ్రంశమువలన వైశ్యశూద్రులేర్పడిరి.—శాంతిపర్వ, అధ్యా 188, శ్లో 10-13) కాబట్టి యజ్ఞమునిమిత్తముగాని; మఱియేమంచి కొఱకైకాని, క్షత్రియాదిజాతులు సృష్టింపబడలేదని స్పష్టమగుచున్నది కదా. ఇకచిత్రమైనమాట, దీనికివిరోధముగా, సదాచారసంపన్నులైనప్పటికి క్షత్రియాదిజాతీయులేయై యుండిరనియు, వారు శుద్ధాంతః కరణులైయుండిరనియు, యజ్ఞమునిమిత్తమేసృష్టింపబడిరనియు ననినడువుటయై యున్నది (యజ్ఞనిష్పత్తయే సర్వమేతద్బ్రహ్మచకారవై చాతుర్వర్ణ్యం మహాభాగయజ్ఞసాధన ముత్తమం॥ ప్రజాస్తా బ్రహ్మణాసృష్టా

శ్చాతుర్వర్ణ్యవ్యవస్థితాః। సమ్యక్ శ్రద్ధాసమాచారప్రవణా మునిసత్తమ॥ యథేచ్ఛావాసనిరతాః సర్వబాధావివర్జితాః। శుద్ధాంతఃకరణాశ్శుద్ధాః సర్వానుష్ఠాననిర్మలాః॥

మఱియు, యాగదీక్ష బ్రాహ్మణత్వమును నొసంగును (సహిదీక్షమాణ ఏవబ్రాహ్మణతామభ్యుపైతి—ఐతరేయబ్రాహ్మణ 7-23) ఈమాటకు విరోధముగా యాగములెన్ని చేసినను, సుశీలములేనివాడు బ్రాహ్మణుడు కాడని నుడువబడుచున్నది. యాగములా, సుగుణములా, బ్రాహ్మణత్వము నిచ్చునవి? అసంబద్ధప్రసంగమునిట్టి పండితమ్మన్యులు మానుదురుగాక!

మఱియు, సంఘమభివృద్ధినందుటకు జాతుర్వర్ణ్యముపచ్చియుండెననియొకచోటనుడివి, యాజిహ్వతోనే, సంఘముపాపై నాల్గుజాతులక్రిందఁ బ్రద్దలై పోయినదని యికనొకచోట నుడువుపండితబ్రువుని మాటలు పేక్షణీయములు.

మఱియు వేదమేప్రమాణమనియు, స్మృతులు ప్రమాణములు కావనియు ఘోషించువాడు భారతాదులనే గతిచేసికొనుట యెంతయు హాస్యాస్పదంబు.

ఈపండితబ్రువుడెవ్వడో తెలిసికొన గుతూహలమున్నదా? అతడు మహీశూరపురవాస్తవ్యుడు. బి. యే. పరీక్షయందు కృతార్థుడై, గీతాభాష్యాదులను ఆంగ్లభాషలోనికి మార్చినవాడు. ఈతనివేదాంతజ్ఞానమెట్టిదో శ్రీశంకరాచార్యాభిప్రాయాను సారముగా గీతాశాస్త్రిమును పన్యసించెదనని యసంబద్ధపు ప్రసంగములతో నింపిన పుస్తకము జూచిన దెలియగలదు. ఈతని రసవిదురమైన గ్రంథమందలి కుతర్కమహీజములు మదీయగ్రంథమున వివిధస్థలములందు ఖండింపబడుచునే యున్నవి. ఇయా మహాదేవ శాస్త్రిగారు, శ్రీవీరేశలింగముగారు, ఇంకననేకులును వర్ణవిషయమై వ్రాసినపిచ్చివ్రాతలు నాపుస్తకమున ఖండింపబడుచునే వచ్చుచున్నవి. గ్రంథవిస్తరయముచే పేళ్ళనెత్తుటమానెదను

బ్రహ్మజ్ఞానము, పాండిత్యము, జన్మము, ఉపనయనాది సంస్కారము లు, సాత్వికాదిగుణములు, యాగాదికర్మలు, శుక్లాదివర్ణములు ఇన్ని కలవు కదా. వీనిలోనే లక్షణమునుబట్టి వర్ణభేదము నిర్ధారింపవలెను ? ప్రతిపక్షము లన్నిటికిని ప్రమాణములు చూపుచున్నారు. ఒకలక్షణమును స్వీకరించినపక్షమున, ఇతరలక్షణములన్నియు గాకపోవచ్చును. కాబట్టి వీరి వ్యాఖ్యానము లు పొసగవు.

ఎట్లన, అచారాదులున్నప్పుడే బ్రాహ్మణుండైతే, "ఆచారహీనంనపు నన్తివేదాః" ఇత్యాదిశ్లోకములందు ఆచారహీనులుకూడ బ్రాహ్మణులుగా నెట్లుస్వీకరింపబడిరి? "ఆచారహీనస్యతు బ్రాహ్మణస్య" అని, బ్రాహ్మణ పదము ఆచారహీనులకును ప్రయోగింపబడినది కదా (వసిష్ఠస్మృతి)

ఇటులనే సంస్కారముచేతనే బ్రాహ్మణత్వమేని, "నయోనిర్నాపి సంస్కారః" ఇత్యాదివాక్యములవలన నదివిరోధింప బడుచున్నదిగదా.

మఱియు బ్రాహ్మణలక్షములు గాదయా సత్యాదిగుణములుకొన్ని చె ర్పొనబడుచున్నవి కదా. వానిలోనే గుణమున్నవాడు బ్రాహ్మణుడగును? ఏలన, నొకనికి దయయుండవచ్చును, శౌచములేక పోవచ్చును. దయయుం డుటచేత బ్రాహ్మణుండయ్యెడు పక్షమున, శౌచములేకుండుట వలననేమగు ను? ఇకనొకనికి శౌర్యముండవచ్చును దానములేక పోవచ్చును. శౌర్యముచే త క్షత్రియుడైన పక్షమున, దానరై ముఖ్యముచేతనే వర్ణమువాడగును? కాబ ట్టి యిప్పటిగుణముల వలననే, వర్ణనిర్ధారణమన్న పక్షమున, నొకమనుష్యుడే, బ్రాహ్మణుడును, అబ్రాహ్మణుడును, క్షత్రియుడును, క్షత్రియుడుకానివాడు ను కావలసివచ్చును. ఇదియసంగతముకదా. కాన, గుణవర్ణవాదము తప్పు.

మఱియు, వర్ణాశ్రమములు స్మృతిప్రోక్తములేకాని శ్రుతిప్రోక్తము కావనియు, నందువలన గాలానుగుణముగా మార్పునొందుట దోషముకా దనియు నొకచోటనుడివి, మఱియొకచోట శ్రుతిప్రోక్తములని నిదర్శనము జూపుచు "బ్రహ్మవాఇదమగ్ర ఆసీదేక మేవ" "బ్రాహ్మణోహిజాయతే

యోయజ్ఞాజ్ఞోయతే" ఇత్యాదిశ్రుతి వాక్యములను తమసిద్ధాంతమును సమర్థిం
చుసందర్భమున బ్రదర్శించిన శ్రీమహాదేవశాస్త్రిగారి శాస్త్రిజ్ఞానవైధుర్య
మునేమనవచ్చును?

యాగదీక్ష బ్రాహ్మణత్వము నిచ్చుననువారిని ఏదీక్షలు క్షత్రియవైశ్య
శూద్రత్వముల నిచ్చుననిప్రశ్నించెదను. యాగదీక్షచేతనే బ్రాహ్మణులౌదు
రేని, యాగములం జేసిన వారనేకులు పిమ్మటగూడ క్షత్రియాదులుగానే పరి
గణింపబడిరేమి? మఱియు, యాగమందలి బ్రహ్మత్వమొక యుద్యోగ(office)
మువంటిది. ఋత్విక్కులలో బ్రధానుడు బ్రహ్మయనబడుచున్నాడు కదా.
బ్రహ్మయనగా, చతుర్ముఖబ్రహ్మయని యాయర్థము? దీక్షానంతరము వీరిబ్రహ్మ
త్వమెగిరిపోవును; అవభృథస్నానమిట్టివారి బ్రాహ్మణత్వమును చల్లార్చును.

మఱియు, బ్రహ్మజ్ఞానముచేత బ్రాహ్మణత్వమేని, ఉపనయనము బ్రా
హ్మణునకు శాస్త్రము విధించుచున్నదా లేదా? అనగా, బ్రాహ్మజ్ఞానికి ఉపన
యనము విధించుచున్నదా? ఉపనయనానంతరము బ్రహ్మజ్ఞానము నిమిత్తమై
ప్రయత్నము కాని, బ్రహ్మజ్ఞానానంతరము పనయనమునకు బ్రయత్నముకా
దుగదా. కాబట్టి బ్రహ్మజ్ఞానముచేత బ్రాహ్మణవర్ణమనుట హాస్యాస్పదము.

మఱియు, శర్మవర్మాదిపదయుక్తములైన నామధేయములు బ్రాహ్మణ
క్షత్రియాది శిశువులకొసంగవలెనని స్మృతులువిధించుచున్నవి కదా. ఆశిశు
త్వమున వారివారివర్ణము లెట్లునిర్ధారణీయములు? బ్రాహ్మణశిశువునకు శర్మప
దమునుసంధించిన పక్షమున, నాశిశువుదికూడ బ్రాహ్మణవర్ణమనియే యంగీక
రించుట యగుచున్నది; అప్పుడుజన్మనుబట్టి వర్ణమగును. అంతేకాదు. పుట్టు
కవలన శర్మయో గుణములవలన వర్మయో, దాసుడో కావలయునందురా; అం
దుకు బ్రత్యేకము నామకరణవిధియేది? కొన్నిసమయములందు మఱలనుపన
యన సంస్కారము జేసికొనవలెనన్నట్లు, ఇట్టివానికి బునర్నామకరణము వి
ధించువాక్యములే గ్రంథమందునులేవు. కాబట్టి గుణముల ననుసరించివర్ణవిభా
గమనుట యసంబద్ధపుమాట.

మఱియు పాతకములుచేయనివారే బ్రాహ్మణులనియు, బ్రాహ్మణులు పాతకములుచేయరనియు ఘోషించువారిని, బ్రాహ్మణులకు ప్రాయశ్చిత్తాదులు శాస్త్రము నిర్ణయించుచున్నదా లేదా, యనియడిగెదను. నిర్ణయించుచున్నమాట స్పష్టము. బ్రాహ్మణులకును దండనమున్నది. ప్రాయశ్చిత్తాదులు తప్పుచేయుటను సూచించును; కాబట్టి బ్రాహ్మణాదులును పాతకములజేయుట కలదు. పాతకాభావమువలన బ్రాహ్మణత్వము సిద్ధించదని ఫలితార్థము.

సంస్కారమువలన ద్విజుడగునేని, "నయోనిర్నాపి సంస్కారః" ఇత్యాదివాక్యముల కేమిసమాధానము? "సంస్కారాద్ద్విజ ఉచ్యతే" అను వాక్యమును "నసంస్కారః" అనువాక్యమును పరస్పరమును విరోధముగలవి కదా. ఇకమాసమాధానమెట్లన, ఉపనయనాది సంస్కారములు గాని, సద్వృత్తముగాని, ఈజన్మమునందే బ్రాహ్మణత్వము సిద్ధింపజేయుటకల్ల. "నయోనిః" అనుటవలన బ్రాహ్మణులకు జన్మించుటయు, సిద్ధింపజేయదన్న పక్షమున, నిదిస్థాపకవాక్యము, అనగా, సద్వృత్తమునుతించుటకు వచ్చినదే కాని వేరుకాదని ప్రత్యుత్తరము.

మఱియు, బ్రహ్మజ్ఞానమువలననే బ్రాహ్మణత్వమేని, "బహూనాంజన్మనామంతే, జ్ఞానవాన్మాంప్రపద్యతే" "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనం" "మనుష్యాణాంసహస్రేషు" ఇత్యాదివాక్యములవలన బ్రహ్మజ్ఞానులు బహుస్వల్పసంఖ్యాకులు కాబట్టి బ్రాహ్మణులుమిక్కిలి తక్కువగా నున్నారని చెప్పవలసియుండును. మఱియు, నీసంఖ్యయందు ప్రపంచమున నౌదాసీన్యము గలవారనేకులుండి, జనకాదులబోలు కార్మికులు తక్కువసంఖ్యగా నుందురుగాన, బ్రాహ్మణుల సాహాయ్యము కావలసిన పలుతావులనది లభ్యముకాక, ప్రజావృద్ధి యాటంకపడిపోవును!

ఇకనొకవిషయమునకు వత్తము. శ్రీశంకరాచార్యులు వివేకచూడామణియను గ్రంథమందు "జన్తూనాంనరజన్మదుర్లభమతఃపుంస్త్వంతతో విప్రతా, తస్మాద్వైదికధర్మమార్గపరతావిద్వత్త్వమస్మాత్పరం। ఆత్మానాత్మవివేచ

నంస్వానుభవో బ్రహ్మాత్మనాసంస్థితి, ర్ముక్తిర్నోశతజన్మకోటి సుకృతైః పుణ్యై ర్వినాలభ్యతే ” (జన్తువులకు నరజన్మదుర్లభమైనది; అంతకంటెను, పుంస్త్వము; అంతకంటెను విప్రత్వము; అంతకంటెను; వైదికధర్మ మార్గతత్పరత్వము; అంతకంటెను విద్వత్త్వము. అంతకంటెను, ఆత్మానాత్మవివేచనము; అంతకంటెను అపరోక్షానుభవము. ఆహా! ముక్తిశతజన్మకోటి సుకృతఫలమువలన గాని సిద్ధించదుకదా) అనియానతిచ్చి యున్నారు. బ్రహ్మానుభవాదులచేతనే బ్రాహ్మణత్వము సిద్ధించునేని, బ్రహ్మానుభవాదికమునకు బూర్వమేవిప్రత్వమేల యంగీకరింపబడినది? ఇటులనే, మనుస్మృతియందు “ బ్రాహ్మణేషుచవిద్వాంసో, విద్వత్సుకృతబుద్ధయః । కృతబుద్ధిషుకర్తారః, కర్తృషుబ్రహ్మవేదినః” (బ్రాహ్మణులందు విద్వాంసులు, వారిలో నిశ్చయబుద్ధిగలవారు, వారిలోనుచితము నాచరించువారు, వారిలోబ్రహ్మనెరింగినవారును శ్రేష్ఠులు) అని వకాణింపబడినది. వీనిని పర్యాలోచనచేసి నప్పుడు, జన్మచేతనే బ్రాహ్మణత్వమని ద్యోతించును గదా. ఏలన, విద్వాంసులే బ్రాహ్మణులేని, బ్రాహ్మణులందును విద్వాంసులు శ్రేష్ఠులని పరిచ్ఛేదించి వచించుటవ్యర్థమగును.

మఱియు, గుణవైచిత్ర్యమువలన వర్ణవైచిత్ర్యమను వాదము స్వీకరించినపక్షమున, దేవతలకుఁగూడ వర్ణభేదమున్నదనియే చెప్పవలసివచ్చును. కాని, దేవతలకు లేదని శాస్త్రము నిష్కర్షగా నుడువుచున్నది. కాబట్టి గుణభేదముల మూలమున వర్ణభేదము లుద్భవించుననుట మిథ్య.

దేవతలకు గుణవైషమ్యము లెట్లుండురేమో. వినుడు. ఇంద్రుడు దేవేంద్రుడు; కాన, క్షత్రియుడు. వాచస్పతి వాచస్పతి; కాన, బ్రాహ్మణుడు. కుబేరుడు ధనేశుడు; కాన, వైశ్యుడు. దేవభటుడు సేవకుడు; కాన, శూద్రుడు. మఱియు దేవతలకు దుర్గుణములు లేకపోలేదు. కాబట్టియే. బృహదారణ్యకోపనిషత్తునందు దేవతలు బ్రహ్మవిద్యాభ్యాసకునకు విఘ్నములు కల్గింతురని ప్రతిపాదింపబడినది. అటులనే, పురాణాదులవలన దేవతల చేష్టలు తెలియగలవు. కాబట్టి, మంచివారు గనుక వర్ణభేదములేని వారనుట

కు వీలులేదు. కాబట్టి వృత్తిభేదాదుల ననుసరించి జాతిభేదమేని, దేవతాదుల
కుగూడ జెప్పవలసివచ్చును. కాని, దేవతలకు వర్ణాశ్రమభేదములు లేవని శ్రీ
శంకరాచార్యులు గీతాభాష్యమున నుడివియున్నారు. "మానుష ఏవ లోకే వర్ణా
శ్రమాది కర్మాధికారః, నాన్యేషు లోకేషు" (మనుష్యలోకమునందే వర్ణాశ్ర
మాది కర్మాధికారము కలదు; అన్యలోకమునందు లేదు—అ 4, శ్లో 14) కా
బట్టి గుణములు మొదలైనవానివలన వర్ణభేదము రాదు.

దేవతలనివేరే లేరనియు, సద్గుణములుకలవారే దేవతలనియు, అటు
లనే, దైవాసుర సంపద్విభాగయోగమున భగవద్గీతలును ప్రతిపాదించుచు
న్నవనియు వాదించినయెడల, భూసురులకును సురలకును భేదమేమో చెప్పా
ము. సద్గుణసంపత్తిచేతనే దేవత్వము వచ్చునేని, అట్టి వారిని దేవతలనినజాలు
గా, 'భూదేవత'లని మఱల 'భూ' అన్నవిశేషణముయొక్క యుపయోగమే
మి? కాని, భూదేవతలనుటవలన, దేవతలను వారుప్రత్యేకముగానున్నారని
ద్యోతించుచున్నది. తార్కికాదులు కూడ; దేవశరీరములు తేజస్తత్త్వప్రధా
నములయినవని యొప్పుకొనియున్నారు. మనవలెవారికి పార్థివదేహములు లేవు.
మఱియు, దేవతలు సజ్జనేతరులు కారన్నపక్షమున, దేవోపాసనాదివిధులు
నిరర్థకములు కావలసివచ్చునుకదా. కాబట్టి దేవతలు పురాతనార్యులేయని
యు, త్రివిష్టపము టిబెట్టేయనియు, బ్రహ్మదేశము బర్మాయేయనియు జెప్పుపి
చ్చివాదములనీ పాటికి బారదోలుట మేలు. దైవాసురయోగము స్వభావము
లను విభజించుటకుమాత్రమే వచ్చినది. సత్యశౌచాదులు కలవారిని సురలను
ట గౌణము. కొన్నికొన్ని విషయములలో దేవతలబోలుచున్నారు కాబట్టి
దేవతలనబడుచున్నారు, భూసురాదిపదముల యభిప్రాయమింతయే.

కొందఱు, శ్రీశంకరాచార్యులు జాతిభేదమును తృణీకరించెనని చె
ప్పుటకు మనీషాపంచకమును చూపుచున్నారు. కానివీరి ప్రయత్నము విఫల
ము. భాష్యాదులందు వర్ణాశ్రమ పద్ధతులేల ఖండింపబడలేదు? వర్ణమిష్టము
కానిచో, నిందింపబడలేదేమి? చండాలసంభాషణానంతరమైనను, భాష్య

దులను దిద్దుకొనలేదేమి? కాబట్టి శంకరుడు వర్ణవిరోధి కాడు. మఱియు, "దృఢప్రజ్ఞాపి యస్యాస్తి చేత్" అని చేత్ అని (condition) ప్రయోగించుటవలన, బ్రహ్మానుభవముకల్గినప్పుడు మాత్రమేయని స్ఫురింపుచున్నది. కాబట్టి బ్రహ్మజ్ఞానముకలవారికి వర్ణాశ్రమములతో బనిలేదు; వారు సర్వత్ర వందితపదులు. ధర్మవ్యాధుడు మొదలైనవారు గౌరవింపబడుట లేదా? కాబట్టి శ్రీశంకరాచార్యులవాక్యములు కేవల బ్రహ్మాపృష్టినవలంబించి ప్రయుక్తములు. ఆచండాలవేషధారి యామాటలకుసంతోషించినట్లే చెప్పబడుచున్నది. మఱియు నాతని ప్రశ్న, వర్ణభేదమును మాన్పించుట కుద్దేశింపబడలేదు. అదేయుద్దేశమేని, శ్రీశంకరవాక్యములను మఱల బూర్వపక్షము చేసియుండును. కాని, యట్లు జరుగలేదు. కాబట్టి యీసంభాషణము వర్ణభేదమును దూషించుటకు గాదు. శ్రీశంకరాచార్యుని జ్ఞానానుభవమును శోధించుటకును, అజ్ఞానావస్థయందున్నవారు వర్ణవిషయమై యేరీతిని ప్రవర్తింపవలెనో తెలియజేయుటకును, ఈయాఖ్యాయిక వచ్చియున్నది. మఱియు, నిందలి చండాలవేషధారి నిజముగా జండాలుడు కాడు; పరమేశ్వరుడనియే చెప్పబడుచున్నాడుకదా. కాబట్టి యీకథమాపక్షమునకు నష్టముచేయదు; లాభమే చేయును.

చండాలురెచ్చటినుండి వచ్చిరనియు, "నాస్తిపంచమః" అనుమను వాక్యమువలన జాతుర్వర్ణ్యము మాత్రమే శాస్త్రసిద్ధము కదాయనియు నాక్షేపించినయెడల, జాతుర్వర్ణభ్రష్టులై కుత్సితాచారములుగల సంకరులు చండాలపదవాచ్యులని తెలిపెదను. ప్రతినగరమునకును కల్మషకుల్య (Drainage) లెట్లవసరమో, యావిధముననే ప్రతినాగరికతగల సంఘమునకును చండాలసముదాయము లావశ్యకము. లుమలినపదార్థసంసర్గము నగరారోగ్యమునకు భంగకరమైనభంగి, జుగుప్సితాచారనిరతులైన నరులసంస్పర్శము సకలజనసుఖములకును శత్రుప్రాయమని భావించి, వారిని సంఘము బహిష్కరింపవలసివచ్చెను. అకాలమరణముచంపని కుక్కలసైతముదిని

బ్రిటుకుచు, స్నానాది శౌచసంస్కారశూన్యులై, నీతివిహీనులైన మానవుల
ను సంఘసంస్కర్తలమని దంభములగొట్టుచున్నవారు మాత్రము సైరింపగల
రా? దూబోయి(Dubois) మొదలైన పాశ్చాత్యులైనను, ఈవిషయమై
యెట్టియభిప్రాయము జూపియున్నారో, చూడుడు. మఱియు దప్పైమైన
జేసినప్పుడొకడు "నేను చండాలుడను. నన్నుముట్టవద్దు" అని మొఱ
లిడునుకదా,

ఇప్పుడు, "నాస్తిపంచమః" అనువాక్యము నెట్లుసమన్వయింపవ
చ్చునని యడుగుదురా? చెప్పెదను. వర్ణచతుష్టయము మాత్రమే వేదావిరు
ద్ధంబగు పురుషార్థచతుష్టయమునకు సాధనంబు. పరిశుద్ధనికేతనసమష్టిమాత్ర
మే పురపరిమాణంబు నిర్ణయించుట కుపయుక్తమగునుకదా. యాత్రావే
ధ్యాది నిలయంబులైన గోతులుపట్టణనికటంబున నున్నప్పటికి నుపేక్షణీయ
ములయిన తెరంగున, బ్రాహ్మణాదిజాతి వ్యతిరిక్తజాతులున్నను లేనట్లే. కా
బట్టి "నాస్తిపంచమః" నాల్గువర్ణములకును భిన్నమైనజాతియేదియు నుం
డదేని, జోతులను స్మృతికారుడు కంఠోక్తిగాజేర్కొని యుండడుకదా.
కాని, దాయభాగాదినిర్ణయ సందర్భమున, వివిధజాతి పరామర్శ స్మృతి కా
రునిచే జేయబడుచున్నది కాబట్టి, చండాలురున్నారని స్మృతికర్తసమ్మతించి
నవాడేయని గ్రహింపవలెను.

"జన్మనాజయతే శూద్రః, సంస్కారాద్ద్విజఉచ్యతే" అనువా
క్యముచొప్పున సంస్కారమువలననే ద్విజత్వముసిద్ధించుననియు, జన్మవలన
శూద్రత్వమేకాని, త్రైవర్ణికత్వము ప్రాప్తింపదనియు నడువుప్రతిపక్షులు
ద్విజత్వమునకే యర్థముగల్పింతురో. ద్విజత్వమనగా బుద్ధిత్వముగాదు గదా
శూద్రునకుపనయన సంస్కారముశాస్త్రము విధించుటలేదు. కాబట్టి, యు
పనయనసంస్కారమునకు బూర్వముబ్రాహ్మణాదుల బిడ్డలును శూద్రులేయని
చెప్పబడుచున్నారు. సంస్కారాభావ సామ్యముచే బ్రాహ్మణాద్యర్భకులకు
శూద్రత్వముపమింప బడుచున్నది. మఱియు, వైదికసంస్కారస్తవార్థమే

యిట్టివాక్యములు గ్రంథములందుపయోగింప బడుచున్నవి.

మఱియు, ద్విజత్వమనగా, ద్వితీయజన్మత్వము. ప్రథమజన్మము జనకులవలననియు, ద్వితీయజన్మమువేదాధ్యయ నారంభమువలననియు శాస్త్రిసంప్రదాయము. ఉపనయనసంస్కారాద్య భావమందు, ద్వితీయజన్మము (ద్విజత్వము) లేకపోవచ్చును; కాని, ప్రథమజన్మము (త్రైవర్ణికత్వము) లేదనుటకెట్లు వీలుండును? వీలుండదు. ద్విజశబ్దము కొన్నిస్థలంబుల బ్రాహ్మణత్వమును, కొన్నిస్థలముల బ్రాహ్మణత్వముగాని, క్షత్రియత్వముగాని, వైశ్యత్వముగాని, యర్థమిచ్చును. మఱికొన్ని సమయములందు, ఉపనయనాది సంస్కారజన్యద్విజన్మత్వమును సూచించును. " జన్మనాజయతే " ఇత్యాదిస్థలములందు, కేవలసంస్కారకృత పునర్భవత్వమునే పరామర్శించును. యత్యాశ్రమస్వీకారానంతరము పూర్వవ్యక్తి (personality) గతించివిలక్షణ వ్యక్తివ్యక్తమగునని వచింపబడినను, పూర్వోపాధిసమ ద్భూతసుఖదుఃఖాద్యనుభవముసాంతముగాను వశమింపనిపగిది, ఉపనయనసంస్కారా నంతరము ద్విజత్వము సంఘటితమైనప్పటికి బ్రాహ్మణాదిజాతీయయోనిజత్వ, తద్వర్ణావలంబనత్వాదికమంతము నొంద నేరదు. ఉపనయనసంస్కారము పాధిహేతుభూతపితృ సంబంధమును ప్రతిషేధింపజాలదు. కాబట్టి పితృవర్ణముపనయనా నంతరమును పనీతునాశ్రయించియే యుండును. అటులనే, ఉపనయనము విధింపనిశూద్రులు శాస్త్రిమర్యాదనతిక్రమించి యుపనయనసంస్కారము నొందుదురేని, అప్పటికినివారికి శూద్రత్వమే సంక్రమించియుండును. ఏలన, పితృజాతిశూద్రజాతి కాబట్టి. మఱియునిట్టి బలాత్కారసంస్కారము ద్విజత్వమునైనను సంఘటింపజేయజాలదు.

ఇంతేకాదు. పుట్టుకచేసామాన్యమనుష్యుడే. పట్టాభిషేకముచేమనుష్యాధిపుడగుచున్నాడనువాక్యమునించుక విచారింతము. అదినిజముగా, బుట్టుక చేశూద్రుడైనను,సంస్కారమువలన ద్విజుడగుచున్నాడు (జన్మనాజాయతే శూద్రః, సంస్కారాత్ ద్విజఉచ్యతే) అనువాక్యముతో సమానమైయున్న

చి కదా. ప్రతిమనుష్యుని పట్టాభిషేకము చేయుదురా? రాజపుత్త్రునే కదా? మనకంటె వానియందేమైన విలక్షణగుణసంపత్తి యున్నదందురా, లే దందురా? ఉన్నదేని, ప్రతిమానవుడును రాజుకాలేనట్లు, ప్రతిమానవుడును బ్రాహ్మణుడుకాలేడు. రాజపుత్రుడుమాత్రమే రాజైనట్లు, బ్రాహ్మణపుత్రుడు మాత్రమే బ్రాహ్మణుడగును. రాజపుత్రునందు మనకంటె నధికలక్షణములు లేవందురేని, అస్మదాదులిందరుండగా రాజపుత్రునిమాత్రమే యభిషిక్తుని జేయుటకు గారణమేమి? వంశపారంపర్యముచేత పట్టాభిషేకము నంగీకరిం పక ప్రజానుమతి (Consent of the Republic) చేతనే యాధిపత్య ము గలుగవలెనను సిద్ధాంతము నవలంబించి ప్రతిపక్షులు, ఆధిపత్యమునకు వం శముతో నిమిత్తములేదనియు ప్రజానురంజక వృత్తముగలవాడే యభిషేకా ర్హుడనియు, నటులనే బ్రాహ్మణయుక్తగుణముల జూపినవాడే యుపనయ నాది సంస్కారయోగ్యుడనియు, వాదించిన పక్షమున, అప్పుడైనను విలక్ష ణధర్మత్వము సిద్ధమగుచునే యున్నది. ఏసుగుణరాశి యుండుటవలన నొక డు ప్రభుత్వమునకు నియోగింపబడుచున్నాడో, ఆసుగుణములమూట మన యందు లేకపోవుటవలన మనముఖమెవ్వరును చూచుటలేదు! కాఁబట్టికొన్ని లక్షణముల సముదాయము సామ్రాజ్యమునకు సాధనమైన చందమున, గొన్ని లక్షణముల సమూహము బ్రాహ్మణజాతిత్వమునకు యోగ్యతనిచ్చును. అట్టి గుణసమూహము బ్రాహ్మణసంజాతునకున్నది; కాబట్టి బ్రాహ్మణపుత్త్రుడును బ్రాహ్మణుడే. అట్టిగుణసమాజము బ్రాహ్మణేతరునకు జన్మించినవానికి గలదా? లేదు. కాబట్టి క్షత్రియాదులకు బుట్టినవారు బ్రాహ్మణులుకారు. ఇటులనే, యితరవర్ణజుల సంగతియు నెరుంగవలెను.

పూర్వపక్షము:—బ్రాహ్మణునకు నితరజాతీయులకును భేదముకలదని చెప్పుచున్నావు. అదిస్వగతభేదము కానేరదు. ఏలన నొకవృక్షమునందే పల్లవఫలాదులవలె, నొకవస్తువునందే బ్రాహ్మణాది పదవాచ్యులులేరు. మఱి యు, విజాతీయభేదము కానేరదు. ఏలన, ఘటపటాదులవలె, భిన్నస్వరూ

పములు బ్రాహ్మణాదులకు గానరావు. మఱియు, సజాతీయభేదము కానేరదు. ఏలన, ధనికదరిద్రాదులవలె మానవులందింద్రియ గోచరంబులైన భేదంబులు లేవు. ఈమూడువిధములైన భేదములకంటె భేద మేలేదు కాబట్టి మానవులకు బ్రాహ్మణాది భేదకల్పనమసమంజసంబు.

సిద్ధాంతము:—త్రివిధభేదములును కలవు. స్వగతభేదమున్నది. ఎట్లన, విరాడ్వృక్షంబునందు బల్లవాదులవలె బ్రాహ్మణాదులున్నారు. సజాతీయభేదమును కలదు. ఎట్లన, బ్రాహ్మణాది పితృపరంపరనుండి రక్తాదులందు భేదమును సంపాదించి యున్నారు. బ్రాహ్మణుని మేని రక్తము తెల్లగానుండునాయని కొందఱాక్షేపించి నప్పటికి, వానిరక్తమును విభజించి పరీక్షించిన పక్షమున వైలక్షణ్యమక్షి విషయము కాకమానదు. మంచిప్రాయమునందున్న గోవుపాలిచ్చును. వయసుముదిరిన గోవును బాలిచ్చును. కాని మొదటియావు పాలొకవిధమైనవి; రెండవయావుపాలుమఱియొకవిధమైనవి. కాబట్టి సజాతీయములైన పాలకుభేదమున్నట్లు సజాతీయులైన మానవులకును భేదముకలదు. దానిననుసరించి వర్ణవ్యవస్థ. ఇక, విజాతీయభేదమెట్లన, సంస్కారభేదముల ననుసరించి సూక్ష్మాదిశరీరములకు వైచిత్ర్యముకలదు.—ఘటమునకును వస్త్రమునకు వలెనే. కాబట్టి తద్వైచిత్ర్యము ననుసరించి వర్ణవైచిత్ర్యమును న్యాయ్యము. మఱియు, సజాతీయభేద మే విజాతీయభేదము గావచ్చును; విజాతీయభేద మే స్వగతభేదము గావచ్చును. ఎట్లన, ఘటపటములు విజాతీయభేదము కలవైనప్పటికి తదుపాధిభూతభూతత్వము సమానమేగనుక సజాతీయభేదము మాత్రమేకలదని చెప్పనొప్పు. అటులనే, జగదాధారప్రకృతివృక్షమువలె నొకటేకనుక, తదంతర్గత శాఖాపల్లవాది ప్రాయములటపటాది పదార్థములు స్వగతభేదము కలవనియే చెప్పవచ్చును. కాబట్టి మనప్రతిపక్షులు మనుష్యునకును మనుష్యునకును భేదములేదన్న మాత్రమునజాలదు. సమానజాతీయత్వము కొన్నివిషయములలో సమకూరినప్పటికి విజాతీయస్వగత భేదములుకాన్పించుచునే యున్నవిగనుక వానినిబట్టి వర్ణభేద మే...

ట యుక్తియుక్తముగానే యున్నది. ఘటపటములక భేదత్వము గ్రహింతురేని, బ్రాహ్మణాది మనుష్యులకున భేదత్వము గ్రహింపుడు. అట్లుకాక, ఘటపటములక భేదత్వము గ్రహింపరేని, బ్రాహ్మణాది మనుష్యులకున భేదత్వముమాటదలంపకుడు. కాబట్టి చాతుర్వర్ణ్యవ్యవస్థ యనునది సజాతీయాది భేదత్రయసాధితమైనదే కాని వేరుకాదు.

కాబట్టి "పుట్టుకచేత సామాన్యమనుష్యుడైనను, పట్టాభిషేకముచేత ప్రభువగును" అన్నవాక్యమందలి సామాన్య మనుష్యుడు మనవంటివాడుకాడు. మనకును ఆ సామాన్యమనుష్యునకు నెంతేనిభేదమున్నది. కాబట్టియే యాతడు ప్రభువగును. అటులనే "జన్మనాజాయతే శూద్రః" అనువాక్యమందలి శూద్రునకును శూద్రపుత్రుడైన శూద్రునకును భేదము కలదు. కాబట్టి శూద్రపుత్రులు ద్విజులౌదురని "జన్మనా', అనువాక్యమునకర్థముకానేరదు. మఱియు, నర్థమగునేని, అదియీజన్మము మాటకాదు; రాబోవుజన్మముయొక్క విషయము. ఈజన్మమందు శూద్రులైనను, దైవభక్త్యాది సంస్కృతమనస్కులౌదురేని, ఉత్తరజన్మమునందు బ్రాహ్మణాదివర్ణములలో జన్మించవచ్చునని యభిప్రాయము గ్రహింపుడు. కాబట్టియే Advanced Text Book (Sanatana Dharma Series) ఇట్లనుడువుచున్నది:- "It is universally granted that a man raises himself from one caste to another by good conduct, but it is generally considered that the conduct bears fruit by birth into a higher caste in the succeeding life. Texts quoted in support of passage from one caste to another will mostly bear this interpretation, just as by degradation from one Caste to another rebirth in a lower Caste was generally meant (page 251)" అటులనే "Even the famous Sloka, నయోనిర్నాపిసంస్కారో" may apply as well to rebirth in to

a higher Caste as to transference into it" కొన్నివిషయములలోనభిప్రాయ భేదములున్నను, ఈవిషయమందుమాత్రమీగ్రంథకారులకును నాకును ఏకీభావముగలదు. పూర్వపక్షము—" శూద్రోబ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతిశూద్రతాం । క్షత్రియాజ్జాతమే వస్తువిద్యాద్వైశ్యాత్తథైవచ "॥ మనుస్మృతిX. 65)అనుశ్లోకము బట్టి గుణమునుబట్టివర్ణము.

సిద్ధాంతము:—కాదు. ఏలన, నీశ్లోకము జన్మాంతరవిషయము నుద్దేశించును. లేదా, యిదిస్తావకవాక్యము. అట్లుకాదందురేని, " అనార్యమార్యకర్మాణ మార్యంచానార్యకర్మిణం। సంప్రధార్యాబ్రవీద్ధాతానసమా నసమావితి॥ " అనుమను శ్లోకమునకే విరోధమగును. అటులనే మనువుజన్మనుద్దేశించిపల్కిన ఉపనయనాది కర్మవిధులకు విరోధమగును.

పూర్వపక్షము:—" యత్రైతల్లక్ష్యతే సర్పవృత్తం స బ్రాహ్మణః స్మృతః। యత్రైతన్నభవేత్ సర్పతం శూద్రమితినిర్దిశేత్ " అనువనపర్వ వచనమువలన సత్యదానాది గుణములవలన బ్రాహ్మణత్వము ప్రాప్తించును. అటులనే శ్రీమద్భాగవతమున " యస్యయల్లక్షణం ప్రోక్తంపుంసో వర్ణాభివ్యంజకం। యదన్యత్రాపిదృశ్యేత తత్తేనైవవినిర్దిశేత్ " అనినుడువబడినది.

సిద్ధాంతము:—వనపర్వగతవాక్యములు స్తావకపరములు. అట్లుకాదేని, సూతుఁడువిదురుడు మొదలైనవారాకాలపు వారేకాబట్టిభీష్మయుధిష్ఠిరాదులు వారినెందువలన బ్రాహ్మణులుగా మార్చకుండిరి? గుణమునుబట్టి వర్ణమను సిద్ధాంతమప్పుడు మాత్రమవలంబనీయముకాదా? ఇప్పుడవలంబనీయమై యప్పుడవలంబనీయము కాదనుట యుక్తిశూన్యము. ఇప్పుడునవలంబనీయమైన పక్షమున, నప్పుడేల యవలంబింపబడలేదు? భీష్మాదిధర్మకర్తలచేతనే,యేలనీ సిద్ధాంతము త్రోసివేయఃబడినది? కాని, వారవలంబింపలేదు కాబట్టి గుణవర్ణ సిద్ధాంతము భ్రాంతికల్పితము. మఱియు, భీష్ముడేల బ్రాహ్మణుడుకాలేదు? ద్రోణాచార్యకృపాచార్యులేల క్షత్రియులు కాలేదు? గీతోపదేష్టయైన శ్రీకృష్ణుడెందుచేత బ్రాహ్మణుడు కాలేదు? గుణవర్ణసిద్ధాంత మాంగ్లేయభాష

జదివిన మనకొఱకై ప్రత్యేకమువారు జాగ్రత్తపెట్టి యుంచినారు కాబోలు! పోలుపోలు!

మఱియు, నీభారత వచనములందు సత్త్వాదిగుణసప్తకము మాత్రమే పేర్కొనబడినది. మన్వాదిస్మృత్యుక్తాధ్యయ నాధ్యాపనాదికర్మకలాపంబు నిర్వచింపబడలేదు. సత్త్వాదులున్నప్పుడే, బ్రాహ్మణుడగునా? లేక, అధ్యయనయజనాదులున్నప్పుడే, బ్రాహ్మణుడగునా? చెప్పుము. మఱియు గీతాశాస్త్రోక్తములయిన జ్ఞానశౌచాదులున్నప్పుడు బ్రాహ్మణుడా, లేక, వనపర్వోక్తగుణములున్నప్పుడు మాత్రమేనా? గుణమునుబట్టి వర్ణమనుటవలన నిట్టివిరోధముండును కాబట్టి జన్మచేతనే వర్ణమునిర్ధారణీయమని యొప్పుకొనవలెను. ఐతే, ఇట్టివాక్యముల నెట్లుసమన్వయింతువని యడుగుదువేమో. స్తావకపరత్వముగా సమన్వయము. ఏలన, సర్వసాధారణ ధర్మములైన యాత్మగుణములని స్మృతికారులచే బిలువబడు సత్త్వాదిగుణముల నభ్యసించుటకు శూద్రాదిసమస్తవర్ణముల వారిని, ఇట్టివాక్యములు ప్రోత్సాహించుచున్నవి. జన్మబ్రాహ్మణులను, లబ్ధమైన బ్రాహ్మణత్వము సద్గుణపరిపాలనమువలన నిల్పుకొనుటకు జాగరూకుల జేయుచున్నవి. భారతభాగవతాది సమస్తగ్రంథార్థముల నీవిధముగానే గ్రహించి సమన్వయించవలెను.

ప్రశ్న;—ఒకవర్ణము వారుమఱియొక వర్ణము లోనికి మారినట్లు గ్రంథములందున్నదిగదా?

ఉత్తరము;—ఉండనిండు. అది, "నవిషంవిష మిత్యాహుః, బ్రహ్మస్వంవిషముచ్యతే" అపిచేత్సుదురాచారో భజతేమామనన్యభాక్। సాధురేవసమన్తవ్యః" అనువాక్యముల అర్థమువంటిది. విషముకాదన్న మాత్రమున విషముచంపుట మానునా? బ్రాహ్మణునిసొత్తే విషమన్న మాత్రమున విషమేకాగలదా? అనర్థావహమను హేతువు చేత బ్రాహ్మణవిత్తమునకువిషసామ్యము. ఇటులనే గుణసామ్యము చే భిన్నజాతీయుల కేకత్వము. వ్యాఘ్రమొకటి మేకపిల్లతో స్నేహముచేసి దానితోనాడుకొనుచున్నప్పుడు, ఆపు

లిపులికాదని చెప్పుదుము. నిజముగా బులిగాదా? శాంతగుణముల పడినను, ఆ దియూ మేకపిల్ల విషయమందుమాత్రమే. ఇంతేకాదు, దానిశరీరస్వరూపము నందును వ్యాఘ్రజాతికి భిన్నమైన జాతిని సూచించు భేదమేమియుగాన్పించదు. ఇటులనే మార్పునందుచున్న వన్నవర్ణములమాటయు సూహింపవలెను.

మఱియు, శూద్రాదులకు బ్రాహ్మణజన్మ కలుగవలెనన్న, నదియంత్యదశయందు బ్రాహ్మణవర్ణానుగుణవృత్తి నవలంబించుటవలనలభ్యమగును. "యంయంవాపిస్మరన్భావంత్యజత్యం తేకళేబరం।తంతమేవైతికౌంతేయ" అనుగీతావాక్యము చెప్పున జన్మపూర్తిగామారవలెనన్నకోరిక కలదేని, అభినవజన్మకు దగినమనోవ్యాపారము మరణకాలమున నుండవలెను. అట్టిమనోవృత్తిలేని పక్షమున, ఉపనీతునకు ద్విజత్వము సంప్రాప్తించినదన్నట్లును, సన్యాసాశ్రమ స్వీకర్తకు ప్రాక్తన జన్మముగతించి నూతనజన్మమావిష్కృతమైనదన్నట్లును, బ్రాహ్మణేతరులకు ద్విజత్వము సిద్ధించినదన్నప్పటికి ద ద్విజత్వము యథార్థమైనది కానేరదు.

ఇప్పుడు, మఱియొకవిషయమును విమర్శింతము. అదియేదియన, బ్రాహ్మణాదివర్ణ ధర్మప్రవచనము భూతవస్తుపరమా, విధిపరమా? మొదటిది కానేరదు. ఏలనగ కర్మకాండకు విధినిషేధములు వినా వైయర్థ్యము శాస్త్రసిద్ధము. ఇందుకు బ్రమాణముగా "చోదనాలక్షణోఽర్థోధర్మః" అనుసూత్రమును ఆమ్నాయస్య క్రియార్థ త్వాదానర్థక్య మతదర్థానాం" అనుసూత్రమునైయున్నవి (అ I, పా 1, అధికరణము 2) (అధ్యా I, పాద 2, అధి 1) వర్ణధర్మప్రతిపాదనము యథాభూతవస్తుజ్ఞాపకార్థమైనదన్నపక్షమున, తాదృశ జ్ఞాన మెట్లులాభకరమగుచున్నది? సత్త్వాది గుణములున్న వారందరును బ్రాహ్మణులు, శౌర్యాదులున్నవారు క్షత్రియులు—ఇట్లందము. కావచ్చును. ఐతే, నేమి? మనకునిజముగానవసరమైనదేది? సత్త్వాదులున్న వారికి బ్రాహ్మణాది పదములలో నేపదము బ్రయోగించవలెనన్న విషయమా, లేక, మనలో నెట్టివారెట్టికర్మల నాచరించవలెనన్న విషయమా? ఈరెంటప

దే కదా మనకావశ్యకమైనది. విధినిషేధజ్ఞానమే మనకు మిక్కిలి యగత్యమైనది. ఆకాశమెత్తుగా నుండుననుట్లు, నల్లటిరంగులేనికుండలు తెల్లకుండలన్నట్లు, (బ్రాహ్మణ (సాత్విక) గుణములుకలవాడు బ్రాహ్మణ (సాత్వికత్వసూచక) పదవాచ్యుడనుటవలన. నేమిప్రయోజనంబు ? స్వభావోక్త్యలంకారమను పేర నెందుకునుపయోగించని వర్ణనలుచేయుటకు కవులవలె గీతాది గ్రంథకర్తలు బ్రాహ్మణాది ధర్మములను వర్ణించియుండరుకదా ! కాబట్టి హేయోపాదేయ జ్ఞానార్థమే ధర్మప్రవచనము.

బ్రాహ్మణునకు సత్యాదులు ధర్మములని శాస్త్రము బోధించుచున్నది. మంచిది. సత్యాదులున్నప్పుడే బ్రాహ్మణుడగునా, లేక బ్రాహ్మణుడైనవానికి సత్యాదిధర్మము లుండుటవిధియా? ప్రజాపాలనము ప్రభుధర్మమన్నప్పుడు, ప్రజాపాలనము చేసినపిమ్మటనే ప్రభువగుననియా, లేక ప్రభువైనవానికి బ్రజాపాలనము చేయుటవిధియని యాయర్థము? ప్రజాపాలనానంతరమే ప్రభువనుట యనుభవవిరుద్ధమైనది. ఏలన, బ్రభువైనపిమ్మటనే ప్రజాపాలనము సంభవము; అప్పుడే తదధికారసిద్ధి; కాని, ప్రజాపాలనానంతరముకాదు; ప్రభుత్వదశకు బూర్వము ప్రజాపాలనమే సాగదు. ఈవిధముననే వర్ణవిషయమైన మీమాంస. ఎట్లన, సత్యవేదాధ్యయనాది ధర్మంబులున్నపిమ్మట బ్రాహ్మణుండుగాడు, పుట్టుకచే బ్రాహ్మణుండయినవానికే వేదాధ్యయనాది ధర్మములుండుటవిధి. ప్రభుత్వము వినాప్రజా పరిపాలనాధికారము సున్నయైనరీతినే, త్రైవర్ణికత్వము వినావేదాధ్య యనాద్యధికారము సిద్ధించదు. కాబట్టి సత్యాది గుణములు బ్రాహ్మణత్వాదులకుఁ గారణములని యభిప్రాయము కాదు.

మఱియు, "ప్రకాశోర్కస్యతోయస్య "అనున్యాయము చొప్పునను ష్ణమగ్నిలక్షణము. ఉష్ణములోపించి నప్పుడగ్నిభగ్న మైనదనియే భావించవచ్చును. అటులనే, సత్యాదిగుణసము దాయములు బ్రాహ్మణత్వాదిలక్షణము లయ్యెడుపక్షమున, తద్గుణసము దాయాభావము తటస్థించిన సమయమున, తా

స్పృశజనులు తత్తద్వర్ణబహిష్కృతు లనవలసివచ్చును. అనగా, సత్యమున్న వాడు బ్రాహ్మణుడై, సత్యములోపించినతోడనే బ్రాహ్మణుడు కాడనవలసి వచ్చును. అట్లులోపించుట కలదాయని శంకించినచో, ఉష్ణమగ్నికి లక్షణ మైనకతిని ఒకమనుష్యునకు సత్యములక్షణమగుట కష్టముకాబట్టి తద్గుణవియోగ మాత్రమెప్పుడైన సంభవించవచ్చును. సంభవించినప్పుడు బ్రాహ్మణుడు కాక పోవలసివచ్చును. సత్యహరిశ్చంద్రాదులతో సత్యాదులు సర్వదాసహవాసము చేయుచునే యుండునందురేమో. అట్లుకాదు. ఏలన, సత్యమున్నను, ఇతర గుణములులేకపోవచ్చును. ఇతరగుణములునువర్ణనిర్ధారణమందనుపేక్షణీయములు కాబట్టివానిలో నేదిలోపించినను తదనుగుణవర్ణము లోపించినదన వలసియుం డును. కాన, బ్రాహ్మణాది ధర్మనిరూపణము గుణవిశేషములవలన వర్ణనిర్ధారణమునకు గాదు.

అంతేకాదు. భూతవస్తువ్యుత్పత్త్యుత్పాద నార్థమే వర్ణధర్మప్రతిపా దనప్రవృత్తియను ప్రతిపత్తులు, పరిస్ఫుటవిధినిషేధార్థబోధక శబ్దసంబద్ధ ముతైన శాస్త్రవాక్యములకే యర్థము గల్పింతురో! " బ్రాహ్మణానామ కల్పయత్ " " క్షత్రియస్యసమాదిశత్ " (మనుస్మృతి 1 87-91) ఇత్యా దులకిట్టి స్వారస్యమువలన విధిద్యోతించుచున్నదికదా " సత్యంవద, ధ ర్మంచర, స్వాధ్యాయప్రవచనాభ్యాంన ప్రమదితవ్యం "(తైత్తిరీయోపనిష త్తుశిక్షావల్లి) ఇత్యాదులందు " సత్యంవద " యనునదివిధి, " నప్రమదిత వ్యం " అనునది నిషేధము " సహజంకర్మకౌంతేయ సదోషమపినత్య జేత్ " (భగవద్గీత) అనునదినిషేధము. ఇప్పుడు, స్వాధ్యాయాదికము బ్రా హ్మణత్వము సిద్ధింపజేయునేని, బ్రాహ్మణుడు స్వాధ్యాయముచేయవలెన న్నవిధియు, మానకూడదను నిషేధము నర్థవైధుర్యము నొందుగదా. బలవం తుడు బలవంతుడుగానుండవలెనను విధికేమియర్థము? ఇదివరకే బలవంతుడు, మఱల బలవంతుడెట్లుకాగలడు? కాగలడేని, తత్పూర్వము బలవంతుడుకా డనియే చెప్పనొప్పు. అటులనే బ్రాహ్మణుడు స్వాధ్యాయాదుల నెట్లు

సంపాదించగలడు ?! స్వాధ్యాయాద్యనంతరమే! బ్రాహ్మణత్వ సిద్ధియను సిద్ధాంతము ప్రకారము, నూతనముగా స్వాధ్యాయాదికమునకై ప్రయత్నించువాడు తత్పూర్వము బ్రాహ్మణుడుగానుండలేదని యొప్పుకొనకతీరదు అనగా? బ్రాహ్మణుడు కానివానికే బ్రాహ్మణోచిత స్వాధ్యాయాదివిధి యని యంగీకరింపవలసి యుండును. కాని, శాస్త్రము బ్రాహ్మణునకే స్వాధ్యాయాదికము నభ్యసింపవలెనని విధించుచున్నది. ఇది విరోధము, కాబట్టి స్వాధ్యాయాదికమువలన బ్రాహ్మణత్వము సిద్ధించదు; జన్మచేతనే.

శంక:— గురువు శిష్యుని " ఓవిద్వాంసుడా, ఆత్మను తెలిసికొనుము " అనిఅనును. వర్తమానకాలమున విద్వాంసుడు కాకపోయినప్పటికి ముందువిద్వాంసుడు కావచ్చునన్న యభిప్రాయముతో విద్వాంసుడాయని సంబోధించును. విద్వాంసుడైనవాడు ఆత్మను తెలిసికొనవలెనని విధింపబడు చున్న చందమున బ్రాహ్మణుడైనవానికి స్వాధ్యాయాది బ్రాహ్మణకర్మలు విధింపబడుచున్నవి, కాన, గుణవర్ణ వాదమునకు భంగములేదు.

సమాధానము:— కాదు ఏలన, పైదృష్టాంతములో శిష్యునకు విద్వత్పదము ప్రోత్సాహము నిమిత్తమై ప్రయుక్తమైనదని స్ఫురించుచునే యుండును. కాని, యొకనికి దాను బ్రాహ్మణుడో, క్షత్రియుడో, వైశ్యుడో, శూద్రుడో సందేహముగా నుండును. బ్రాహ్మణునిగా భావించి యధ్యాపనాదులాచరింపవలెనా, క్షత్రియునిగా భావించి క్షాత్ర ధర్మమనుష్ఠింపవలెనా ? అనుష్ఠానమెట్లు నెరవేరును ? అభినివేశమును (tendency) బట్టివర్ణ మూహ్యమందురా, ఎవనికే కర్మయందభినివేశమున్నదో వాడాకర్మ జేయవలెనను విధియందు విశేషమేమి? మఱియు నభినివేశమే ప్రమాణమైన పక్షముననది ప్రతికూలఫలమియ్యవచ్చును. ఇందుకొక దృష్టాంతము నిచ్చుచున్నాను. పిపాసరోగమునకు జలమగత్యమైనప్పుడేకల్గునని జలపానంబు పిపాసశాంతించునరకు జేసినపక్షమున దేహము రోగగ్రస్తము కావచ్చును. దొంగయాకలి (False appetite) మెండుగనున్న వ్యక్తివేడా. దేహక్షేమ

మునకు నిజముగా నుపకమవసరము కాకపోయినను, అవసరమయిన భ్రాంతి దోచునట్లే, ఒకనిక్షేమమున కధ్యాపనాది బ్రాహ్మణకర్మ కరణమావశ్యకము కాకపోయినను! ఆవశ్యకమైన రీతిదోచుటకలదు కాబట్టి తత్కర్మాచరణం బనర్థావహంబు కావచ్చును. కానేకాదనుటకు వీలులేదు. కాబట్టి వైద్యునివ లె శాస్త్రముకర్మవిభాగము జేయుచున్నది. అదియెట్లన, బ్రాహ్మణాదులె వ్వరో! మొదటనిర్ధారణజేసి,! అనగా, జన్మచేత బ్రాహ్మణాదిత్వ మంగీకరించి, యటుపిమ్మట బ్రాహ్మణాదిధర్మము లుపదేశించుచున్నవని గ్రహింపవ లెను. కాబట్టి "బ్రాహ్మణున కధ్యాపనాదులు ధర్మములు" ఈ మొదలై న శాస్త్రవాక్యములు విధిపరత్వముగా గ్రాహ్యములు గనుక గుణవ్యవాదము నంగీకార్యము,

శంక:—సర్వమువిధిపరమేని, తత్త్వమసీతి వేదాంతవాక్యానర్థక్యము సంభవించును. వేదాంతమున నాత్మయిట్టిదని వర్ణింపబడుచున్నది; కాని, యిట్టికర్మలాచరించవలెనని కాదుగదా. ఇట్లు యథాభూతవస్తు జ్ఞానమును మాత్రమే కలుగజేయునవియైనను వేదాంతవాక్యము లుపయోగకరములగుచున్నవి. ఆవిధముననే, "సత్యాదిగుణములవలన బ్రాహ్మణాది నామము" లనుమాటలు కూడ నుపయోగకరములు. ఏలన, జ్ఞానమెప్పుడును ప్రయోజనము కలదేకదా.

సమాధానము:—అన్నివిధములైనజ్ఞానములును పురుషార్థ సాధకములనుట తప్పు. ఏలన, మసిబొగ్గునల్లగానున్నది—ఈవిధమైన జ్ఞానమంత యుపయోగించదు. మఱియు, బ్రాకృతజ్ఞానము మిథ్యాజ్ఞానమనియే చెప్పనొప్పు. బ్రహ్మతత్వజ్ఞాన మొక్కటియే వాస్తవమైనది. ఒకనికి భగవంతుడు కలడా లేడా యనిసంశయము పుట్టిలేడనిభ్రమించి లోకాయతిక (Atheistic) మతమవలంబించుట కలదు కాబట్టి, యట్టిసంశయము దొలగించుటకు భగవంతుడున్నాడని శాస్త్రము చెప్పవలసివచ్చినది. అటులనే, దేహాత్మభ్రాంతి ప్రణాశము ద్వారాయానందాత్మ ప్రాప్తినిమిత్తమై తత్త్వమసీతి వాక్యములు

ప్రవర్తించుచున్నవి; కాన, నిరర్థకములుకావు. కాని, "సత్యాదులుకలవాఁడు బ్రాహ్మణుఁడు" అనునవి విధిపరములు కానిపక్షమున నిరర్థకములగును. "యద్యప్యన్యత్ర (=కర్మకాండే) వేదవాక్యానాం విధిసంస్పర్శమంతరేణ ప్రమాణత్వంనదృష్టం, తథాప్యాత్మవిజ్ఞానస్య ఫలపర్యంతత్వాన్న తద్విషయస్య శాస్త్రస్యప్రామాణ్యం శక్యంప్రత్యాఖ్యాతుం" (వేదవాక్యముల కితరస్థలములందు విధిసంయోగములేనప్పుడు ప్రమాణత్వము లేకపోవుట నిజమైనప్పటికి, ఆత్మవిజ్ఞానము ఫలరూపంబే యైయున్నది కాబట్టి తత్సంబంధమైన శాస్త్రమునకు ప్రామాణ్యము నిరాకరించుటకు శక్యముకాదు—శ్రీశాంకరశారీరకభాష్యము, అ I. పా 1. సూత్ర 4.) ఈగ్రంథమునందే మఱియొకచోట (సూ.4) "వస్తుమాత్రకథనేపి 'రజ్జురియంనాయంసర్పః' ఇత్యాదౌ భ్రాంతిజనిత భీతినివర్తనేన అర్థవత్త్వందృష్టం।తథా,ఇహాపిఅసంసార్యాత్మ వస్తుకథనేన సంసారిత్వభ్రాంతినివర్తనేన అర్థవత్త్వంస్యాత్" (వస్తుజ్ఞానము మాత్రమే యుపదేశింపఁబడినప్పటికి, 'ఇదిరజ్జువుగాని సర్పముకాదు' ఇట్టిచోట్ల భ్రమవలనగల్గిన భయమునశించుటమూలముగా అర్థవత్త్వముగోచరించుచునే యున్నది। అటులనే, జ్ఞానకాండయందు గూడనసంసార్యాత్మవస్తూపదేశముచేత సంసారియను భ్రాంతినివర్తించును కాబట్టి తదుపదేశమునకర్థవత్త్వమే కలదు) అని శ్రీశంకరాచార్యులు విస్పష్టముగా వక్కాణించియున్నారు.

ప్రశ్న:—ఇక్కడ నీవిధిమీమాంస యెందుకు? జైమినీయన్యాయమాలావిస్తరమునందున్న "కర్మైధర్మేగమకం విధివాక్యం ప్రమాణం" అను వాక్యముచొప్పున విధినిబోధించని వాక్యమేదియు కర్మకాండయందు ప్రమాణముకాదని యంగీకరింతము. కాని, దానివలన,గుణమునుబట్టివర్ణముకాదని యెట్లు తేలును?

ఉత్తరము:—అధికారి నిర్ణయముచేయకుండ, విధిగాని ప్రతిషేధముగానిరాదు. ఇదిశాస్త్రమర్యాద. అధికారి నిర్ణయమున కర్తృత్వసామర్థ్య

ము లపేక్షింప బడుచున్నవి. ఇందుకు ప్రమాణము శాంకరశారీరక భాష్యమునందలి "ధర్మతారతమ్యాదధికారి తారతమ్యం। ప్రసిద్ధం చార్థిత్వసామర్థ్యాదికృతమధికారి తారతమ్యం।" (ధర్మతారతమ్యమువలన నధికారితారతమ్యము ద్యోతించుచున్నది. అట్టియధికారి తారతమ్యమర్థిత్వసామర్థ్యాదులవలన నిర్ణయింపనగునని ప్రసిద్ధికలదు.—సూత్రము 4) అనువచనము. కాబట్టి స్వాధ్యాయాది విధికెట్టివారధికారులు? అనగా. నెట్టివారికి స్వాధ్యాయాది కర్మానుష్ఠాన సామర్థ్యాదులున్నవి? కోరికగలవారంతరికినని ప్రతిపక్షులందురు. కానియర్థిత్వ మున్నజాలదు, సామర్థ్యాదులుకూడ నుండవలెను. అట్టిసామర్థ్యము లాకనికున్నదోలేదో యిప్పటి యభినివేశాదులనుబట్టి. శాస్త్రము నిశ్చయించుటలేదు. కాబట్టి, గుణమునుబట్టి వర్ణమనుటవట్టిమాట,

పూర్వపక్షము:—అర్థిత్వమే సామర్థ్యము. ఎవడేకర్మానుష్ఠానము గోరునో, వాడాకర్మానుష్ఠానమునకు సామర్థ్యముగలవాడు.

సిద్ధాంతము:—కాదు. ఏలన, అర్థిత్వమున్నను సామర్థ్యము లేకపోవచ్చును. కాబట్టి శాంకరభాష్యము "యత్ర్వర్థిత్వం, నతదసతిసామర్థ్యే అధికారకారణంభవతి." అనినుడువుచున్నది. (అ I. పా 3. సూ 34)

పూర్వపక్షము:—ఒకవర్ణమున జనించినవారు మఱియొకవర్ణమునకు విహితములైన కర్మలనభ్యాస బలమువలన జేయగల్గుదురు కాన, చేయవలెను.,

సిద్ధాంతము:—కాదు. ఏలన, నట్టిలౌకికసామర్థ్యము' మాత్రముండిన జాలదు. ఇందుకుభాష్యము—"సామర్థ్యమపినలౌకికంకేవల మధికారకారణంభవతి; శాస్త్రీయేఅర్థే శాస్త్రీయస్యసామర్థ్య స్యాపేక్షితత్వాత్" శాస్త్రప్రోక్తకర్మలాచరించవలసి వచ్చినప్పుడు, శాస్త్రాంగీకృత సామర్థ్యమున్నదోలేదో విచారింపకతప్పదు. అట్లువిచారించినప్పుడు, శూద్రాదిజాతీయులకు వేదాధ్యయనాది సామర్థ్యవిశేషములు లేవనిస్పష్టమగును. కాన, నట్టివారికాయాకర్మలు విధింపబడుటలేదు, ప్రతిషేధింప బడుచున్నవి.

పూర్వపక్షము:—సత్వాదిగుణప్రధానుల కధ్యాపనాదికర్మలు విధిం

పబడుచున్నవి; బ్రాహ్మణాదియోని సంభూతులకు గాదు కాన, గుణ ములవలనవర్ణము.

సిద్ధాంతము:—కాదు. ఏలన, తపథ్యాపనాదులును సత్యాదిగుణసూచకములు. అధ్యాపనము సత్వగుణమునే సూచించునుకదా. సత్వగుణమన్నప్పుడు, సత్యము, అధ్యాపనముమొదలయిన బ్రాహ్మణధర్మములన్నియు సత్వగుణము నందంతర్భూతము లగుచుండలేదా? అంతర్భూతములేని, సత్వగుణప్రధానునకు సత్యాదులెట్లు విధింపబడగలవు? సత్యాదులు సత్వగుణమునకు బాహ్యముగానుండినగదా, సత్వగుణప్రధానునిచే సంగ్రహింపబడుటకు వీలుండుట? సత్వగుణమున్నవానికి సత్యాదులున్నవనియె చెప్పవలసియుండును గనుక, నట్టివానికి సత్యాదులుండవలెనని విధించుట యసమంజసమగును. కాబట్టి సత్యాదిగుణవిశేషము ననుసరించి వర్ణవైచిత్ర్యము కాదు.

పూర్వపక్షము:—సత్వగుణప్రధానుడనగా, నన్నిగుణములును మంచివేయని యర్థముకాదు. దుర్గుణములకంటె సుగుణములే యధికసంఖ్యగా నెవ్వనియందుండునో, వాడుసత్వగుణప్రధానుడు. అట్టివాడితర సుగుణములనుకూడ సంపాదింపవలెనని యాశయము. కాన, విధికి వైయర్థ్యములేదు.

సిద్ధాంతము:—ఉన్నది. ఎట్లన; నీయుక్తిప్రకారము తమోగుణప్రధానుడన దుర్గుణములధిక సంఖ్యాగాగలవాడని ఫలించును కాబట్టి యట్టిమనుష్యుడు మిగిలిన దుర్గుణములనుకూడ సంపాదింపవలెనని తేలును. ఇదిహాస్యాస్పదముకదా! కాని, తమోగుణప్రధానుని (=శూద్రుని) కైనను తనకులేని తమోగుణ వికారములనుగూడ బూర్తిచేసికొమ్మనిశాస్త్రము విధించుటలేదు. పెద్దలయందు గౌరవము, అసూయారాహిత్యము, మొదలయినధర్మములను విధించుచున్నది. అసూయారాహిత్యాదులు తమోగుణవికారములు కావుగదా. కాబట్టి తక్కువయైన తమోగుణవికారములను సంపాదింపవలెననుటకు బదులుగా సత్వగుణసంబంధములయిన గుణములనే శాస్త్రమువిధించుచున్న హేతువుచేతను, బరిశిష్టగుణ సంపాదనమును శాస్త్రము విధించుచున్నదను

టకునీలు లేదు.

ప్రశ్న:—పరిశిష్టసుగుణ సంపాదనమునే విధించుచున్నదని భావింపుము.

ఉత్తరము:—కాదు. ఏలన, నట్టిసుగుణములనెవ్వి? యుద్ధాదులు రజోగుణసంభవములు కాబట్టివిసర్జనీయము లనవలసివచ్చును. సత్వగుణమే కదా మంచిగుణము. కానియుద్ధాదులును గీతాదులు విధింపుచున్నవి. కాబట్టి యీవాదముతప్పు. మఱియు నొకవర్ణమునకు విధింపబడిన ధర్మములందే కొన్నిసత్వగుణమును! సూచించును. మఱికొన్ని రజోగుణమును సూచించును. దానము సత్వగుణమును, యుద్ధమురజోగుణమును ప్రకటించును కదా. ఇప్పుడు, మిగిలిన మంచిగుణములే సంపాదనీయములన్న పక్షమున, క్షత్రియుడు, యుద్ధము బరిత్యజించిదానము బరిగ్రహించ వలసివచ్చును. కాని, విధి దానయుద్ధములరెంటిని క్షత్రియునకు శాసించుచున్నది. కాబట్టి యుద్ధపరమైన విధికానర్థక్యము తటస్థించును. ఇదిసమంజసము కాదు. కాబట్టి మిగిలిన మంచిధర్మముల నవలంబించవలెనని వర్ణధర్మవిధుల యభిప్రాయము కానేరదు.

ప్రశ్న:—తమోగుణము దుష్టమైనదిగాని, రజోగుణమును దుష్టమగునా

ఉత్తరము:—దుష్టముకాదేని, "రజసోలోభఏవచ" అను గీతావచనమునకర్థమేమి? లోభాదులు దుష్టములుకావా? "రజస్తమోలింగానామాహారాణాం పరివర్జనార్థం, సత్వలింగానాంచోపాదానార్థం" అనుగీతాభాష్యవచనము రజోగుణ తమోగుణములను సూచించు ఆహారాదులను విసర్జించి సత్వగుణసూచకములైన వానినే స్వీకరింపవలెనని తెలియజేయుటలేదా? కాన నీవాదమువొప్పున సాత్వికకార్యముల నిల్పుకొని రాజసకార్యములయిన యుద్ధాదుల మానవలసివచ్చును. కాని, ఇది విధివిరుద్ధము. కాన, పరిశిష్టసుగుణావలంబన వాద మాలంబరహితంబు.

మఱియు, శాస్త్రవిహితములయినసమస్తకర్మలును నిర్దిష్టములై యనుష్ఠాన యోగ్యములే యందురేమో. అట్లైనచో, రజోగుణాది ప్రధానులే, యుద్ధాదికర్మంబు లాచరింపవలెనని నియమమెందుకు ? యుద్ధాదులు సమీచీనములయినచో, నెవ్వరాచరించిన నేమి? కాబట్టి సత్వాదిగుణములనుబట్టి కర్మవిభాగమనుట యసమంజసంబు.

మఱియు, రాజసాది గుణప్రధానులకు మాత్రమే యుద్ధాదులు యోగ్యములందురా ? అప్పుడును చిక్కుకలదు. ఏలన, అప్పుడు, తద్విపరీతగుణప్రధానులకు, తద్ధర్మముల యోగ్యములే కావలెనుకదా. కాని, సత్వగుణప్రధానులనబడు బ్రాహ్మణులకు నిషేధింపబడిన సత్వాదిగుణపుంజమే, తమోగుణప్రధానులనబడు శూద్రులకును విధింపబడుచున్నది. ఇది యసంగతముకదా. ఏలన, యోగ్యతలేనివారికిని విధింపబడుచున్నట్లగును. యోగ్యతయున్నదందురా, లేదనిచెప్పిన పైమాటకు విరోధమగును. కాన, గుణవాదముతప్పు.

శంక:—ఇట్టిదోషము జన్మనుబట్టివర్ణమను సిద్ధాంతమునకును పట్టును.

సమాధానము:—పట్టదు. ఏలన, నాల్గువర్ణములవారికిని వారివారివర్తమానజన్మలకు కారణభూతములయిన గుణవిశేషముల ననుసరించి ధర్మములు విభజింపబడుచున్నవి. ఈజన్మమందలి గుణంబులకునుసత్వాద్యనుష్ఠాన విధులకును విరోధముండవచ్చును. గుణము తమోగుణమైనవానికి, విధిసత్వాద్యనుష్ఠాన విధియగుట వైపరీత్యమేకదా. కాని, యధునాతన శరీరమునకు హేతుభూతంబగు గుణవిశేషంబులకును, అధునాతన విధులకును వైషమ్యమేమియు గోచరించదు. అపూర్వమెట్టిగుణమో, ఇప్పుడట్టి శరీరమేవచ్చియున్నది. ఇప్పుడెట్టిశరీరమో, అట్టివిధియే పనిచేయుచున్నది. ఇక, విరోధమెక్కడ ? వర్ణవిధులిప్పటిగుణముల నపేక్షించి వచ్చినవికావు, ప్రాక్తనగుణములనపేక్షించి ప్రవర్తించునవి.

ప్రశ్న:—అట్లయినచో, నిప్పటిగుణములకును విధులకును విరోధమెట్లు సంభవమగుచున్నది?

ఉత్తరము:—ప్రారబ్ధవశమున, పరస్పరవిరుద్ధకర్మ జన్యఫలప్రారంభవశమున. విదురాదులసంగతియిట్టిదే. వీరుజ్ఞాన సంస్కారముతో బుట్టినప్పటికి బ్రాహ్మణేతరజాతియందు బుట్టి, బ్రాహ్మణేతరజాతి విధివిషయత్వము నందవలసినవారైరి. కాబట్టియే, శ్రీమద్రామానుజాచార్యులిట్లానతిచ్చియున్నారు—"విదురాదయస్తు భవాంతరాధిగతజ్ఞానాప్రమోషాత్ జ్ఞానవంతః, ప్రారబ్ధవశాచ్చ దృశజన్మయోగినః, ఇతి తేషాంబ్రహ్మ! నిష్ఠత్వం" (శ్రీభాష్యము)

—:భగవద్గీతలు—వర్ణవిభాగము:—

పూర్వపక్షము:—"చాతుర్వర్ణ్యం" అనుగీతాశ్లోకమువలన గుణముల ననుసరించి వర్ణవిభాగమని తేలుచున్నది.

సిద్ధాంతము:—ఇప్పటిగుణముల ననుసరించి కాదు, పూర్వపుగుణముల ననుసరించి. కాబట్టియే సరస్వతీ విగ్రహుడనదగు శ్రీమధుసూదన సరస్వతియిట్లు లిఖించియున్నాడు—"శరీరారంభక గుణవైషమ్యాద్ న సర్వే సమానస్వభావాః" (శరీరములను కలుగజేయుగుణముల తారతమ్యమువలన గూడ, నందఱును సమానస్వభావములు కలవారుకారు —గీతాటీక) ఇందలి "శరీరాంభక" అనుమాట నాలోచింపుడు. అట్టిశరీరము లెవ్వియన బ్రాహ్మణాదిశరీరములు. ఈశరీరము లెట్లుద్భవించెనన, సత్వాదిగుణవ్యాపారమువలన. అదియెప్పుడన, శరీరోత్పత్తికి బూర్వమున, అనగా బూర్వజన్మమున. ఈశరీరములకు బ్రాహ్మణత్వాది వైచిత్ర్యమెట్లు వచ్చినదన, ప్రాక్తనసత్వాదిగుణ వైచిత్ర్యమువలన. కాబట్టి, యిప్పటిసాత్వికాది గుణము లిప్పటి బ్రాహ్మణాదివర్ణములను కలుగజేయవనుట స్పష్టమేకదా.

సర్వధర్మాన్పరిత్యజ్య (అ 18) అని గీతాశాస్త్రముతుదను నిష్కర్షించి చెప్పుటవలన కర్మసంన్యాసమునందు భగవద్గీతకు తాత్పర్యము కలదందురేమో. సత్యము. కాని, కర్మాధికృతులైన యర్జునాదులవిషయమునందు మాత్రము కర్మయోగము నందేయభిప్రాయమున్నది, ఇది పార్థుడు

" నయోత్స్య ఇతిగోవిందం " (యుద్ధముచేయనని II 9) ఉపక్రమించి, శ్రీకృష్ణవాగౌషధసేవా సమనంతరంబు " నష్టోమోహః కరిష్యేవచనంతవ " (మోహాదులు గలించినవి. నీయాజ్ఞానుసారము యుద్ధముచేసెదను-అ 18.73) (యుద్ధాయోత్థితోస్మి—శ్రీధరవ్యాఖ్య) అని యుపసంహారము చేయుటవల న ద్యోతించుచున్నది. అంతేకాదు. అధ్యాయములం దనేకస్థలముల " మా మనుస్మరయుధ్యచ" యుధ్యస్వ విగతజ్వరః " యుధ్యస్వ, జేతాసి " య ని శ్రీకృష్ణుడు ప్రేరేపించుచున్నాడు కదా. అటులనే భాష్యమున " త స్మాద్యుద్ధాదుపరరామ " యని యుపోద్ఘాతవచనము. కాబట్టి నివృత్తిమార్గ మున కధికారములేనివారు వర్ణాశ్రమధర్మో పేతమైన ప్రవృత్తిమార్గము నవ లంబింపవలెనని గీతాశయము.

ప్రవృత్తిమార్గమన. వర్ణాశ్రమకర్మ కరణమని యెట్లుగ్రహించితి వందురేమో. " స్వకర్మణాత మభ్యర్చ్య " " బ్రాహ్మణ క్షత్రియవి శాం " " సహజంకర్మ " " స్వధర్మేనిధనం శ్రేయః " " స్వధర్మ మపి " సుఖినః క్షత్రియాః " " ధర్మ్యంసంగ్రామం " ఇత్యాదివచనముల వలననని సమాధానము. వర్ణధర్మము లుపేక్షణీయములయిన పక్షమున, నిట్టి వచనముల కవకాశముసున్న!

" సధర్మో బ్రాహ్మణాద్యైర్వర్ణిభిరా శ్రమిభిశ్చ శ్రేయోర్థిభిరనుష్ఠీ యమానః " అనియు, " అభ్యుదయార్థోపియః ప్రవృత్తిలక్షణో ధర్మోవ ర్ణాశ్రమాంశ్చోద్దిశ్య విహితః, సదేవాదిస్థానప్రాప్తి హేతురపిసన్నీశ్వరా ర్పణ బుద్ధ్యానుష్ఠీయమానః సత్వశుద్ధయే భవతి, ఫలాభిసంధివర్జితః। శుద్ధస త్వస్యచ జ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తిద్వారేణజ్ఞానోత్పత్తిహేతుత్వేనచని శ్రే యసహేతుత్వమపి ప్రతిపద్యతే। " శంక. ప్రాకృతలాభమునకై వర్ణాశ్ర మముల నుద్దేశించియే ప్రవృత్తిలక్షణమైన ధర్మమువిధింప బడుచున్నదో, అ దిదేవాది పదవులబొందించు నదియైనప్పటికి, ఈశ్వరార్పణ బుద్ధితో ఫలవాం ఛా వర్జితముగా ననుష్ఠింప బడినపక్షమున చిత్తశుద్ధిగల్గించునది యగును.

అట్లుచిత్తశుద్ధిగల్గినవానికి జ్ఞాననిష్ఠాయోగ్యత ప్రాప్తింపజేయుట మూలను
గా జ్ఞానోత్పత్తికి సాధనమై మోక్షమునకుగూడ సాధనమేయగునని చెప్పనొ
ప్పు.) అనియు సరసవాగ్ధోరణిని ధర్మరహస్యము నంతను వెల్లడిచేయుచున్న
శ్రీశాంకరభాష్యభాషయందు బరిచితిగల పాఠకులకు మద్బాల్యభాషను వ్యా
ఖ్యానమనవసరము లేదుకదా.

యుద్ధాదివర్ణకర్మలు స్మార్తకర్మలనియు నగ్నిహోత్రాదులవలె శ్రౌ
తకర్మలు కావనియు నందువలన నుపేక్షణీయములే యనియు నాక్షేపింతు
రేని, " క్షత్రియస్యయుద్ధం స్మార్తం కర్మస్వధర్మః " (క్షత్రియునకు
స్మార్తకర్మయైన యుద్ధమును స్వధర్మమే) యను భాష్యవచనమున కర్థమే
మి? మఱియు, స్మృత్యుక్తకర్మలును శ్రుతిమూలకములే. అంతేకాదు. శ్రు
తులైనను, మొదట వర్ణాశ్రమవ్యవస్థ నంగీకరించియే, యగ్నిహోత్రాదులను
విధించుచున్నవి,

మఱియుమీకు అగ్నిహోత్రాదులవంటి శ్రౌతకర్మలే కావలయునే
ని, సత్యాదులకు దావెక్కడజూపగలరు?

యుద్ధాదులందు హింసాదిదోషమున్నది గాననవి విసర్జనీయములందు
రా. దోషములేని కర్మలజూపుడు. " సహజం... అవృతాః "(అ 18.శ్లో 48)
అను గీతాశ్లోకమును. ముందు, సమాధానము చేయుడు.

జ్ఞానారూఢులకు వర్ణముతో నిమిత్తములేదందురేమో. " లోకసంగ్ర
హమేవాపిసంపశ్యన్కర్తుమర్హసి " (అ 3. శ్లో 20) అను వచనముచొప్పున
నట్టివారికి లోకమునందించుకయు ననుగ్రహము లేకుండవలెనా?

జ్ఞానులుతమ కిష్టమయిన వర్ణధర్మమొద్దియైన నాచరించుచు లోకమున
కుదారి చూపవచ్చునందురా? అప్పుడు, స్వధర్మమనియు బరధర్మమనియు
విభజించి స్వధర్మానుష్ఠానమును విధించుట కవకాశముండదు. కాని, భగవద్గీ
తయట్లు విభాగించుచున్నది. కాబట్టి తమకిష్టమైన ధర్మమనుటకు వలనుపడ
దు. స్వధర్మానుష్ఠానమెట్లు చేయవలెనో యావిషయమునే జ్ఞానులుతమ నడత

వలన జూపవలెనా, లేకపరధర్మానుష్ఠానరీతినా? ...ధర్మానుష్ఠాన మొనరిం చురీతినేయన్నపక్షమున, నదిస్వధర్మానుష్ఠానమును మాత్రమే చేయవలెనన "పరధర్మోభయావహః" ఇత్యాదిగీతావాక్యములకు విరోధించును. నరులకు స్వధర్మానుష్ఠానము చేయురీతిని మాత్రమే చూచుటయావశ్యకము. కాని, పరధర్మానుష్ఠాన ప్రక్రియ యెట్లుపయోగించును? అట్టిదానిని తమజీవితములం దు జ్ఞానులు ప్రదర్శించుటవలన పామరులకెట్లు లాభముచేకూరును? జనకా దిక్షత్రియపుంగవులు క్షత్రియేతర ధర్మములననుసరించి యుండినచో, పా మరజనులందరును "యద్యదాచరతిశ్రేష్ఠః" అను న్యాయముచొప్పున వా రివారికి విహితములయిన ధర్మములను పరిత్యజించి పరవర్ణములకు విహితముల యిన ధర్మములనే యాచరించుచు నుందురుకదా. అప్పుడు, వర్ణవ్యవస్థయేపో వును గదా. కాబట్టిదానిని నిల్పుటకు, జ్ఞానులుతమతమవర్ణముల ధర్మములనే యాచరించిచూపవలెనని భగవద్గీతాహృదయము. "విద్యావతాపిలోకమర్యా దా స్థాపనార్థంవిహితంకర్తవ్యం" (అ 3. శ్లో 21) అనుఆనందగిరిటీకాను సారముగా దనకువిహితమైన ధర్మమును జ్ఞానియాచరించ వలెనని తేలుచు న్నదికదా. తనకువిహితమయిన దనగా, స్వవర్ణవిహితమయినదని యర్థముకా దన్నచో, నికనేద్ది? అప్పుడు, పామరజనంబులకు స్వపరభేదజ్ఞానమెట్లు సి ద్ధించగలదు? ఏలన,నొకజ్ఞానియుద్ధ వ్యాపారమున నుండవచ్చును; మఱియొక డు వాణిజ్యముజేయు చుండవచ్చును; మూడవవాడు సంన్యాసియై కాలముగ డుపవచ్చును. ఇప్పుడు, పామరజనులు మొదటిజ్ఞానినిజూచి యుద్ధముజేయవలె నా, రెండవవానినిచూచి వాణిజ్యమా, మూడవవానినిచూచి సంన్యాసమా? కాబట్టి స్వేచ్ఛావ్యాపారమే లోకసంగ్రహమన్నపక్షమున, ప్రాకృతజనుల కు గరణీయకర్మనిశ్చయమునకు మారుగాబుద్ధి భ్రమణము తటస్థించును.

ఇక్కడ నొక విషయమాలోచింతము. అర్జునునకు యుద్ధము విధింపబ డుట రాద్ధాంతమే కదా. ఇది, క్షత్రియునకు సంన్యాసము నందధికారము లేకపోవుటచేతనా? లేక, అధికారమున్నప్పటికి, సంన్యాసమునకు దగిన

వైరాగ్యాదిసాధనసంపత్తి పార్థునకు లేకుండుటచేతనా? ఈరెండును కారణములేకావచ్చును. అప్పుడును మాపక్షమునకు భంగములేదు.

క్షత్రియావధికారపక్షమునకు బ్రమాణము లెవ్వియన, "బ్రాహ్మణస్యైవసంన్యాసాధికారః" (బ్రాహ్మణునకు మాత్రమే సంన్యాసమునందధికారము) అని సిద్ధాంత లేశసంగ్రహమునందున్నది (తృతీయపరిచ్ఛేదము.) 'త్రయాణామపి వర్ణానామమీ చత్వారఆశ్రమాః" ఇత్యాది స్మృతివాక్యములబట్టియు, "త్రయాణామవిశేషేణసంన్యాసః శ్రూయతేశ్రుతౌ" అనుసురేశ్వరవార్తికోక్తినిబట్టియు, ద్రివర్ణములవారికిగూడ సంన్యాసాధికారము కలదందురేని, "బ్రాహ్మణోవ్యుత్థాయ" ఇత్యాది సంన్యాసవిధాయకశ్రుతులక్షీయర్థము విరుద్ధముగాన విరోధాధికరణ న్యాయముచొప్పున నుపేక్షణీయము. వార్తికవచనమయినను విద్వత్సంన్యాస పరమయినది. ఏలన "సర్వాధికార..." ఇత్యనంతరశ్లోకమున బ్రహ్మజ్ఞానోదయమయిన సమయమునందుగూడ బ్రాహ్మణులకుమాత్రమే సంన్యాసాధికారమను నియములేదని—అనగా, విద్వత్సంన్యాసమున క్షత్రియాదులకు నధికారము కలదనియే—వార్తికాభిప్రాయము. మూలమయిన భాష్యమునకు వార్తికము విరోధముగా నుండనేరదుకదా. విద్వత్సంన్యాసమునందు నిషేధములేకపోవుటకు హేతువు అనివార్యత్వమేయని "సకలకర్మనివృత్తిరూపవిద్వత్సంన్యాసస్య క్షత్రియవైశ్యయోరపి వారయితుమశక్యతయా "యనిసిద్ధాంతలేశసంగ్రహవ్యాఖ్యయేనుడువుచున్నది. కాబట్టి బ్రాహ్మణేతరులకు సన్న్యాసమునందు ముఖ్యాధికారము లేదన్నపక్షము సాధింప బడుచున్నది.

అటులనే శ్రీమధుసూదన సరస్వతి ,,క్షత్రియజన్మ ప్రాపకేణకర్మణారబ్ధశరీర స్త్వంవిద్వానపి జనకాదివత్ప్రారబ్ధకర్మబలేన లోకసంగ్రహార్థంకర్మకర్తుంయోగ్యో భవసి, నతుత్యక్తుం, బ్రాహ్మణజన్మాలాభాత్" (అ-3-శ్లో-20) అనియు "బ్రాహ్మణధర్మస్య సర్వకర్మ సంన్యాసస్య క్షత్రియాదికంప్రతినిషేధాత్" అ-18-శ్లో-6) అనియులిఖించియున్నాడు. ఇం

దలి "బ్రాహ్మణ జన్మాలాభాత్" నిది బ్రాహ్మణజన్మముకాని హేతువుచేత ననుమాటనుగమనింపుడు. అటులనే శ్రీశంకరానందులు " యథాజనకాశ్వపతి ప్రభృతీనాం ముక్తానామప్యధికారిణాంలోక సంగ్రహచికీర్ష యా కర్మాచరణం, తద్వదర్జునస్యాప్యధికారికస్య లోకహితాయకర్మాచరణ మవిరుద్ధమేవ " అ 18. శ్లో 73 అనిస్పష్టముగావ్రాసియున్నారు. ఇందలి " అధికారిణాం " క్షాత్రకర్మాధికారము మాత్రమేకల) యనువిశేషణము ను గమనింపుడు. పార్థుండుజ్ఞానారూఢుడవునా కాదా?జ్ఞానారూఢుడేని.క ర్మయందే యధికారముండదు గదా—కర్మయనుపయుక్తము కాబట్టి. స్వ ప్రయోజనార్థముగాక, లోకానుగ్రహార్థము కర్మప్రవృత్తి యట్టివానికిగల్గి నప్పుడు, ఆతడేట్టివర్ణము నందుద్భవించెనో యట్టివర్ణమునకు విహితములయిన కర్మలనే యాచరింపవలెనని పై ప్రమాణములవలన స్ఫుటమగుచున్నది. కాదే ని, యర్జునునకు క్షాత్రధర్మముమాత్రమే విధించిసంన్యాససూచిత బ్రా హ్మణధర్మము బ్రతిషేధించు కృష్ణవాక్యముల కవకాశమే లేకపోవును.

అర్జునుడు జ్ఞానారూఢుడు కాడందురా, అప్పుడు క్షత్రియవంశోద్భ వుడయిన అర్జునునకు స్వవర్ణధర్మము నుష్ఠేయమనుశాసనమువలననే, ఇతరవర్ణ ములవారును వారివారిధర్మముల ననుష్ఠింపవలెననియే యాదేశమగుచున్నది.

మఱియు, శుద్ధాంతః కరణత్వాదులే సంన్యాసాది బ్రాహ్మణయో గ్యధర్మంబుల ననుష్ఠించుటకు నర్హతనిచ్చునన్న పక్షమున, సంన్యాసమునకు బ్రాహ్మణకులోద్భవులు మాత్రమే యధికారులా లేక ఏవర్ణములందు జన్మిం చిన వారైనను అధికారులే నాయనుమీమాంసకే యవకాశముండదు. కాని, బ్రాహ్మణవంశోద్భవులు మాత్రమే యధికారులని మధుసూదన సరస్వతి మొదలయినవారు నిష్కర్షించుచున్నారు కాబట్టి, శుద్ధాంతః కరణత్వాదు లు బ్రాహ్మణకరణీయకర్మలకు యోగ్యతగల్గింపలేవని సిద్ధాంతము, గుణవర్ణ వాదమమిథ్య (యఃశుద్ధాంతఃకరణః ఏతాదృశశ్చేద్బ్రాహ్మణః, సన్యాసి సప్రతిబంధరహితః, సర్వకర్మాణి సంన్యస్యతునామ. ఏతాదృశశ్చేత్ క్ష

త్రియాదిః, సంన్యాసానధికారీ, సకరోతునామకర్మాణి) (' శుద్ధాంతః క
రణుడయిన భగవదేకశరణుండు బ్రాహ్మణుండేని, సంన్యాసమున కర్హుండే
కాబట్టి సమస్తకర్మలను విసర్జింపనిండు; క్షత్రియాదులలో నొకడయిన ప
క్షమున, సంన్యాసమున కధికారములేని వాడు కాబట్టి కర్మలజేయనిండు' అ
ని మధుసూదన సరస్వతీకృతటీక యందున్నది—అ 18. శ్లో 56)

అర్జునునకు యుద్ధవిధి, యాతడు క్షత్రియపుత్రుడను కారణమున గల్గెనన్న పక్షమున, బ్రాహ్మణత్వార్హగుణాభావముకూడ గారణమెట్లు కాగలదని శంకింతురేమో. రెండును కారణములగుట న్యాయసమ్మతమే. ఎట్లన, భగవద్గీతలందు అర్జునుని యుద్ధసన్నద్ధుని జేయుటకనేక హేతువులు పపాదింపబడినవి. యుద్ధవైముఖ్యము, అనార్యులగుణము గనుక (అ 2 శ్లో 2) క్లైబ్యసూచకము గనుక (శ్లో 3), భీష్మాదిశరీర ధ్వంసమాత్మధ్వంసము గల్గింపజాలదు గనుక (నజాయతే మ్రియతే-శ్లో 20), దేహమున కెప్పుడయినను చావుతప్పదుగనుక (జాతస్యహిధ్రువోమృత్యుః-శ్లో 27), క్షత్రియపుత్రునకు యుద్ధము శ్రేయఃసాధనముగనుక (స్వధర్మమపిచావేక్ష్య-శ్లో 21), యుద్ధమున మృత్యువు స్వర్గఫలమొసంగును గనుక (యదృచ్ఛయాచోపపన్నం-శ్లో 32), యుద్ధవైముఖ్యము ప్రత్యవాయ ప్రదంబుగనుక (పాపమవాప్స్యసి-శ్లో 34), అకీర్తికరముగనుక (అకీర్తిం-శ్లో 34), శత్రువులు చులకనజేయుదురు గనుక (భయాద్రణాత్-శ్లో 34), తిట్లుసహించుట కష్టముగనుక (అవాచ్య-శ్లో 36), సంన్యసించుట మాత్రమున నైష్కర్మ్యసిద్ధి కలుగదుగనుక (నకర్మణామనారంభాత్ అ. 3. శ్లో 4), అకర్మకంటె కర్మయేమంచిది గనుక (కర్మజ్యాయోహ్యకర్మణః-శ్లో 8), భగవత్ప్రీతి కరములయిన విహిత కర్మలు బంధకరములు కావుగనుక (యజ్ఞార్థాత్-శ్లో 9), ఇంకను కారణములు కావలెనా? చూడుడు. లోకులకుదారిచూపవలెను గనుక (లోకసంగ్రహ-శ్లో 20), పరధర్మమ నర్థావహము గనుక (పరధర్మోభయావహః-శ్లో 35), ధర్మమునడిపించుట రాజర్షులయనుశ్రుతాచారముగనుక (రా

జర్ఞ యోవిదుః-అ 4-శ్లో 2, 15), కర్మయోగములేక సంన్యాసము కష్టసా
ధ్యముగనుక సంన్యాసస్తు అ 5. శ్లో. 6) ఆత్మకు గారకాదివిక్రియలేదుగను
క (నకర్తృత్వం-అ 5శ్లో. 14) యశమును రాజ్యసుఖము ననుభవింపవచ్చును
గనుక (తస్మాత్త్వముత్తిష్ఠ-అ11, శ్లో 33), జయముపాండవపక్షమునకగుట
నిశ్చయముగనుక (ద్రోణంచ భీష్మంచ-అ 11, శ్లో, 34), యుద్ధముకాయక్లే
శకరమను మిషచే ద్యజించుట రాజసత్యాగముగనుక (దుఃఖమిత్యేవ-అ 18
శ్లో, 8), దేహాభిమానికి సర్వ కర్మత్యాగమసంభవముగనుక (నహి-అ 18
శ్లో, 11), అర్జునునకు యుద్ధమై ముఖ్యభావము సాంసిద్ధికముగాక తాత్కాలి
కమమాత్రమేగనుక (స్వభావజేన-అ, 18 శ్లో, 60), ప్రాణులీశ్వర పరతంత్రు
లగుటవలన నీశ్వరుండయిన శ్రీకృష్ణుడు యుద్ధముచేయ నాజ్ఞాపించుచు
న్నాడు గనుక (ఈశ్వరః సర్వభూతానాం-అ 18, శ్లో, 61) ఇంతటితో
విరమించెదను. యుద్ధముచేయుమని యర్జునుని ప్రోత్సాహించుటయందు
శ్రీకృష్ణుడిన్ని యుపపత్తులను జూపియున్నాడుకదా. మనప్రతిపక్షులు వీని
లోనేది సత్యముకాదనగలరు? తేజస్తిమిరములవలె పరస్పర విరుద్ధములు
కావుగనుక నివియన్నియు వాస్తవములే యగుచున్నవి. మనుష్యుడాహారము
మానకూడదనుటకు శరీరబలము పోవుననుటకారణమా? మనోబలము తగ్గుట
యా? భగవత్సేవకు శక్తిలోపించుటా? అన్నియు హేతువులేకదా. ఇటుల
నే క్షత్రియపుత్రత్వ, సాంసిద్ధికాభిమానవశవర్తిత్వాదులన్నియు, యుద్ధని
ర్వాహమునకుపపత్తులు.

కొందఱు పండితంమన్యులు "స్వభావనియతంకర్మ" ఇత్యాది శ్లోకము
లందు భగవద్గీతలు స్వభావవైచిత్ర్యము ననుసరించి పురుషుల వర్ణవైచిత్ర్యము
వ్యవహరింపబడవలెనని బోధించుచున్నవని చెప్పుచున్నారు. కాని, యదిసరి
కాదు. ఏలన, పశువులకును స్వభావవైచిత్ర్యము గలదుగాన వర్ణవైచిత్ర్యి
ముండవలసివచ్చును. మనుష్యులకు మాత్రిమేయనుటకు వీలులేదు. ఏలన "ఆసు
రీష్వేవయోనిషు" అనున్యాయముచొప్పున స్వభావములను విభజించినప్పుడు

వ్యాఘ్రాది మృగములనుకూడ భగవద్గీతలాసురరాక్షసాది నామములతో వ్యవహరించుచున్నవి.

అయితే, స్వభావపదమునకు బుట్టుకననుసరించి వర్ణమనునర్థముకలదా? యనిశంకించినచో, గలదని యుత్తరము. కాబట్టియే శ్రీశంకరానందులు "బ్రాహ్మణోస్యముఖమాసీత్'ఇతిశ్రుత్యుక్తప్రకారేణ, చత్వారోవర్ణాః=బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రాః తేషాంపూర్వఃపూర్వోజన్మతః శ్రేయానితి న్యాయేనచ, భవఏవభావః=జననంస్వః స్వకీయో భావః=స్వభావః యద్వాస్వేషాంభావః =స్వభావః = ముఖబాహ్వాదిభ్యోననం, ప్రభవః = కారణం, యేషాం, తైః= స్వభావప్రభవైః= స్వజన్మనిమిత్తకైః, గుణైః= ఉత్తమత్వమధ్యమత్వని కృష్టత్వాతిని కృష్టత్వైః, ఉపలక్షితానాం= బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రాణాం, నియమేనకర్తవ్యానియానికర్మాణి, తానిజన్మతఉత్కృష్టత్వాదిభేదేన విభక్తాని= శాస్త్రైణవిభజ్యవిహితాని, ఇత్యర్థః "(గీతావ్యాఖ్య, అ18శ్లో41)అనివచించియున్నారు.బ్రాహ్మణాదులకు, విరాణ్మూర్తిముఖాదులనుండి జన్మించుటవలనగల్గినగుణతారతమ్యము (gradation)ననుసరించివేదాధ్యయనాదికర్మలువిధింపబడుచున్నవని తాత్పర్యము. స్వభావమనగా బూర్వసంస్కారము మాత్రమేయనుట కాధారములేదు. వారివారి పుట్టుక (=స్వభావము) యునర్థము కావచ్చును. కేవలపూర్వ సంస్కారమే యనుటవలన గల్గుననుపపత్తులు ప్రదర్శించియే యున్నానుకాబట్టి జన్మయనునర్థమే సమీచీనముగానున్నది. మఱియు, గుణభేదములనగానిప్పటిసాత్వికాదులు మాత్రమేయనుటకు వీలులేదు, విరాడ్విగ్రహముఖాదులనుండి జన్మించుటవలన గల్గిన ఉత్తమత్వాదిగుణ తారతమ్యము (Fradation),నుకావచ్చును. కాబట్టి " స్వభావప్రభవైర్గుణైః" అనిగీతలు నుడివినతోడనే, యదిగుణవర్ణవాదమును సమర్థించుచున్నదని ప్రతివాదులు గుటకలు మ్రింగుట కవకాశములేదు.

పూర్వపక్షము:—“ ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి” (అ.18. శ్లో 59), “ స్వభావజేన...నిబద్ధః ” (అ 18. శ్లో 60) ఇత్యాదిశ్లోకములందు స్వభావము ననుసరించి కర్మ విధింపబడుమన్నది గాని, జన్మ ననుసరించి కాదు.

సిద్ధాంతము:—అర్జునుని విషయమందు, పరాక్రమాది స్వభావమునకు దగినట్లు క్షత్రియజన్మత్వము కూడ సమకూరి యుండుటచేత మాత్రమే, స్వభావచోది కర్మకరణము విధింపబడినది. అదిసమస్తమానవుల విషయమందును చెల్లదు. ఏలన గొందఱికి స్వభావమొకటి కావచ్చును, జన్మము విరుద్ధమైనది కావచ్చును. స్వభావమునకు నిరంకుశప్రమాణత్వమే గ్రహింతుమేని “ యశ్శాస్త్రవిధిం ” (అ 16. శ్లో 23) ఇత్యాదిశ్లోకములందు సూచింపబడినట్లు శాస్త్రవైయర్థ్యము తటస్థించును. అదియిష్టము కాదుగదా. కాబట్టి స్వభావమే ప్రమాణము కాదనిసిద్ధము.

అయితే స్వభావానుగుణ ప్రవర్తనమర్జునున కెందుకు కృష్ణుడుమంచిదని నొక్కి చెప్పుచున్నాడనగా, సౌకర్యమునిమిత్తము. నావకు ప్రవాహాభిముఖప్రయాణముకంటె ప్రతిముఖప్రయాణ మనాయాసముగా సాగునుకదా. ప్రతిముఖప్రయాణమున, ప్రవాహవేగమునావకుసహాయ పడుచుండమున, స్వవర్ణవిహితధర్మాచరణమునందును స్వభావవేగము (the force of the current of one's tendency) సహాయభూతమగును. ప్రవాహమే వైపునకు బారుచున్నదో కన్గొనుట ప్రధానమైనపనికాదు; ఏదిక్కునకు బోవుటవలన బురుషార్థము సమకూరునో, దానిని విచారించుట ప్రథమకర్తవ్యము. ఏదిక్కునకు బోవుటవలన బురుషార్థమునకు భంగముతటస్థించునో, యాదిక్కునకు బోజనదు. స్వభావవేగము సాయముజేయనిండు, చేయకపోనిండు. స్వభావవేగము ప్రతికూలమయినను, ప్రయాసపదమైన, బురుషార్థనిర్వాహకమార్గగమనంబ కార్యంబు. కాబట్టి యర్జునునకు యుద్ధప్రేరేపణంబు స్వభావప్రామాణ్యభావప్రయుక్తంబుకాదు.

మఱియు, నర్జునునకు యుద్ధనైరస్యము శ్మశానవైరాగ్యము ఘంటివని

చెప్పవచ్చును. దుర్యోధనాదులు శస్త్రపరిత్యాగముజేసిన తన్నుజంపివేసినను, అది తనకు క్షేమకరమే యగునని (అ 1, శ్లో 46) ఘోషించిన యర్జునుడు, ఉత్తరక్షణముననతో త్రస్వభావ ప్రాదుర్భావమయినతోడనే ప్రతిపక్షప్రళయ మహోగ్రదీక్ష వహింపక మానడని, శ్రీకృష్ణదేవుండు కనిపెట్టి వానిని యుద్ధసన్నద్ధుజేసెను. అర్జునుండు క్షత్రియవంశోద్భవుండు కానిపక్షమున, వానిని సంగ్రామకర్మకిట్లు పురికొల్పియే యుండడని "స్వధర్మమపిచావేక్ష్య" (అ 2, శ్లో 31) ఇత్యాదిశ్లోకములవలన విస్పష్టమగుచున్నది కదా. కాన స్వభావము (tendency) బట్టి వర్ణముకాదు.

పూర్వపక్షము:—"నిగ్రహః కింకరిష్యతి" (నిగ్రహ మేమిచేయక లదు ? అ 3, శ్లో 33), "మమమాయాదురత్యయా" అ 7, శ్లో 14) "మిథ్యైవ్య, వస్యవసాయస్తే" (అ 18, శ్లో 59) ఇత్యాది శ్లోకములవలన స్వభావపరతంత్రులమయి యున్నాము గనుక స్వభావ వ్యతిరిక్తములయిన ధర్మముల నాచరింపవలెననుట గీతాభిప్రాయముకాదు.

సిద్ధాంతము:—నీవ్యాఖ్యానముసరికాదని గీతాశయమగుట నిజము! ఓపికతోనించుక నీశ్లోకసందర్భముల బరీక్షింపుము. "నిగ్రహః కింకరిష్యతి?' యన్నప్పుడు, నిగ్రహము కేవలమసంభవమే యని యభిప్రాయముకాదు. అదియొక యర్థాలంకారము. స్వభావజయము మిక్కిలి కష్టమనియర్థము ఇట్టిసందేహమర్జునునకే సంభవించినప్పుడు (చంచలంహి—అ 6. శ్లో 34), శ్రీకృష్ణుడభ్యాస వైరాగ్యములవనన నిగ్రహముజేయవచ్చునని సమాధానము జెప్పియున్నాడు (అసంశయంమహా బాహోమనోదుర్ని గ్రహంచలం। అభ్యాసేనతు కౌన్తేయవైరాగ్యేణచ గృహ్యతే॥—అ 6 శ్లో 35) అటులనే పాతంజలదర్శనమున "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" పా 1. సూ 12.) అని సూత్రింపబడుచున్నది. ఈసూత్రమునకు వ్యాసభాష్యమున "చిత్తనదీనామ ఉభయతోవాహినీ, వహతికల్యాణాయ, వహతిపాపాయచ....తత్రవైరాగ్యేణ విషయస్రోతః ఖిలీక్రియతే. వివేకదర్శనా

ఖ్యాసేన వివేకస్రోత ఉద్ఘాట్యత ఇత్యుభయాధీనః చిత్తవృత్తినిరోధః ” (చిత్తనదియనునది యుభయతః ప్రవహించునది; శుభమువైపునకు ప్రవహించును; అశుభమువైపునకును ప్రవహించును. అందు, వైరాగ్యముచేత విషయవాహిని ఖిలముచేయబడుచున్నది. జ్ఞానదృష్టినభ్యసించుటచేత, వివేకస్రోతము బయటికి దీయబడుచున్నది. కాబట్టి చిత్తవృత్తి నిరోధముభయసాధనసాధ్యము.) అటులనేప్రకృతియేసర్వమునైనసాంఖ్యధర్మమున “ జ్ఞానేన చాపవర్గః (కారికా 44) అనియు “రంగస్యదర్శయిత్వానివర్తతే నర్తకీయథానృత్యాత్। పురుషస్యతథాత్మానం ప్రకాశ్యవినివర్తతే ప్రకృతిః॥ ” (కారిక. 59) నాట్యస్త్రీ గీతాదులను సభ్యులకుబ్రదర్శించి నిష్క్రమించుచందమున ప్రకృతియుబాంచభౌతికాది ప్రపంచమును పురుషునకు ప్రదర్శించి, తద్వ్యతిరిక్తమయిన యాత్మస్వరూపమును స్ఫురింతజేసికైవల్యమును సాధించునని తాత్పర్యము) అనియు బ్రతిపాదింపబడుచున్నది. అటులనే శ్రీగౌడపాదాచార్యులు “ ఉత్సేక ఉదధేర్యద్వత్కుశాగ్రేణైకబిందునా! మనసోనిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః॥ ” (ఒక్కొక్కబిందువుచొప్పున సముద్రోదకమునంతను దర్భపుల్లతో వెలుపలకు బారబోయుటయెట్లో మనస్సును నిగ్రహించుటయును ఆవిధముననే విసుగొందక బ్రయత్నించుటలనసాధ్యమగును—మాండూక్యోపనిషత్కారిక)

నిజముగా స్వభావమును జయించుట యసాధ్యమే యైనపక్షమున “ మామేవయేప్రపద్యంతే మాయామేతాంతరంతితే ” (అ 7. శ్లో 14) (నన్నుభజించువారు నామాయను దాటగలరు) అని “ దురత్యయా ” యనుశ్లోకమునందే కృష్ణుడువచించి యుండడుకదా. అటులనే, “ నిగ్రహఃకింకరిష్యతి ” యనుశ్లోకముతరువాతనే “ ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌవ్యవస్థితౌ। తయోర్నవశమాగచ్ఛేత్, తౌహ్యస్యపరిపంథినౌ॥ (శబ్దాదీంద్రియ విషయములందు రాగద్వేషములుండును. వానివశముకాగూడదు; ఎందువల్లననగానవి యొకనిధర్మమార్గమున కాటంకము గలుగజేయునవి. అని.’

శ్లో 34) అని బోధించి యుండడుకదా. అటులనే "మిథ్యైవవ్యవసాయస్తే".
అనుశ్లోకానంతరమె, ఈశ్వరుశరణుజొచ్చి యాతనిప్రసాదముసంపాదింపుమ
ని ఘంటాపథముగా ఘోషించియుండడుకదా (61, 62, మొదలయిన శ్లోక
ములు)స్వభావ మవిలంఘనీయమేని, "వక్ష్యామితేహితం" (అ 18. శ్లో 65)
అని హితబోధచేయుట కవకాశమెక్కడ? కాని, హితబోధచేయుచున్నా
డు. కాబట్టి స్వభావములంఘనీయమే యనిసిద్ధాంతము.

ఇక నొకవిషయము మరువగూడదు. ఏదియన, స్వభావప్రకృతి పద
ములు భగవద్గీతలం దెప్పుడు వచ్చినను స్వధర్మానుష్ఠాన విధిసందర్భముననే
వచ్చియున్నవి. స్వధర్మాచరణంబు బరిత్యజించుట ప్రాణులకు స్వభావమై
యున్నది. అట్టిస్వభావమును వారించుటకే విధిప్రతిషేధపరంబగు శాస్త్ర
మంతయు బ్రవర్తించుచున్నది. కాబట్టియే శాంకరగీతాభాష్యమున "శోక
మోహాభ్యాంహ్యభిభూత వివేకవిజ్ఞానః స్వతఏవక్షత్ర ధర్మేయుద్ధే ప్రవృత్తో
పి, తస్మాద్యుద్ధాదు పరరామ । పరధర్మంచ భిక్షాజీవనాది కంకర్తుంప్రవ
వృతే । తథాచ సర్వప్రాణినాం శోకమోహాదిదోషా విష్టచేత సాంస్వభావ
తఏవ స్వధర్మపరిత్యాగః ప్రతిషిద్ధసేవాచస్యాత్" (అర్జునుండు శోకమోహ
ములచే దిరస్కృతమయిన వివేకవిజ్ఞానములు కలవాడై, స్వయముగానే క్ష
త్రియధర్మమయిన యుద్ధమందు బ్రవేశించినవాడయినప్పటికి, నాయుద్ధ
మునుండి విముఖుడాయెను. పరధర్మంబగు భిక్షాజీవనాదికము చేయుటకు
బ్రవర్తించెను. అవిధముగానే, శోకమోహాది దోషావిష్టచేతస్కులైనసమస్త
ప్రాణులకును స్వభావముగానే స్వధర్మపరిత్యాగము నిషిద్ధధర్మ స్వీకార
మును తటస్థించుచున్నవి.—శ్లో. 11) ఇందలి "స్వభావతఏవ" అనునదిగమ
నింపుడు. కాన స్వభావము ప్రమాణముకాదు.

పూర్వపక్షము:—కాళిదాసు శాకుంతలనాటకమున "సతాంహిసం
దేహ పదేషువస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః" (సత్పురుషులకు సం
దేహాస్పదంబులయిన విషయంబులలో నంతఃకరణప్రవృత్తులే ప్రమాణము

అని చెప్పబడుచున్నది. కాబట్టి స్వచిత్తవృత్తియే ప్రమాణము.

సిద్ధాంతము:—"సతాం" (సత్పురుషులను) అన్నవిశేషణము గమనింపుము. సజ్జనునకు, ధర్మమేదో, అదేధర్మముగా దోచును; స్వాభిప్రాయమునకును ధర్మస్వరూపమునకును వ్యత్యాసములేదు కాబట్టి స్వాభిప్రాయమునుబట్టి ధర్మస్వరూపమును మానించుట (infer) న్యాయ్యమగును. కాని దుర్జనునకన్ననో, వ్యత్యాసముండును గనుక స్వాభిప్రాయమే ధర్మనిర్ణయసాధకంబు కాదు. దుష్యంతుని యనుమానము (శకుంతల బ్రాహ్మణస్త్రీ కాదనుట (in—Inference) వాస్తవముగానే పరిణమించెను. మతియేదుష్టుడో అయినపక్షమున, నిట్టియనుమానము తప్పియుండవచ్చును.

ఈవిషయమే శ్రీప్రశస్తపాదభాష్యమున నిట్లు నిరూపింతబడినది:—

అమ్నాయవిధాతౄణామృషీణా, మతీతానాగతవర్తమానేష్వతీంద్రియే ష్వర్థేషు ధర్మాదిషు గ్రంథోపనిబద్ధేషు, చాత్మమనసోః సంయోగాత్ ధర్మవిశేషాచ్చ, యత్ ప్రాతిభం యథార్థనివేదనం జ్ఞానముత్పద్యతే, తదార్షమిత్యాచక్షతే। తత్తుప్రస్తారేణ దేవర్షీణాం, కదాచిదేవలౌకికానాం; యథాకన్యకా బ్రవీతిశ్వోమే భ్రాతా ఆగన్తేతి హృదయంమేకథయతీతి" (వైశేషికదర్శన, గుణగ్రంథమందు) ఇట్టియతీంద్రియార్థ జ్ఞానము దేవర్షులకు విస్తారము (ప్రస్తారేణ) గా నుండును, అప్పుడప్పుడు మాత్రమే యించుక ప్రాకృతజనులకును స్ఫురించుచుండును. కాబట్టి సమస్తప్రాణులకు నిట్టిశక్తి లేదుగనుక తత్తత్స్వభావములకు ప్రామాణ్యము ఘటించదు.

మఱియు, గాళిదాసు వాక్యమునందలి "సందేహపదేషు" అనుదానిని గుర్తింపుడు. ఒకవిషయమున, నాగమవచనము లభ్యముకానప్పుడు మాత్రమే సందేహమువొడమిన సమయమున దనచిత్తవృత్తిని పరామర్శించుట. మొదటనాగమమేమిచెప్పునో చూడవలెను. అప్పటికిని సంశయము దీరనిచో, శిష్టాచారము బరిశీలించవలెను; శిష్టాచారము గోచరము కానిపక్షమున, స్వహృదయమేమిబోధించుచున్నదో తెలిసికొనవలెను. దానికి ప్రామాణ్యమప్పుడు

అప్పుడయినను, పరిమాతసజ్జనుడయితేనే! కాబట్టి, శ్రీకాళిదాసవాక్యము బట్టి, స్వభావము ననుసరించియే వర్ణధర్మములు నిర్ధారణీయము లనుటకు సందులేదు.

పూర్వపక్షము:—వస్తుజ్ఞానము చిత్తాధీనముకదా, కాన, చిత్తవృత్తియే ప్రమాణము.

సిద్ధాంతము:—కాదు. ఏలన, నగ్నితత్త్వమెప్పుడు నగ్నితత్త్వమే. ప్రమాతయొక్క గ్రహణశక్తి ప్రమేయముయొక్క తత్త్వమును మార్చజాలదు. ఈవిషయమునే, శ్రీశాంకరశారీరకభాష్యమిట్లు ప్రతిపాదించుచున్నది. (నవస్తుయాథాత్మ్యజ్ఞానంపురుషబుద్ధ్యపేక్షం। కింతర్హి వస్తుతంత్రమేవతత్। నహిస్థాణావేకస్మిన్ స్థాణుర్వాపురుషోన్యోవేతితత్త్వజ్ఞానం భవతి ।తత్రపురుషోన్యోవేతిమిథ్యాజ్ఞానం। స్థాణురేవేతి తత్త్వజ్ఞానం, వస్తుతంత్రత్వాత్। ఏవం భూతవస్తు విషయాణాం ప్రామాణ్యం వస్తుతంత్రం । ). (అ 1. పా 1. సూ 2) స్థాణువుంజూచి పురుషుడో మఱియేమోయనుకొనుట మిథ్యాజ్ఞానము; స్థాణువేయనుకొనుట తత్త్వజ్ఞానము. కాబట్టి వస్తుయాథాత్మ్యజ్ఞానమునకు ప్రామాణ్యము జ్ఞాతృబుద్ధి నాశ్రయించియుండదు. శ్రుతులన్ననో, తత్త్వ (తత్ =దానిత్వం=భావము) జ్ఞానమునే బోధించునవిగాన ప్రామాణ్యముగలవి. ఇది భాష్యతాత్పర్యము. కాన చిత్తవృత్తిని బట్టి వర్ణభేదముకాదు ; శాస్త్రమునుబట్టి.

పూర్వపక్షము:— స్వభావ మెన్నటికిని మారదనుటవలన నేమిదోషము కలదు ?

సిద్ధాంతము:—ఒకజన్మమునందొకడేరీతినుండెనో ఉత్తరజన్మపరంపర (Series) లో నారీతినే యుండవలసివచ్చును. క్రిందటి జన్మమున ధనికుడన్ని జన్మములందును ధనికుడే, ఎనుబది వత్సరములు జీవించినవాడవశ్యము నెనుబదివత్సరములే, గ్రుడ్డివాడు గ్రుడ్డివాడే(exact copy!) కావలసివచ్చును! కాని, పూర్వజన్మజ్ఞానము గలవారికిది యబద్ధమనియే కాన్పించును. ధ

మఱియు నిదిలోకానుభవమునకును విరోధమయిన యంశము.

శంక:—విరోధమెట్లు ?

సమాధానము:—వినుము. మామిడిచెట్టునకొన్ని గుణవిశేషములంటి యున్నను, జలసేచనాది బాహ్యక్రియలవలన, తద్గుణవిశేషములందు మార్పు కలుగక మానదు. దోహదాదిక్రియా వైచిత్ర్యముచే గుణవైచిత్ర్యము ప్రత్యక్షసిద్ధమేకదా. అటులనే, యొకడుకొన్ని సంస్కారములతో జన్మించినప్పటికి ప్రతిక్షణమును వైచిత్ర్యమునందుచున్న బాహ్యప్రపంచములో సంపర్కమువలన సంస్కారపరిణామము నొందినవాడగును. కొంతపరిమాణముగల దేహసామర్థ్యముగల మనుష్యుడు భోజనవ్యాయామాది క్రియావిశేషములచే నధికతరసామర్థ్యము సంపాదింపగలడుకదా. అటులనే ధ్యానాది నూత్నసంస్కారప్రాబల్యముచే ప్రాక్తనప్రాకృత సంస్కారములు ప్రధ్వంసితములగుట సంభవమయిన విషయమే. మన యనుభవమున, దుష్టాభినివేశముల గొన్నిటిని సత్సాంగత్యాది సాధనములచే లయింపజేసుకొనుచున్నాముకదా. కాబట్టి స్వభావము మారదనుటకు వీలులేదు.

మఱియు బూర్వజన్మసంస్కారములనగా బూర్వజన్మస్థితిగతులని యర్థముకాదు. తాదృశదశను పురుషుడుపొందునట్లు ప్రేరేపణజేయు శక్తివిశేషములు. వర్తమానజన్మమున నూతనసంస్కారముల బొందవచ్చును. వీని బలమధికతరమయిన పక్షమున బూర్వపుసంస్కారములు పరాజయమునొందును. కావట్టియే శ్రీమధ్వాచార్యులిట్లు వచించియున్నారు (సవ్యోపి యోజనాభావేపి భవత్యేవాతి ప్రయత్నతః—అ 3. శ్లో 33, 34—గీతాభాష్యము.)

శంక:—స్వభావమునకు బ్రతికూలములయిన ధర్మంబులాచరించుట క్లేశముకాదా? కాబట్టి యానుకూల్యము (Harmony) నుస్థాపించుటకు స్వభావదర్శితమార్గమే యవలంబనీయము.

సమాధానము:—ఆనుకూల్యమే యావశ్యకమేని, దుష్టస్వభావముగ

లవాడును తదనుకూలములయిన దుష్టకర్మంబుల జేయవలసివచ్చును. విహిత కర్మకరణంబు (అ 18. శ్లో 37, 39—ఐన్యాయము చొప్పున), ప్రథమంబున విషతుల్యముగా నున్నను, పరిపక్వదశయంద మృతోపమముగా నేయుండును. ప్రతిషిద్ధ కర్మాచరణమన్ననో, మొదటనమృతోపమముగానున్నప్పటికి, బరిణామమందు విషతుల్యముగా నుండును. పరధర్మములందు వైరాగ్యము బూనుటచేతను, స్వవర్ణాశ్రమధర్మములందు రతినభ్యసించుటచేతను, స్వధర్మావలంబన నిర్వృతినైజానుభవ విషయమగును.

ప్రశ్న:—బ్రాహ్మణాదివంశములబుట్టుటకునధ్యాపనాదికర్మలాచరించుటకును సంబంధమేమి? కొన్నికొన్నికర్మలకు ఫలముకొన్నికొన్ని యోనులయందు జన్మించుటయని గీతలందు వివరింపబడినదా?

ఉత్తరము:—వివరింపబడినది. భగవద్ద్వేషముగలవారు వ్యాఘ్రాద్యాసుర యోనులందుబుట్టి పురుషార్థభ్రష్టులగుదురని "అసురీష్వేవయోనిషు" (అ 16. శ్లో 18), "అసురీంయోనిమాపన్నాః" (అ 16. శ్లో 20) ఇత్యాదిశ్లోకములందు చెప్పబడుచున్నది. ఇటులనే, యోగవిఘ్నమయినవారు శ్రీమంతులగృహమందుగాని (అ 6. శ్లో 41)(శ్రీమతాంగేహే),యోగులకులమందుగాని (అ 6. శ్లో 42) (అథవాయోగినామేవకులే) పుట్టియోగమును సాధింతురని నుడువబడుచున్నది. కాబట్టి క్షత్రియాదులకు బుట్టుటవలన వంశపారంపర్యన్యాయము (Law of Inheritence) చొప్పున క్షాత్రాదిగుణములలవడును. మఱియుదండ్రియే ధర్మముకలవాడో, యాధర్మమునే పుత్రునకు బ్రాయికంబుగా నుపదేశించుట లోకప్రసిద్ధమే (యద్ధర్మవాన్పితాభవతి, తమేవధర్మం పుత్రాయోపదిశతిప్రాయేణ, తదిదంలోకప్రసిద్ధం—శ్రీశంకరానందవ్యాఖ్య అ 6. శ్లో 43). ఈహేతువులనుబట్టి బ్రాహ్మణాదివంశములందు జన్మించుట నిరర్థకము కానేరదు.

పూర్వపక్షము:—"శునిచైవశ్వపాకేచ" (అ 5. 18) అనుగీతాశ్లోకమువలన, బండితులు బ్రాహ్మణశునకాదులందు సమదృష్టిగల్గి

యుండురుగాన వర్ణభేదములేదు.

సిద్ధాంతము:—ఇదిసరికాదు. ఏలన, నీశ్లోకమునందలి ' సమదృష్టి ' యుపాధుల ననుసరించికాదు, ఆత్మననుసరించి. ఉపాధిభేదమవ్యాహతమే యగుచున్నది. " కింగంగాంబుని బింబితేంబరమణౌ..." అనున్యాయము చొప్పున సమదృష్టి. మఱియు, నిదిజీవన్ముక్త ప్రకరణమని పూర్వోత్తర శ్లోకములవలన దెల్లమగును. " సర్వభూతస్థ మాత్మానం..." (అ 6. శ్లో 29) ఇత్యాదిశ్లోకములును జ్ఞానిపరములు. కాన, వర్ణభంగములేదు.

కాబట్టి భగవద్గీతల బురస్కరించుకొని చేయుప్రతివాదుల కుత్సిత వాదములే నిరస్తములు, జన్మనుబట్టి వర్ణమనియు వర్ణమగత్యమే యని యు, సిద్ధాంతము.

—:జానశ్రుతి—వేదవిద్యాధికారము:—

పూర్వపక్షము:—ఛాందోగ్యోపనిషత్తు నాల్గవయధ్యాయములోని ప్రథమద్వితీయకాఖండములవలనశూద్రులకును వేదాధ్యయనాధికారమున్నదని స్పష్టమగుచున్నది.అటులనేయగ్రవర్ణములవారుశూద్రస్త్రీలనువివాహమాడు టకలదు. ఏలన, రైక్వుడను బ్రాహ్మణుడు జానశ్రుతి యను శూద్రుని పుత్రికనుస్వీకరించి బ్రహ్మవిద్యోపదేశముచేసినట్లు ఈగ్రంథమునందున్నది. రైక్వుడు" ఓశూద్రుడా, నీవస్తువులను నీవద్దనే యుంచుకొనుము"అనిశూద్రశబ్దముచేత జానశ్రుతిని సంబోధించి చెప్పుటవలన జానశ్రుతి శూద్రుడనియే నిశ్చయమగుచున్నది కదా.

సిద్ధాంతము:— కాదు. కావని సయుక్తికముగా బ్రహ్మ సూత్రములందు (అపశూద్రాధికరణమునందు) నిశ్చయింపబడినది. తనకంటెను రైక్వునికీర్తి ప్రజ్వలింపుచున్నదని హంస సంభాషణమువలన దెలిసికొనిశోకాక్రాంతుడై రైక్వునివద్ద కేతెంచిన జానశ్రుతి యొక్క హృదయగత శోకము గుర్తించి శూద్రుడాయని రైక్వుడు పిల్చియుండును. లేదా, బ్రాహ్మణాదులే లెంచు పగిదిసమిత్పాణియై, యథావిధిగా శుశ్రూషాపూర్వకము

గా విద్యాస్వీకారముఁజేయ సంసిద్ధుఁడగుటకుమారుగా, లంచమువలె ధనము సమర్పించి విద్యను ప్రతిగ్రహించుటకు వచ్చియున్న జానశ్రుతికి శూద్రశబ్దము ప్రయోగించియుండును. లేదా, తనయైశ్వర్యమునకు దగినరీతిని గురుసత్కారమునకు ద్రవ్యమొసంగఁబూనక, ప్రత్యేకముదాన మొక ధర్మముగా విహితముగాని శూద్రునిభంగి గొంచెము దయతో దానముచేయువానివలెనాసన్నుఁడయిన జానశ్రుతిపృథ్వీపతిని శూద్రపదమున నామంత్రించి పలికియుండును. శూద్రశబ్దము మొదటి పక్షమున శోకపరము, ద్వితీయతృతీయపక్షముల కేవలగౌణము (Figure of speech.) జాతిశూద్రత్వము మాత్రమనభిప్రేతము. శూద్రశబ్దము భేదమెట్లు సూచించునందురా, వ్యుత్పత్త్యర్థ గ్రహణమువలన. శంకరరామానుజమధ్వాదులందరు నీవిషయమున నైకకంఠ్యముగా బలికియున్నారు. ("శుచం=శోకం, అభిదుద్రావ=ప్రాప్తవాన్, ఇత్యర్థః" శుచం=శోకమును, అభిదుద్రావ=పొందెను, కాబట్టి జానశ్రుతి శూద్రుఁడాయని పిలువబడెను. "శుచావాకర్త్ర్యా, స్వయం,అభిదుద్రువే=ప్రాప్తః,ఇత్యర్థః" లేదా,శోకముచేత తానే పట్టుకొనబడెను." శుచావాకారణభూతయా రైక్వం, 'అభిదుద్రావ' =గతవాన్, ఇత్యర్థః "లేదా, శోకముమూలముగా రైక్వుని,'అభిదుద్రావ' =పొందెను, చేరెను.—శాంకరశారీరకభాష్యానందగిరివ్యాఖ్యఅపశూద్రాధికరణము, సూత్రము 34)
అటులనే, శ్రీమద్రామానుజభాష్యమున " అతః, శోచిత్వమేవ, అస్య, శూద్రశబ్దప్రయోగేన సూచ్యతే, నజాతియోగః " అనియున్నది. ఇట్లేశ్రీమధ్వభాష్యమున " నాహంపౌత్రాయణః శూద్రః, శుచాద్రవణమే వశూద్రత్వం "అనినిరూపింపబడినది( " శుగ్ద్రవవశూద్రః, రుగ్ద్రవవద్రుద్ర ఇతివత్ "—శ్రీమధ్వభాష్యముపై శ్రీజయతీర్థవిరచితవ్యాఖ్య) కాబట్టి జానశ్రుతి (పౌత్రాయణుడు)శూద్రుడుకాడని సిద్ధమగుచున్నది.

మఱియు, బహుగ్రామాధిపత్యము, అన్నశాలానిర్మాణము, హర్మ్యతలశయనము, ప్రాతఃకాలమాగధ గీతానుభవము, హంసకృతస్తుతి ప్ర

స్తావము మొదలయిన సంగతులు జానశ్రుతి క్షత్రియత్వమును ద్యోతింప జేయుచున్నవి.

మఱియు, త్రైవర్ణికేతరుడు వేదవిద్యార్థము గురువును సమీపించు నాచారము పూర్వములేదని కొన్నిశ్రుతిస్మృతులవలన దెలియుచున్నది కదా. జానశ్రుతిసమీపించెను. కాబట్టి త్రైవర్ణికేతరుడయి యుండడు కాబట్టి పూర్వపక్షములోని యంశములు నిరాధారములు.

వాదముకొఱకు జానశ్రుతిశూద్రుడే యందము. అప్పటికిని శూద్రులకు వేదాద్యధికారములు సిద్ధించవు. ఏలన నిదియర్థవాదస్థ విషయము, "బ్రాహ్మణముపనయీత" వలెశూద్రుని కుపనయనము చేయవలెనని యాదేశపూర్వకముగా నిష్కర్షించి (directly) చెప్పుటలేదు. అంతియేకాదు. "శూద్రోయజ్ఞే అనవక్లృప్తః" (తై. సంహిత) ఇత్యాదివేదవాక్యములు స్పష్టముగా శూద్రునకు యజ్ఞాద్యధికారములేదని ప్రతిపాదించుచున్నవి. స్పష్టముగా నిష్కర్షించి చెప్పువాక్యములకే ప్రామాణ్యబలమధికతరమయినది కాబట్టి యర్థవాదస్థజానశ్రుతి కథానుమితశూద్రాధికారముపరాజితమగుచున్నది. జానశ్రుతికథవలన శూద్రాధికారమనుమిత (inferred) మగుచున్నదికదా. కాని, "శూద్రో..." ఇత్యాదిశ్రుతులవలన శూద్రాధికారము స్పష్టముగా నిషేధింపబడుచున్నది. గాన, శూద్రానధికారమే సిద్ధమగుచున్నది. అనుమితమయిన యర్థముకంటె ప్రత్యక్షార్థము బలవత్తరముకదా.

ప్రశ్న:—యజ్ఞాములందధికారములేదని పైశ్రుతివాక్యము నొప్పు సనంగీకరింతము. కాని, దానంజేసి యధ్యయనాద్యధికారము లేకపోవుటయెట్లు?

ఉత్తరము:—యజ్ఞానధికారమునకే కారణమో, అధ్యయనానధికారమునకు నదేకారణము. ఇదియధ్యయనోద్దేశముజూచిన యెడల, స్పష్టమగును. యజ్ఞాద్యనుష్ఠానమునకే, యధ్యయనము శాస్త్రసిద్ధము. కాబట్టియ

జ్ఞము నందధికారము లేదన్నప్పుడు, అధ్యయనమునందును లేదనియే తేలుచున్నది. ఫలము నిషిద్ధ మయినప్పుడు, ఫలార్థప్రయాసంబు నిషిద్ధప్రాయంబే కదా.

మఱియు, జానశ్రుతికథవలన, నాతడు శూద్రుడేయనియు, శూద్రులకు వేదోపాసనాధికారమున్నదనియు, వాగముకొఱ కంగీకరించినప్పటికి, నట్టియధికార మొకసంవర్గ విద్యయందుమాత్రమే యయియుండును; కాని, సమస్తవేదవిద్య (ఉపాసన) లందుననుట కవకాశమెక్కడ? జానశ్రుతిప్రసంగము సంవర్గవిద్యాసందర్భమున మాత్రమేవచ్చియున్నది. కాబట్టి యాతడు శూద్రుడేని, సంవర్గవిద్యయందొకదాని యందుమాత్రమే యధికారము గల్గియుండును. అంతయినను, అధికారములేదని పయినచెప్పియే యున్నాముకదా. కాబట్టి దేనియందును లేదు.

ప్రశ్న:—శూద్రునకధ్యయనాధికారములేదందము. వేదోపాసనాధికారమెట్లు లేదనగలము.

ఉత్తరము:—వేదాధ్యయనాధికారము లేదుకాబట్టియే, వేదమంత్రసహితోపాసనమందు నధికారములేదు.

కాబట్టి యుపనయనాధి కారాభావమధ్య యనాభావమునకు కారణము. అధ్యయనాధికారాభావము వేదోపాసనాధి కారాభావమునకు కారణము.

శంక:—బ్రాహ్మణత్వము నిర్ధారించుటకు బూర్వమే, యుపనయనాదులుచేయు నాచారములేదని యుపనిషత్తులం దెక్కడనయిన దృష్టాంత మున్నదా ?

సమాధానము:—దూరముగాబోనేల? ఈఛాందోగ్యోపనిషత్తునందే, యీనాల్గవయధ్యాయమందే, (మూడవఖండమునందుగాక) నాల్గవఖండమందున్నది. ఎట్లన, సత్యకామజాబాలుడు గౌతమునివద్దకు బోయినప్పుడు గౌతమడుగబడి, తెలియదని సత్యముచెప్పుటవలన గౌతము డాతనిది బ్రాహ్మ

ణజాతియేయని నిర్ధారించి యుపనయన సంస్కారముజేసెను. శూద్రున కుప నయనాధికారమే యుండెడుపక్షమున, నిట్లు త్రైవర్ణికత్వ పరామర్శ కవ కాశముండియుండదు. కాబట్టి శూద్రునకనధికారము. (తదభావనిర్ధారణేచ ప్రవృత్తేః—బ్రహ్మసూత్రములు. అ 1, పా 3. సూ 37)

ఇప్పుడు, మఱియొకవిషయమునకు వత్తము. కొందఱు, రైక్వుడు బ్రహ్మ జ్ఞానియేని, ఇచ్చినధనముతో సంతుష్టిజెందక "నీవినీవేయుంచుకొనుము" అని నిరాకరించునా, యని యాక్షేపింతురేమో. అందుకవకాశము లేదు. ఏలన గురుసత్కారమనునది శిష్యునకు విధియైనపని. గురువున కివ్వవలసినది యివ్వ నివాడు, గురు విచ్చునది స్వీకరించుట కర్హుడెట్లగును? గురువునకు, కు టుంబభరణము మొదలయిన పనులకు ద్రవ్యమవసరము కావచ్చునుగదా! అవసరమయినను, కాకపోయినను, ఇచ్చుట శిష్యునిధర్మము. గురువునకవస రమయినచో, నిచ్చుట న్యాయ్యమే యగుచున్నది- అవసరము కానిచో, పరార్థమునకయిన నవసరము కావచ్చును; పరోపకారము జేయుటకవసర ము కావచ్చునుగదా.

మఱియు, ఇచ్చుట శిష్యునిశ్రద్ధను తెలియజేయును. ఇవ్వగల్గియు ని వ్వనివాడు ప్రాయికంబుగా శ్రద్ధావిహీనుడే. శ్రద్ధావిహీనుడు విద్యకపాత్రు డే. మొదటిసారి నిరాకరించినప్పుడు జానశ్రుతి మరలరానిచో, శ్రద్ధలేనివా డనియే నిర్ధారణమగును. కాని, గోవులు మొదలయినవానినధికముగా దీసికొ ని రెండవసారి వచ్చినవాడు కాబట్టి మిక్కిలిశ్రద్ధను ప్రకటింపుచున్నాడు. కాబట్టియే, విద్యోపదేశము చేయబడెను.

అంతేకాదు. గోవులుమొదలయినవి కానుకనిచ్చుటకును, పుత్రికని చ్చుటకు నెంతేనిభేదమున్నది. పుత్రికనుసమర్పించెననుటయందు స్వారస్యము న్నది. ఆత్మసమర్పణంబు గొప్పదిగదా. కాబట్టి " ఆత్మైవపుత్రనామాసీ త్ " అనున్యాయముచొప్పున బుత్రికసమర్పించె ననుటయెంతయు రస వంతముగానున్నది.

మఱియు నీయాఖ్యాయిక నైశ్వర్యముచే మహోన్నతులైనవారికి ద రణోపాయములేదని సూచించుచున్నది. పత్నులాక్షేపించుట! ఐశ్వర్యసంప న్నుడయిన ప్రభువు, బండిక్రిందగజ్జితో బరుండియున్నవానిని సేవింపబోవు ట! ఆతడునిరాకరించుట! ప్రభువుపుత్రికనుకూడ సమర్పించి, విద్యనుస్వీకరిం చుట! ఆహాకవితాచాతుర్యమే మనివర్ణింపవచ్చును! "స్వదేశేపూజ్యతేరాజా విద్వాన్సర్వత్రపూజ్యతే" అనునీతియిందు వ్యక్తమగుచున్నదికదా. కాబట్టి యే, భాష్యమున "ఆఖ్యాయికావిద్యాదాన గ్రహణవిధిప్రదర్శనార్థాచ. శ్ర ద్ధాన్నదానానుద్ధతత్వా దీనాంచవిద్యాప్రాప్తిసాధనత్వం ప్రదర్శ్యత ఆ ఖ్యాయికయా" అని శ్రీశంకరాచార్యులానతిచ్చియున్నారు.

ప్రశ్న:—హంసలు సంభాషించునా?

ఉత్తరము:—"ఋషులుగాని, దేవతలుగాని, రాజుయొక్క అన్న దానగుణములచే సంతోషించినవారై, రాజహంసరూపముబొంది రాజునకు దృష్టిగోచరముగా నెగిరినవారయిరి" (భాష్యము, 4. 1. 2.) మఱియు, హంసపదప్రయోగముచే బరమహంసలనిధ్వని.

ప్రశ్న:—బ్రహ్మవేత్తకు గజ్జియుండునా?

ఉత్తరము:—గొప్పశంక! ప్రారబ్ధవశమున దేహమున కనేకరోగము లు సంప్రాప్తంబులయినను, అవి యాత్మజ్ఞానమునకు గళంకము దెచ్చిపె ట్టజాలవు. మఱియు, కొందరువిద్యగలవారు బాహ్యమున కసహ్యముగా గా న్పించినను, గౌరవనీయులేయను నీతియిందువివక్షితము. ఏపురుషునందే మహి మయుండునో—బాహ్యస్వరూపముజూచి నిరసనగా జూడవద్దనినీతి.

శంక:—బ్రహ్మవేత్తయైనరైక్వునకు గృహస్థాశ్రమమెందుకు గా వలసివచ్చినది.

సమాధానము:—లోకసంగ్రహము నిమిత్తమై, గృహస్థాశ్రమప్రా శస్త్యమును ప్రకటించుటకు. ఎందుచేతనన, మనువు "యథావాయుంసమా శ్రిత్యసర్వేజీవంతిజంతవః। తథాగృహస్థమాశ్రిత్య వర్తన్త ఇతరాశ్రమాః" (వా

యువునాశ్రయించి, సమస్తప్రాణులును జీవించుచుండుమున, గృహస్థునాశ్రయించి యితరాశ్రమములున్నవి.) అనినుడివియున్నాడు. వైరాగ్యవిహీనులు కూడ సంన్యాసాశ్రమము స్వీకరించినపక్షమున లోకమునకు నష్టముగల్గునని తలంచి, జనులనుగృహస్థాశ్రమమందుత్సాహము నందించుటకు రైక్వుడుకూడగృహస్థాశ్రమము ప్రవేశింపనెంచెను. ఇదిబ్రహ్మచర్యాద్యాశ్రమక్రమమును సంరక్షించుటకు, కాన, నీతని బ్రహ్మజ్ఞానమునకు భంగములేదు.

వాదముకొఱకు, బ్రహ్మజ్ఞానములే దనియే చెప్పుదము. అప్పటికి నీతడు పాసనాదులందు ప్రవీణుడే (spiciatist) యనవలసియుండు, ఏలన, నీతనిపేరు, ఉపాసన ప్రకరణమున వచ్చియున్నది. ఉపనిషత్తులందు పాసనలు విద్యలని పిలువబడుచున్నవి. కాబట్టి, యీతనికి గానాదులున్నవనియు, నందువలన నీతడు బ్రహ్మజ్ఞాని కాడనియు, వాదము కొఱకంగీకరించినప్పటికి నీనివలెనే బ్రహ్మజ్ఞాను లందరును కామోపహతులని యాక్షేపించుట కవకాశ మెంతమాత్రమునులేదు. ఏలన, నుపాసనయన్నను, తత్త్వజ్ఞానమన్నను అర్థ మొక్కటియే కాదు.

మఱియు, రైక్వుడు కామోపహతుడందురేని కామోపహతత్వముచేతనే శూద్రుడయినప్పటికి జానశ్రుతికి విద్యోపదేశముచేసి యుండునని గ్రహింపుడు. కామోపహతుడుకాక జ్ఞానియేయందురా, జ్ఞానిగనుకనే, శూద్రునకు వేదవిద్యోపదేశముచేసి యుండడని గ్రహింపుడు. మొదటిపక్షమందు రైక్వుడప్రామాణికుడు కాబట్టి, శూద్రులకు వేదాధికారము నున్న. రెండవ పక్షమందు ప్రామాణికుడు కాబట్టి, నున్న.

మఱియు, కవనమందలి నేర్పు (Artistic point of veiw) ను బట్టి, రైక్వజానశ్రుతులకు దారతమ్యమునుద్దేశింపబడుచున్నది గనుక, రైక్వుడు మిక్కిలి బీదగా వర్ణింప బడుచున్నహేతువుచేత, జానశ్రుతి మిక్కిలి యైశ్వర్యసంతుడయి నక్షత్రియుడే యని యూహింపవలసియున్నది.

శంక:—"తస్యాహమముఖమువోద్గృహ్ణాక్" (ఆమెముఖము పట్టుకొన్న

వాడై)యనుటవలన రైక్వుని కాముకత్వము సూచింపబడుచున్నది.

సమాధానము:—కాదు. ముఖముపెట్టుకొనుట యాశయము కాదు. ఈమెద్వారా, విద్యాదానార్హత సూచింపబడుచున్నదని. భాష్యము "ముఖం ద్వారం, విద్యాయా దానే తీర్థ ముపోద్గృణ్హ జ్ఞానస్మిత్యర్థః"

కాబట్టి జానశ్రుతి శూద్రుడు కాడనియు,శూద్రాదులకు వేదవిద్యా, ధి కారము లేదనియు సిద్ధాంతము.

—:జాబాలుడు—గుణవాదము:—

పూర్వపక్షము:—ఛాందోగ్యోపనిషత్తులోని జాబాలుడనునాతడు జారజుడు. యౌవనమందు నేకులతో వ్యభిచరించి తన్నుగంటినని తల్లిస్పష్టముగా బల్కియున్నది. కాని, నిజముచెప్పినందువలన నీతడుబ్రాహ్మణుడని గౌతముడు నిశ్చయించుకొనెను. కాబట్టి సత్యాదిగుణములనుబట్టియే బ్రాహ్మణాది వర్ణనిర్ధారణము. జన్మనుబట్టికాదు.

సిద్ధాంతము:—ఇదిసరికాదు. ఏలన " బహు " అన్నప్పుడనేక కాముకులని యర్థముకాదు. బహుతరువాత బురుషపదము ప్రయోగింపబడినదా ? కాబట్టి పురుషులని యెట్లనుకొనగలము? పురుషులతో జరించినదనియే యందము. అప్పటికిని, " చరంతీ " యనుపదమునకు " వ్యభిచరంతీ " యని యర్థమెట్లగును ? అలిథిసత్కారాదులను చరించుచున్నదని యనుకొనగూడదా?

చరించుటకు వ్యభిచరించుటయే యర్థమేని, " ధర్మంచర " అనుచోట నర్థమేమి? ధర్మమాచరింపుమనియే కదాయర్థము? ధర్మమువ్యభిచరింపుమన్నచో, నీవ్యాఖ్యానము ధర్మమునుండి వ్యభిచరించును?

అట్లయినచో " బహ్వాహంచరంతీపరిచారిణీ, యౌవనేత్వామలభే " యందలి ' బహు ' కిదేనితో సంబంధమన్నయెడల, ' చరంతీ ' యనుక్రియతో. మిక్కిలి చరించుచున్నదై (Busy) యని యభిప్రాయము. దేనినిచరించుచు? పరిచర్యాజాతమును. ఎవరియొక్క—కాముకుల పరిచర్యనా? కాదు,

అతిథ్యభ్యాగతుల పరిచర్యాజాతమును. ఎక్కడ? భర్తృగృహమందు. భర్తగోత్రమెందుకు దెలియలేదు? పరిచర్యాతత్పరత్వముచేత. కాబట్టి " అతిథ్యభ్యాగతాద్యర్థి కృత్యపరిచర్యాజాతం బహుచరంతీ భర్తృగృహేయతో హింస్థితా, తేనపరిచరంతీ సతీపరిచరణచిత్తతయా గోత్రాదీన్నాపృచ్ఛం తథాచతత్స్మరణే మనోమమనాసీదితి " (అతిథ్యభ్యాగతుల పరిచర్యాజాతమును మిక్కిలిచరించుచు భర్తృగృహమందుండి యుండుటవలన, పరిచర్యయందే చిత్తములగ్నమై, గోత్రాదుల నడుగనయితి. ఇట్లు, గోత్రాదుల స్మరణమందేనాకు మనస్సులేకపోయెను.) (శాంకరభాష్యా నందగిరిటీక)

" ముహుర్నిద్యంరూపం...బహుకృతం " " జహుభాషతే " ఇత్యాదిప్రయోగములున్నవి. పరిచర్యాజాతమని మూలములోలేదే, యని యాక్షేపింతురేమో. లేకపోయినను " పరిచారిణీ " యను దానినుండె యధ్యాహార్యము. " కృషీవలుడనయిన నేనుమిక్కిలి పనిచేయుచున్నవాడనై " అన్నప్పుడు, ఏపనిని? 'కృషీవలుడను' లోనికృషి (వ్యవసాయము) పనియర్థము కదా. అటులనే, యిక్కడను. అసందర్భముగా, మఱియొకటి యధ్యాహార్యమనుటకెట్లు వీలుండును?

" చరంతీ " యనుదానికి గర్భనే యంగీకరింప మందురేమో. అప్పుడు, " వ్యాపృతవతీ " (Having much pressure of work) (పనిలోమునిగియున్నదాననై) యనిగ్రహింపుడు. అప్పుడయినను, ఏపనినన్నప్పుడు, " పరిచారిణీ " పదసందర్భమున, బరిచర్యనేయని గ్రహింపవలసియుండును. ఇకవ్యభిచార మెక్కడనుండి యధ్యాహార్యము? కుమతులకపోలములనుండి కాబోలు!

('చర్=to move' అన్నట్లు), సంచరించుట భర్తృగేహమందు కాగూడదా? పరిచర్యావ్యాసంగమున నింటనెల్లప్పుడు సంచరించుచున్నదే (Always on her legs) యను నర్థము సమంజసముకాదా?

ఇప్పుడు పనిషదర్థమును భాష్యవ్యాఖ్యానము లందలివచనములతోఁ జే
సమన్వయించెదను. ఎట్లన:—(యద్యపితస్యామవస్థాయాం లజ్జయాగోత్రా
ది నాపాక్షీ స్తథాపి కాలాంతరేకిమితిపితరం నపృష్టవతీ, ఇత్యాశంక్య
—ఆనందగిరి ) ( ఆయవస్థయందు లజ్జచేతగోత్రాదిక మడుగకుండినప్ప
టికి, మఱియొక సమయమందయినను నా తండ్రినెందుక డుగ లేదందురేమో)
(తత్రైవతేపితోపరతః—శంకరాచార్యులు) (అప్పుడే, నీతండ్రిగతించెను.)గో
త్రాదులనడుగు స్థితికివచ్చువరకే, భర్తచనిపోయెను గనుక నడుగవీలులేక
పోయెను. ఇప్పుడయినను క్రొత్తగాగాపురమునకు వచ్చినయాడువాండ్రకు,
ఆంగీరస,' మొదలయినవానిని తెలిసికొనప్రయత్నించుట స్వభావముకాదు
గదా. గృహమందు మఱియొకరు పాకక్రియాదులందు సహాయముచేయ
లేనప్పుడు పనియొక్కఁడను సందివ్వదుకదా—గృహస్థునకు బ్రహ్మవిచార
మునకు సందులేనట్లు.

(తథాపికిమిత్యన్యమభిజ్ఞంనాపాక్షీః, ఇత్యాశంక్య—ఆనందగిరి)
(ఐనప్పటికి, దెలిసినవానిని మఱియొకని నేలయడుగలేదనిశంకింతురేమో) (అ
తఃఅనాథాహం—శంకరాచార్యులు) (అందువలన, అనాథస్త్రీనైననేను)
ఎవ్వరినడుగగలను. అని శేషము,

కాబట్టి (ప్రథమంలజ్జయా పితరం ప్రతినప్రశ్నః; పునశ్చతస్యోపర
తత్వాత్; పశ్చాత్ నదుఃఖబాహుళ్యాత్ అన్యంప్రతిప్రశ్నః—ఆనందగిరి)
(మొదటలజ్జచేత దండ్రినిగూర్చి ప్రశ్నలేదు; పిమ్మట, అతడుచనిపోవుట
చేత; ఆపిమ్మట దుఃఖబాహుళ్యముచేత నన్యునిప్రశ్నించలేదు.) ఇప్పుడయి
నను భర్తృవియోగముగల పతివ్రతలు దుఃఖసాగరమున మునింగిబాహ్యప్ర
పంచమును విస్మరించియే యుందురుకదా. కాబట్టి "సాహమేతన్నవేద"
(అట్టిదీనురాలనైన నేనుదీనినెరుంగను) అనిభాష్యమున నుడువబడినది. వ్యభి
చారముచేతగాదు. శ్రీరంగరామానుజాదులందరు నీరీతినేవ్యాఖ్యానము
చేసియున్నారు.

తనతండ్రియింటనే పరిచర్యయని భావించుట సమీచీనముగానుండదు. ఏలన, యౌవనే' అనుటవలన నప్పటికి భర్తృగృహము జేరియుండునని స్ఫురించుచున్నది,

భర్తయే లేడందురా, అందుకు బ్రమాణమేమి? భర్తృగృహమునందే, వ్యభిచరించెనందురా, అందుకు ప్రమాణమేమి? ప్రమాణములేకపోయినను, అట్లుభావింతమందురా. అపసవ్యము భావించుటకుమారుగా సవ్యమునే భావించరాదా? ఊరక, నొక స్త్రీయందు వ్యభిచారదోషమా పాదించుటన్యాయమా?

మఱియు, భర్త జీవించియు, నామెనుతరిమివేసెననుటకుబదులు, భర్త కొద్దికాలములోనే మృతిజెందెనని భావించుట యుచితముగదా. అట్లుపరిత్యజింపబడియే యున్నయెడల, నట్టిసంగతిని కొమరున కెందుకుజెప్పకపోవలెను? సీత చారిత్రమెట్లున్నది? తల్లి చెప్పకపోయినను, లోకులు దోషమును ఘోషింపకుందురా? అన్యాయముగా భర్త తన్నుబరిత్యజించెనని భర్తయందు దోషారోపణమైన నామెచేయకుండునా? కాని, యిట్టిదేమియు జరిగియుండలేదు. ఒకవేళ, బరిత్యజించినను, సంన్యాస స్వీకారమువలననై యుండునేమో. కాబట్టి పరిత్యాగముమాట యసంబద్ధము.

మఱియు, "యౌవనేత్వామలభే" యనునది హేతుగర్భితము. "మాతుః కేవలమేవ యౌవనవనచ్ఛేదే కుఠారావయం" అని భర్తృహరి నుడివినట్లు, పుత్రుడు కల్గినతోడనే యౌవనము నష్టమైనదియే యనవచ్చును; పుత్రుడు పుట్టుట యౌవనమందేకాని, ముదిమి జెందినప్పుడా? కాబట్టి "అలభే, అనిన జాలును; యౌవనే యనుటవలన బునరుక్తిదోషము పట్టును. దానిని పరిహరించుటకు " మిక్కిలి చిన్నతనములోనే నిన్నుగంటిని. అప్పుడు సిగ్గుచేతను లోకజ్ఞానము తగినంత లేకపోవుటచేతను నీగోత్రపరీక్షమాట నాకు స్ఫురించలేదు. కొద్దికాలములోనే, నీతండ్రి గతించెను" అని వ్యాఖ్యానము చేయుట యుక్తము.

మఱియు, "యౌవనే" యనుటవలన గామాంధకారము ద్యోతించు చున్నదందురేని, "అలభే" (సంపాదించితిని) యనుటవలన "నాచిన్నతన మందే, నిన్ను మాయింటికి దీసికొనివచ్చిరి. అప్పటినుండియు నిన్ను పెంచు కొనుచుంటిమి. యథావిధిగా దత్తస్వీకారము మాత్రము జరుగలేదు. ఏలన కొద్దిదినములలోనే నాభర్త గతించెను. కాబట్టి మాగోత్రమునీకు జెల్లదు. నీ జన్మకు గారణభూతులయిన వారిగోత్రమప్పుడేమో చిన్నతనమునందు దెలిసి కొని యుండలేదు" అని యర్థమేమో! 'ఏలన బ్రసవించితిని' అనలేదు. సం పాదించుట యీవిధముగా గూడనై యుండవచ్చు. వ్యభిచారముచేత మాత్ర మే, యని యెట్లుచెప్పగలరు? కాబట్టి యిట్టికుకల్పనలు పనికిరావు.

వివాహితయైన చో బతిపేరెందుకు నుడువలేదందురా? పేరుచెప్పు టాచారములేదుగనుక. పతియను శబ్దమయిన నుచ్చరింపక పోవుటకు గారణ మేమందురా, దుఃఖావేశముచేతనని సమాధానము.

ప్రశ్న:—గోత్రముతెలియనివాని కుపనయనాదులు చేయబడినవి గ దా. తండ్రివర్ణము మాటవిడిచి, జాబాలుని సత్యభాషణమువలన నాతనిబ్రా హ్మణత్వము నిర్ధారింపబడినది. కాబట్టి గుణముచేత వర్ణముకాదా?

ఉత్తరము:—కాదు. ఏలన, గోత్రమునకును వర్ణమునకును భేదము న్నది. గోత్రము తెలియక పోవచ్చును. వర్ణము తెలియదనుటకు వీలులేదు. బ్రాహ్మణులందరు నేకవర్ణము వారయినప్పటికి, నేక గోత్రమువారా? మ ఱియు, నిచ్చటనిీమాంసగోత్రమేమనిగాని, వర్ణమేమనికాదు. గోత్రమెందు కు గావలసివచ్చినదన, నుపనయనము చేయుటకు బూర్వము గోత్రముదెలిసి కొనవలెనని మర్యాదయున్నది. కొడుకు గోత్రమేమని తల్లిని ప్రశ్నించెను. తల్లికి గోత్రము తెలియదు. వర్ణమేమని ప్రశ్నించిన పక్షమున, బ్రాహ్మణ వర్ణమని ప్రత్యుత్తరమిచ్చియె యుండును. కాని వర్ణప్రశంసరాలేదు కాబట్టి వర్ణమిట్టిదని యామె నిరూపించి యుండలేదు. కాన, బ్రాహ్మణవర్ణము కా దనుట యనన్వితము.

మఱియు, గౌతముడు గోత్రము తెలియకపోయినను, త్రివర్ణముల లో నొకవర్ణమయి యుండునని యూహించెను. త్రైవర్ణికేతరుల కుపనయనాధికారములేదు కాబట్టి, త్రైవర్ణికులలో నొకడని నిశ్చయించుకొని యుపనయనము జేయదొడంగెను. వారిలోను బ్రాహ్మణుడని నిశ్చయించుకొనెను. ఇది విశేషజ్ఞానము. మొదట, గోత్రమీమాంస, అటుపిమ్మట వర్ణమీమాంస

మఱియు, సత్యభాషణమువలన బ్రాహ్మణత్వము నిర్ధారింపబడెను. కదా. ఈబ్రాహ్మణత్వము శిష్యునకుమాత్రమే సంబంధించునా, లేక, శిష్యుని జనకాదులకును సంబంధించునా? శిష్యుని జనకాదులకు సంబంధించును. ఏలన నీప్రకరణమున మొదటినుండియు గోత్రప్రశంసయే చేయబడుచున్నది. తల్లిని గోత్రమడుగుట మొదలయిన సంగతులేకదా వర్ణింపబడుచున్నవి? గోత్రప్రశంసయున్నమాత్రమున జనకాదుల ప్రసంగమెట్లందువేని, గోత్రమనగా నర్థమేమి? తనదేహమునకు గారణభూతులయిన పూర్వులనేకదా గోత్రము నిరూపించుచున్నది. కాబట్టి గోత్రప్రసంగము వచ్చినదికాబట్టి శిష్యుని పూర్వులనుగూర్చి విచారింపబడుచున్న దని యంగీకరింపవలెను. శిష్యుని పూర్వులనుగూర్చి విచారింపబడుచున్నదని సమ్మతించినప్పుడు, నిర్ధారితమయిన శిష్యుని వర్ణము పూర్వులకును సంధింపబడుచున్నదని యొప్పుకొనకతీరదు. పుత్రపౌత్రపారంపర్యమున నొకవర్ణమే యన్నప్పుడు, జన్మచేతనే వర్ణమని సిద్ధమగును.

మఱియు, ననుమానమునకు రెండుమార్గములున్నవి. పరోక్షమందున్న ప్రాచీనులవర్ణమును గోత్రనామాదికమువలన దెలిసికొని, యపరోక్షమందున్న శిష్యునివర్ణము ననుమానించుట (infer) యొకమార్గము. అపరోక్షమునందున్న శిష్యునివర్ణమునే విధముగానైన నిర్ధారించుకొని పరోక్షమందున్న పూర్వుల వర్ణము ననుమానించుట రెండవమార్గము. ఈరెండుమార్గములలో రెండవమార్గమును గౌతముడవలంబించెను; ఏలన శిష్యునివర్ణమును మొదటనిర్ణయించెను. శిష్యునివర్ణమయిన బ్రాహ్మణవర్ణమే యాతనిపూర్వులదయి యుండునని [illegible]

భిప్రాయము. జాతివివక్షితము.

ఇక శిష్యుని వర్ణనిర్ధారణమెట్లు చేయబడెనన, సత్యసంభాషణాదికముండుటవలన గ్రొత్తగా బ్రాహ్మణబిరుదంబున కర్హుడగునని కాదు. బ్రాహ్మణబిరుదంబు గల్గియున్న వానికే సత్యభాషణాదికము ప్రాయికంబుగానుండునని, యిచ్చటన్యాయప్రక్రియ. "బ్రాహ్మణేతరులు (ప్రాయికంబుగా) ఋజుమార్గముగలవారు కారు. జాబాలుడు ఋజుమార్గముగలవాడు. కాబట్టి (ప్రాయికంబుగా) బ్రాహ్మణేతరుడు కాడు. అనగా బ్రాహ్మణుడే" (Syllogism) కాబట్టియే శ్రీశాంకరభాష్యమున (నైతత్ వచః అబ్రాహ్మణః విశేషేణవక్తుమర్హతి, ఆర్జవార్థసంయుక్తం। ఋజవోహి బ్రాహ్మణాః,నఇతరే,స్వభావతః। యస్మాత్ నసత్యాత్ బ్రాహ్మణజాతిధర్మాత్ అగాః=నాపేతవానసి । అతః బ్రాహ్మణంత్వాం ఉపనేష్యే।) అని స్పష్టముగా వ్రాయబడినది. ఇందలి ' బ్రాహ్మణజాతి ధర్మాత్ ' అనుదానిని గమనింపుడు.

బ్రాహ్మణులకు జన్మించినవారికి ప్రాయికంబుగా సత్యాదిగుణంబులుండుననియు, నితరవర్ణజుల కంతగానుండుట లేదనియు, నందువలన జాబాలుడు సత్యగుణముజూపియున్నాడు కాబట్టి బ్రాహ్మణులకే జన్మించియుండుననియు గౌతముడాలోచించెనని స్పష్టమగుచున్నదికదా?

గౌతమవాక్యములను గుణపరముగా నన్వయింపగూడదాయని శంకింతురేమో. కూడదు. ఏలన, నప్పుడున్మత్తప్రలాపము సిద్ధమగును. ఎట్లన, న బ్రాహ్మణుడు (=సత్యాదివిహీనుడు) సత్యాదిసహితుడు కాజాలడు, అనియర్థమగును। మఱియు, ' న బ్రాహ్మణుడు (=బ్రాహ్మణనామ విహీనుడు) సత్యాదిసహితుడు కాడు. నీవుసత్యాదిసహితుడవు. కాబట్టి యబ్రాహ్మణుడవు (=బ్రాహ్మణనామ విహీనుడవు) కాజాలవు.' మంచిది. కష్టపడి బ్రాహ్మణనామమును జాబాలునకు గౌతముడుకను గొనెననుకొందము. దానలాభమేమి? సత్యాదిగుణసాహిత్యమే వేదవిద్యాధికారకారణమైన పక్షమున,

సత్యాదిగుణపరామర్శచేతనే విద్యోపదేశోద్యుక్తుడై యుండవలసి యుం డుగదా, బ్రాహ్మణనామ గ్రహణమునకెక్కడ నవకాశముండును? కష్టప డి, బ్రాహ్మణనామ సహితుడను సిద్ధాంతమును దీయనేల? కాని, తీసెను. కాబట్టి సత్యాదిగుణసాహిత్యమే వేదవిద్యోపదేశార్హత నొసంగజాలదని యో ఱుంగవలెను. త్రైవర్ణికజాతియే యొసంగును.

శంక:—గోత్రముతో బనిలేదు. గుణము వర్ణము నిర్ధారించును.

సమాధానము:—గౌతముడు గోత్రమెందుకడిగెను?

పూర్వపక్షము:—బ్రాహ్మణపదగ్రహణమువలన క్షత్రియాదుల క ధికారము లేదని తేలుచున్నది.

సిద్ధాంతము:—కాదు. ఏలన నిచ్చట బ్రాహ్మణపదము త్రైవర్ణికో పలక్షణము. ఈవిషయమునకు స్మృతి ప్రమాణములున్నవి. జాబాలుని బ్రా హ్మణుడని నిర్ధారించుట 'ఓహో, పానార్థము గంగాప్రవాహమే లభ్యమ యినది!' అన్నట్లున్నది. వేదవిద్యకు క్షత్రియ వైశ్యులయిన, జాలును; ఇక బ్రాహ్మణుడే యయినప్పుడు, చెప్పవలెనా యని యాశయము. కాన, క్షత్రియ వైశ్యులకు నధికారమున్నది. (అధ్యాపన మొదలయిన వాని యందులేదు)

శంక:—అందఱు బ్రాహ్మణవర్ణజులును ఋజుమార్గమున బ్రవర్తించు వారనుటకు వీలులేదు. మఱియు, క్షత్రియాదులకు నది సంభవము కావచ్చు ను. కాబట్టి సత్యమును భాషించెను గనుక బ్రాహ్మణవంశజుడను సిద్ధాంత ము తప్పుకాదా?

సమాధానము:—ఇది యీకాలపుమాట. సౌజన్యమిప్పటికంటె నా కాలమందు బ్రాహ్మణుల కెక్కువగా నుండియుండును. మఱియు, సామా న్య మనుష్యులకిట్టి యనుమానము (Inferncee) ఒకప్పుడు తప్పినను, ఆర్ష జ్ఞానముగల గౌతమాదులకు తప్పియుండదు. మనవిషయములో నొక సిద్ధాం తమును సాధింపలేని లింగములు ఆర్షజ్ఞానముగల గౌతమాదులకును సహాయ

ఘాతములు కావని నడువుట యుక్తముగాదు.

కాబట్టి జాబాలుడు జారజుడుకాడు. గుణమునుబట్టివర్ణముకాదు.

పూర్వపక్షము:—ఒకకుటుంబమందే యొకరు పింఛవిసరుచుండి నట్లును, మరికొందరు మరికొన్ని వృత్తులను ప్రత్యేకము ప్రత్యేకమవలంబించి యున్నట్లును వేదమునందొకచోట వర్ణింపబడుచున్నది. కాబట్టి వృత్తిభేదముచే జాతిభేదము నంగీకరింపవలెను.

సిద్ధాంతము:—కాదు. ఏలన నవిప్రత్యేకము జీవనోపాధికయిన వృత్తులుకావు. క్రతుసమయమున వలయుసామగ్రిని చేర్చుటయే యిందువర్ణింపబడుచున్నది. పురోడాశము మొదలయినవి చేయుటను చూచినచో, నిట్టి భ్రాంతికి మనప్రతిపక్షులులో బడియుండరు. మఱియు, వృత్తులవలన వర్ణములువచ్చినవని యీసందర్భమున నెచ్చటనుజెప్పబడుట లేదుకదా. కాబట్టి వృత్తులవలన వర్ణభేదమనివేదాభిప్రాయమెట్లు కాగలదు. మఱియు, నీకాలమునందు మాత్రమొక కుటుంబమందే కొందరటుకులు దంపుటమొదలయినపనులు చేయువారులేరా? వారందరునన్ని వర్ణములవారా? వేదమందలి యీ యుదాహృతకథయందు మాత్రమేమిమివైలక్షణ్యమున్నది? కానవేదము ప్రతిపక్షులకెంతమాత్రము నవకాశమివ్వదు.

నవనాగరికులు మాటాడినచో వేదమునందున్నదాయని యాక్షేపింతురు. ఏమియాశ్చర్యము! వేదమునందు జెప్పబడిన కర్మకలాపంబున నుష్ఠించుటకు వీరిష్టపడుదురా? ఈమాయవేషములు చాలును-

—:ఏకకంఠ్యము:—

వైశేషికాది దర్శనములన్నియు నైకకంఠ్యముగా వర్ణవ్యవస్థ నంగీకరించుచున్నవి. ఏలన శ్రీప్రశస్తపాదభాష్యమున (ధర్మః...వర్ణాశ్రమిణాం ప్రతిని యతసాధననిమిత్తః...బ్రాహ్మణక్షత్రియ వైశ్యానామిజ్యాధ్యయనదానాని, బ్రాహ్మణస్యవిశిష్టాని ప్రతిగ్రహాధ్యాపన యాజనాని, స్వవర్ణవిహితాశ్చ సంస్కారాః...) అని గుణగ్రంథ మందున్నది. ఇదివైశేషికదర్శనము.

తర్క సంగ్రహము (వాక్యంద్వివిధం। వైదికంలౌకికంచ। వైదికమీశ్వరోక్తత్వాత్సర్వమేవ ప్రమాణం—52) తర్కసంగ్రహదీపిక .:(మన్వాదిస్మృతీనామాచారాణాంచ వేదమూలకతయాప్రామాణ్యం) దీనినిబట్టి శ్రుతులకును మనుస్మృతి మొదలయినవానికి ప్రామాణ్యము న్యాయదర్శన మంగీకరించినట్లు స్పష్టమేకదా. శ్రుతిస్మృతులందు వర్ణాశ్రమధర్మములు విహితములు. కాబట్టి న్యాయదర్శనము వర్ణాశ్రమములను సమ్మతించుచున్నదని సిద్ధాంతము. కాబట్టియే తర్కకౌముదియందు (విహితక్రియా సాధ్యోధర్మః, నిషిద్ధక్రియాసాధ్యః అధర్మః) అనియున్నది.

పూర్వమీమాంసాధి కరణమాల "వైదికైః స్మర్యమాణత్వాత్ స్వసంభావ్యా వేదమూలతా। విప్రకీర్ణార్థసంక్షేపాత్సార్థత్వాదస్తిమానతా॥) (విమతాస్మృతిర్వేదమూలా, వైదిక మన్వాది ప్రణీతస్మృతిత్వాత్...తస్మాద్దియంస్మృతిర్ధర్మే ప్రమాణం—విస్తరము) (+ అ 1. పా 3. సూ 1, 2)మన్వాదిస్మృతులు వేదమూలకములు కావనుటనిర్మూలము.

మఱియు, వృత్తిచేతనే వర్ణమేని, రాజ్యముసంపాదించిన బ్రాహ్మణపుత్రుని క్షత్రియుడనవలసి యుండును; క్షత్రియుడుగనుక రాజసూయమున కధికారియనవలసి యుండును. కాని యధికారములేదని పూర్వమీమాంసనిర్ణయించి యున్నది. క్షత్రియపుత్రునకు మాత్రమే యధికారమున్నదని నిష్కర్షించిచెప్పుచున్నది. కాబట్టి వృత్తిచేతవర్ణము కాదు.

బ్రాహ్మణులకు మాత్రమే ఆర్త్విజ్యాధికారమనియు, సత్రయాగమందధికారమనియు, శూద్రునకు యాగాధికారమేలేదనియు నీమొదలయిన సంగతులధికరణములందు ప్రత్యేకము నిర్ధారితములు.

ఇక సాంఖ్యతత్వకౌముదియందు (తచ్చస్వతః ప్రమాణం, అపౌరుషేయవేదవాక్య జనితత్వేనసకలదోష శంకావినిర్ముక్తేత్యుక్తంభవతి. ఏవంవేదమూలస్మృతీతి హాసపురాణవాక్య జనితమపిజ్ఞానం యుక్తంభవతి) అనియున్నది. ఇతిహాసపురాణాదులకుగూడ ప్రామాణ్యమంగీకరింప బడుచున్నది

వేదమూలకములుగనుక.

ఇక పాతంజలదర్శనమున (ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని) అనియున్నది. వ్యాసభాష్యమున బురాణములనుండి వచనములు ప్రమాణముగా బ్రదర్శింపబడుచునే యున్నవి.

ఇక వేదాంతదర్శనమున నపశూద్రాధికరణమున శంకరరామానుజమధ్వాదులందరు నైకకంఠ్యముగా సమర్థించియే యున్నారు. మఱియు, స్మృతిప్రామాణ్యము బ్రహ్మసూత్రములే శిరసావహించుచున్నవి.

మఱియు, భక్తిదర్శనమున (లోకవేదేషు తదనుకూలాచరణం తద్విరోధిషూదాసీనతా—సూత్రము 11) (భవన్నిశ్చయ దార్ఢ్యాదూర్ధ్వం శాస్త్రరక్షణం—నారదభక్తిసూత్రములు—12) భక్తిదృఢపడేవరకు శ్రుతిస్మృతిమర్యాదల నతిక్రమించగూడదని తాత్పర్యము. భగవద్గీతలు నిట్లే చెప్పుచున్నవి.

భగవద్గీతలు బ్రహ్మసూత్రములను శిరసావహించుచున్నవి. ఏలన "బ్రహ్మసూత్రపదైశ్చైవ" (అ 13.శ్లో 4)అనినుడువుచున్నవి. అటులనే "ఛందోభిః" అనుటవలన వేదమును.

వేదముమనువు వాక్యములకు ప్రామాణ్యమొప్పుకొను చున్నదని శంకరాచార్యులే శారీరకభాష్యమున నుడివియున్నారుకదా. (భవతిచఅన్యామనోః మాహాత్మ్యం ప్రఖ్యాపయన్తీశ్రుతిః—"యద్వైకించమనురవదత్ తద్భేషజం"—తైత్తిరీయసంహిత) (అ 2. పా 1. సూ 1)

మఱియు, నితరస్మృతికారు లనేకులు మనుస్మృతిని గౌరవించుచునేయున్నారు.

మఱియు, తత్త్వమసిమహావాక్యమేయుపనిషత్తునందు జంద్రబింబంబు భాతివెలుంగుచున్నదో, అట్టిఛాందోగ్యోపనిషత్తునందు (ఇతిహాసపురాణంపంచమం 'వేదం') అనిభారతము పంచమవేదముగా బరిగణింపబడుచున్నదికదా. ఇందుకుభాష్యము "...వేదశబ్దస్య ప్రకృతత్వాత్, ఇ.

ఇతిహాసపురాణం పంచమంవేదం. వేదానాం=భారత పంచమానాం...”
(అ 7. ఖండము 1)

అంతేకాదు. ఈయుపనిషత్తే (తద్యఇహరమణీయ చరణాఅభ్యాశో హాయత్తేరమణీయాం యోనిమాపద్యేర న్బ్రాహ్మణయోనింవా, క్షత్రియయోనింవా, వైశ్యయోనింవా, అథయఇహకపూయచరణా అభ్యాశోహాయత్తేకపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనింవా, సూకరయోనింవా, చండాలయోనింవా) (ఈజన్మమునందు పుణ్యాచరణగలవారు శీఘ్రమేరమణీయయోనియందుజన్మింతురు—బ్రాహ్మణయోనిగాని, క్షత్రియయోనిగాని, వైశ్యయోనిగాని, ఈజన్మమునందు దుష్టాచరణగలవారు జుగుప్సితయోనిని పొందుదురు—శ్వయోనిగాని, సూకరయోనిగాని, చండాలయోనిగాని.—అ 5. 10. 7) ఈజన్మమునందలి గుణములచేతనే, యీజన్మమునందే బ్రాహ్మణాది వర్ణములు కల్గునన్నపక్షమున, బ్రాహ్మణాదియోనులందు జన్మింతురు అనునీయుపనిషద్వాక్యమున కవకాశముండనేరదు కదా. చదువరు లీవిషయమును బాగుగావిమర్శింతురుగాక. ఉపనిషద్వాక్యములను స్మృతివాక్యములను త్రోసివేయునట్లు త్రోసివేయుటకు శక్యముగాదు. ఈప్రమాణమొక్కటియే నాపక్షమునకు జాలును! మఱియు, జండాలురెచ్చటినుండి వచ్చిరనుశంకకును, ఈవచనమేసమాధానము.

మఱియు, జాబాలోపనిషత్తునందు “ అయజ్ఞోపవీతీకథం బ్రాహ్మణః ” (జన్నిదములేని వాడెట్లుబ్రాహ్మణుడు?) అనియున్నది. కర్మమార్గమునందున్న బ్రాహ్మణాదులకుయజ్ఞోపవీతాదులుండవలెననియు,సంన్యాసికక్కరలేదనియు భావము. జన్నిదములు తీసినమొద్దులు బ్రహ్మవేత్తలా?

ఒకపురాణమును మఱియొకపురాణము స్తుతించుచున్నది. కాబట్టియే పురాణములలో వర్ణపద్ధతి ప్రతిపాదింపబడినను, తదితరపురాణములును ఆ సిద్ధాంతమును శిరసావహించుచున్నవనియే గ్రహింపవలసియున్నది.

ఇక బాణినిదర్శనము మాటయేమనగా, నదివర్ణపద్ధతి నంగీకరించుచు

న్నది- ఏలనవ్యాకరణము వేదాంగము; దానిప్రధానోద్దేశము వేదార్థగ్రహణమునందు సహాయభూతమగుటయే. కాబట్టి వేదప్రామాణ్యము నంగీకరించుచున్నదిగాన వేదోదితవర్ణవ్యవస్థ నంగీకరించుచున్నదనియే తేలుచున్నది. ఇంతయేల, వామాచారపరములుగాని సమస్తేతర దర్శనములును వేదప్రామాణ్యము నంగీకరించుచునే యున్నవి. (బౌద్ధాదిమతములు వేదబాహ్యములు. కాని, జైనులందొక విధముగా వర్ణభేదమున్నది.)

స్మృతులు వేదమూలకములని పూర్వమీమాంస మొదలయిన దర్శనముల మూలమునజూపియే యున్నానుకదా. ఉత్సన్నములయిన వేదభాగముల యభిప్రాయములు మన్వాదిస్మృతులందు సంగ్రథితములు. అటులనే యుపలభ్యమాన వేదభాగములందలి యర్థములు స్మృతిరూపముగా వ్యాఖ్యాతములు. గౌతమాదిస్మృతులన్నియు నేకగ్రీవముగా వర్ణవ్యవస్థ నంగీకరించుచున్నవని ప్రమాణముల బ్రదర్శింప నగత్యములేదు. శ్రుతిస్మృతులకు సంబంధమును వ్యక్తీకరించు నొకవచనమును మాత్రముదాహరించి గ్రంథవిస్తరభయముచే విరమించెదను. రఘువంశమహాకావ్యమున మహాకవికాళిదాసు " మార్గంమనుష్యేశ్వర ధర్మపత్నీశ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్ " (యథా స్మృతిః శ్రుతిక్షుణ్ణమేవార్థమనుసరతితథాసాపిగోఖురక్షుణ్ణమేవ మార్గమనుససార, ఇత్యర్థః—శ్రీమల్లినాథకృతవ్యాఖ్యా— స 2. శ్లో 2) (స్మృతి శ్రుతిత్రొక్కిన మార్గమేయనుసరించు చందమున రాజుభార్యయు గోవుడెక్కలత్రొక్కిన నల్లినమార్గమునే యనుసరించెను.

మఱియు, పురాణాదిస్మృతులు ప్రతిపక్షమునంగీకరించినట్లు కొన్నిచోట్లనున్నదందురేమో, ఉన్నదన్నను, వేదవిరుద్ధముగాన, దత్సిద్ధాంతము పరిత్యాజ్యము.

పూర్వపక్షము:—పురాణాదులందు బరాశరాదులు శూద్రాదిస్త్రీల వలన వ్యాసాదులగనిరని నుడువబడుచున్నది. కాన జాతిభేదముబుషిమతముకాదు,

సిద్ధాంతము:—అనుష్ఠితంతుయద్దేవైర్మునిభిర్య దనుష్ఠితం। నానుష్ఠేయంమనుష్యైస్తదుక్తం కర్మసమాచరేత్ " (దేవతలచే నెద్దియనుష్ఠింపబడెనో, మునులచే నెద్దియనుష్ఠింపబడెనో, అదిమనుష్యులచే ననుష్ఠింపబడ నర్హము కాదు. వారుబోధించిన ధర్మములనే యాచరింపవలెను.) బోధాయనాది స్మృతికారులిట్టి యభిప్రాయము గల్గియున్నారు- తైత్తిరీయోపని షద్దీపిక లో శ్రీవిద్యారణ్యులు ' పరశురాముడు తండ్రియాజ్ఞ శిరసావహించెను, తల్లినిచంపెను. వీనిలోమంచిదైనపితృవాక్యపరిపాలనము మనమవలంబించి,చెడ్డదైన మాతృహత్యజేయుటమానవలెను' అనిలిఖించియున్నారు. మఱియు బురాణములలోని కథాంశములన్నియు నిజముగాజరిగినవికావు. కొన్నిమాత్రమేయట్టివి; మఱికొన్ని నీతినిబోధించుటకు గల్పింపబడినవి. కాని, యన్నిటి యుద్దేశమును నీతినిబోధించుటయే. ఎట్లన బరాశరాదులు నిమేషమాత్రము మయిమరచి యుండుటచేత గామాదులకులోనైరి, కాబట్టి మనమునుజాగ్రత్తవహించవలెను—అనినీతి. మఱియు, గుంభసంభవాదికథ లూర్ధ్వరేతస్కుల యమోఘవీర్యవత్త్వము బ్రకటించుటకు.

కాబట్టి వివిధప్రమాణము లైకకంఠ్యముతో వర్ణమొప్పుచున్నవని సిద్ధాంతము.

—:జాతిసామరస్యము:—

పూర్వపక్షము:—శూద్రాదులకు వేదాధికారము నిషేధింపబడుచున్నది కాబట్టివారికి దరణోపాయములేదు. బ్రాహ్మణాదులుమాత్రమే యుట్టిగట్టుకొనిస్వర్గమునకు బోవువారు,కాబట్టిశూద్రాదులు శీఘ్రమేహిందూమతమును విసర్జించుటమంచిది.

సిద్ధాంతము:—కాదు. ఏలన, వేదాధికారములేకపోయినను, ఇతిహాసపురాణాదులందధికారము లేకపోలేదు, శ్రీమచ్ఛంకరాచార్యులు అపశూద్రాధికరణమునందు వ్రాసివ్రాసితుదకేమని సిద్ధాంతీకరించెనోచూడుడు ("శ్రావయేచ్చతురోవర్ణాన్" ఇతిచే తిహాసపురాణాధి గమేచాతుర్వర్ణ్యస్యా

ధికారస్మరణాత్ । వేదపూర్వకస్తునాస్త్యధికారః, శూద్రాణామితిస్థితం) వేదమంత్రములతో మాత్రమధికారము లేదు. మహాభారతాదులందు వేదార్థములు సులభశైలిని ప్రతిపాదింపబడుచున్నవి. వ్యాకరణాది షడంగములతోగాని యొకపఙ్క్తియయినను గ్రహించుటకు శక్యముగానివేదారణ్యముప్రవేశించి క్లేశము జెందుకంటె, సమస్తధర్మములను కరతలామలకముగా జేయుచున్న భారతాది గ్రంథములతో త్రైవర్ణికేతరులు సంతోషించి తరించుట శ్రేయస్కరముకాదా ? వేదాధికారములేదని విచారించుటయేకాని వేదాధ్యయనాది క్లేశములెట్టివో యొకింతయు నాలోచింపనివారు కొందఱున్నారు. అట్టియాలోచన గల్గినచో, దమకు వేదములేదని దుఃఖింపరు ; వేదాధికారము నిషేధించిరని బ్రాహ్మణులను నిందించరు. వేదమహార్ణవము నతికష్టముతో మథించి ధర్మామృతమును పురాణభాండములందునింపి యొసంగిన వ్యాసాదిబ్రాహ్మణోత్తములకు గృతజ్ఞులౌటకు మారుగా గృతఘ్నులగుట యెంతయుశోచనీయము.

అష్టాదశమహాపురాణములు నష్టాదశోపపురాణములును భారతరామాయణప్రభృతి గ్రంథములు నజ్ఞానధ్వాంతవిధ్వంసనద్యుమణి సరణినిభారతవర్ణంబునబరిఢ విల్లుచున్నది. అభ్యుదయనిశ్శ్రేయసవాంఛగలశ్రద్ధాయుక్తులకుబురాణోక్తపద్ధతులు ఫలసాధకములగుట సందిగ్ధముగాదు. సూతవిదురాదిపురుషధౌరేయులు స్వారాజ్యసౌధాగ్రములనుండి సంసారతరణోపాయమునులోకమునకంతకును ప్రదర్శించుటలేదా ?

శంక:—వేదమంత్రములు శూద్రులకేల నష్టముచేయును ?

సమాధానము:—శూద్రోపాధియందును దగినస్థితిలో లేదుకాబట్టి, వీణయొక్క తంతువులలో నొక్కొక్క తంతువున కొక్కొక్క స్వరముగల్పింప శక్తియున్నది. అనుదాత్తస్వరమునకు శక్తిగల తంతువుచే నుదాత్తస్వర ముత్పాదింప యత్నించినపక్షమున, శీఘ్రముగానే వీణవితంతువగును ! అటులనే, త్రైవర్ణికోపాధి శక్యములయిన వైదికస్వరములు, త్రైవర్ణికవ్యతి

రిక్తోపాధి సాధ్యములుకాకపోవుటయే కాదు; తదభివృద్ధికి నష్టముగూడ నొదవించును. మరియు, బ్రాహ్మణాదులయినను, వేదమంత్రముల విషయమున జాగరూకులై యుండవలసియున్నది. ఏలన "మంత్రోహీనః స్వరతోవర్ణతోవా మిథ్యాప్రయుక్తోనతమర్థమాహ । సవాగ్వజ్రో యజమానంహినస్తియథేంద్రశత్రుః స్వరతోపరాధాత్" (పాణినిశిక్ష) ఇందలి 'వాగ్వజ్రః' అనునది చూడుడు. వాక్కు వజ్రాయుధమువలె జంపునట! కాబట్టి శూద్రాదులు వేదమంత్రములు లేవనిదుఃఖింప నవసరములేదు.

శంక:—"వేదానువచనేనయజ్ఞేన దానేనవివిదిషంతి" అని యాత్మను దెలిసికొనుట కుపాయములు శ్రుతి దెల్పుచున్నదికదా. వీనిలో వేదమునందును యజ్ఞమునందును శూద్రునకధికారము లేదనిసిద్ధాంతీకరించియున్నావు. ఇక శూద్రులెట్లాత్మ దెలిసికొనగలరు?

సమాధానము:—"తస్యవేదానువచనాగ్నిహోత్రాద్యసంభవేపి, కంఠోక్తసర్వవర్ణాధికార శ్రీపంచాక్షరమంత్ర రాజవిద్యాది జపపాపక్షయహేతుతపోదానపాకయజ్ఞాది సంభవాత్. 'వేదానువచనేన యజ్ఞేనదానేన' ఇత్యాదిపృథక్కారకవిభక్తిశ్రుతేః విదురాదీనాం విద్యార్థజపదానాది మాత్రానుష్ఠానానుమతేశ్చ వేదానువచనాది సముచ్చయానపేక్షణాత్।" (శూద్రునకు వేదానువచనాదులు లేకపోయినప్పటికి, సర్వవర్ణములవారికి నధికారము వేనియందున్నదని కంఠోక్తిగా శాస్త్రమునందు జెప్పబడుచున్నదో, అట్టి శ్రీపంచాక్షరమంత్రాదులను జపించుట, పాపక్షయహేతుభూతంబులయిన తపోదానభగవన్నామకీర్తన తీర్థస్నానాదులను నిర్వర్తించుట మొదలయిన క్రియలు శూద్రులకు నుండవచ్చునుకాబట్టి, శూద్రునకును జ్ఞానము నిమిత్తమై కర్మాధికారమున్నది. మఱియు, 'వేదానువచనముచేతను, యజ్ఞముచేతను, దానముచేతను' అని ప్రత్యేకించి ప్రత్యేకించి వచింపబడుచున్నది కాబట్టియు, విదురాదులకు జ్ఞానార్థము జపదానాది మాత్రానుష్ఠానము చాలునని సమ్మతింపబడుచున్నది కాబట్టియు, జపదానాదులతో వేదానువచనాదులుకూడ నవ

శ్యముగానుండ నక్కరలేదు. వేదానువచన మెట్లువిద్యాసాధనమో, దానము నట్లే. తీర్థస్నానాదులునట్లే జ్ఞానసాధనములని తాత్పర్యము) అనియద్వైత విద్యాధురంధరులయిన శ్రీమదప్పయ దీక్షితులువిరచించిన సిద్ధాంతలేశ సంగ్రహమున లిఖింపబడినది.

శంక:—“ నశూద్రాయమతింద ద్యాత్ ” శూద్రునకు జ్ఞానమునివ్వ గూడదు) అని స్మృతిచెప్పుచున్నది కదా. శూద్రులెట్లుతరించగలరు?

సమాధానము:—భయపడవద్దు! భయపడవద్దు! (నభేతవ్యం! నభేతవ్యం!) ఇక్కడ, జ్ఞానమనగా శ్రుత్యుక్తయజ్ఞాది సంబంధమయిన జ్ఞానము. ఇట్టివిద్య త్రైవర్ణికేతరుల కవసరములేదు కాబట్టి చెప్పనవసరములేదు. వారికవసరమయిన జ్ఞానము పురాణాదుల మూలమున నొసంగబడుచునే యున్నది. లేదనుట ప్రత్యక్షవిరుద్ధము. జ్ఞానమొసంగబడుట లేదందురేని, శూద్రులకు సత్యశౌచాదులుండవలెననియు, శ్రాద్ధాదులు యథోక్తముగా నిర్వర్తింపవలెననియు జెప్పుస్మృతివాక్యముల నెట్లు సమర్థించగలరు? శూద్రులకు ధర్మోపదేశము జేయగూడదన్నపక్షమున, స్వవర్ణధర్మములయినను తెలిసికొనన వకాశముండదు కాబట్టి, శాస్త్రవిహితధర్మముల నుష్ఠించుటకు వీలులేకపోవును. వీలులేకపోవుటచేత, తద్ధర్మవిభాజక వచనములకు వైయర్థ్యము ప్రాప్తించును. కాబట్టి శ్రీమదప్పయ దీక్షితులిట్లానతిచ్చి యున్నారు (‘ నశూద్రాయమతింద ద్యాత్ ’ ఇతిస్మృతేశ్చ తదనుష్ఠానానుపయోగిఅగ్నిహోత్రాది కర్మజ్ఞానదాన నిషేధపరత్వాత్। అన్యథాతస్యస్వవర్ణధర్మస్యాపి అవగత్యుపాయాసంభవేన ‘ శూద్రః చతుర్థోవర్ణః...ఇత్యాదితద్ధర్మవిభాజకవచనానా మనుష్ఠానలక్షణాప్రామాణ్యాపత్తేః।) అటులనే, శ్రీదీక్షితులు (తస్యవేదాంతశ్రవణాధి కారాభావేపి, భగవత్పాదైః...అపశూద్రాధికరణోప సంహారభాష్యే,బ్రహ్మైక్యపర పురాణాది శ్రవణేవిద్యాసాధనే అధికారస్య దర్శితత్వాత్) (శూద్రునకు వేదాంత శ్రవణాధికారము లేక పోయినను విద్యాసాధనంబగు బ్రహ్మైక్య బోధక

పురాణాదిశ్రవణమం దధికారమున్నదని, యపశూద్రాధి కరణముయొక్క తుదిభాష్యమునందు శంకరభగవత్పాదులచే జూపబడుచున్నది) (సిద్ధాంతలేశసంగ్రహ—తృతీయపరిచ్ఛేదము) అనిస్పష్టముగా వ్రాసియున్నారు. వేదాంతాధికారము లేదనినతోడనే భయపడవద్దు. ఏలన, నుపనిషత్తులు వేదాంతములనబడును; అవియు వైదికమంత్రములతో గూడినవేదభాగములే కాబట్టి, వేదమునిషేధింప బడినప్పుడవియు నిషేధింపబడుచున్నవి. జ్ఞానమునందే, యధికారములేదని కాదు. పురాణాదిగతజ్ఞానము నందధికారమున్నదని శ్రీదీక్షితులవచనము వల్లనేవ్యక్తమగుచున్నది. ఉపనిషత్తులందలి రహస్యములన్నియు గ్రోడీకరింపబడి, శ్లోకరూపకముగా భాగవతాదిపురాణములందు బ్రకటింపబడుచున్నవి. దశమస్కంధములోని యొక్క శ్లోకముపదియు పనిషత్తులతో దుల్యము.

మఱియు, బూర్వపుణ్యవశమున శూద్రాదుల కెవ్వరికయిన జ్ఞానసంపాదన మందభినివేశము గల్గినపక్షమున, జ్ఞానోపదేశము చేయుసద్గురువులెప్పుడును సిద్ధముగానే యున్నారు. జ్ఞానసంపాదనమునకు నరిషడ్వర్గమాటంక పెట్టునేమోకాని శాస్త్రమెంతమాత్రము నడ్డమురాజాలదు. కాబట్టియే శంకరాచార్యులిట్లు నుడివియున్నారు (యేషాంపునః పూర్వకృతసంస్కారవశాత్ విదురధర్మవ్యాధ ప్రభృతీనాం జ్ఞానోత్పత్తిః, తేషాంనశక్యతే ఫలప్రాప్తిః ప్రతిషేద్ధుం, జ్ఞానస్యైకాంతిక ఫలత్వాత్) (పూర్వజన్మసుకృతసంస్కారమువలన, నేవిదురధర్మ వ్యాధాదులకు జ్ఞానోత్పత్తి సంభవించెనో, అట్టివారికి ఫలప్రాప్తిలేదనుటకు శక్యముగాదు; ఏలన జ్ఞానమున్నపక్షమున, దత్ఫలముండితీరును—శారీరకభాష్యము)

శంక:—శూద్రాదుల కుపనయనాద్యభావము వలన బ్రత్యవాయము లేదా?

సమాధానము:—“ నశూద్రేపాతకంకించిత్ ...” పాపములేదు. ఇకనొకరహస్యము. ఏదియన, శూద్రాదులకు పనిషదధికారమేల్లలేదే

దో, బ్రాహ్మణాదులకును బాహుళ్యముగా నధికారములేదు. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగాది సాధనచతుష్టయ సంపన్నులకుమాత్రమే బ్రహ్మజిజ్ఞాసార్హత. పరమహంస సంన్యాసులకే బ్రహ్మవిద్యయందు ముఖ్యాధికారమని శాస్త్రమునిర్ణయించుచున్నది. కాబట్టి బ్రాహ్మణాదులు వేదాధికారమున్నదని విఱ్ఱవీగనక్కఱలేదు. త్రైవర్ణికేతరులు తమకులేదని దుఃఖింపనవసరము లేదు. ఏలన బ్రహ్మవిద్యాధికార విషయమున, నొకరినొకరాక్షేపించుకొనవసరములేదు—వీరికినధికారమునున్న, వారికినిసున్నదియే! ఇక బ్రాహ్మణ పక్షపాతమెక్కడ?

మఱియు, వేదమునందుశూద్రాదుల కధికారము లేకపోయినప్పటికి భక్తిమార్గమునందు లేదనియెవ్వరునుచెప్పసాహింపరు. ఏలననారదభక్తిసూత్రములందు" నాస్తి తేషుజాతివిద్యారూపకుల ధనక్రియాది భేదః-72" (భక్తులందు జాతివిద్యాదిభేదములేదు.) కర్మకాండ జ్ఞానకాండలకు జాతివిద్యాదినియము లున్నవి భక్తిమార్గమునకందఱు నధికారులే" సాతుకర్మజ్ఞానయోగేభ్యోప్యధికతరా - 25 - )"పత్రంపుష్పం-"(నకేవలంమద్భక్తానామనావృత్తిలక్షణమన న్తఫలం సుఖారాధనశ్చాహం - శాంకరగీతాభాష్యం- అ 9. శ్లో26) కర్మమార్గమందువలె వ్యయప్రయాసములక్కఱలేదు. జ్ఞానమార్గమందు వలె మొదటినుండియు సర్వసంగపరిత్యాగ మక్కఱలేదు. "క్లేశోధికతరః" (అ 12. శ్లో 5) "మయ్యావేశ్య...యుక్తతమాఃమతాః" (అ 12. శ్లో 2) 'మన్మనాభవ..." (ఏవంభగవతః సత్యప్రతిజ్ఞత్వంబుధ్వా, భగవద్భక్తేరవశ్యం భావిమోక్షఫలమవధార్య, భగవచ్ఛరణైక పరాయణోభవేదితివాక్యార్థః—భాష్యము-అ 18. శ్లో 65) ఇట్లుభగవంతుని ప్రతిజ్ఞసత్యమనినమ్మి, భగవద్భక్తికి దప్పకమోక్షము ఫలమగునని నిశ్చయించుకొని, భగవచ్ఛరణైక పరాయణుండుకావలెను, అనివాక్యార్థము) చూచితిరా, జ్ఞానియైన శంకరాచార్యుడుకూడ నేమనుచున్నాడో? "నమేభక్తః ప్రణశ్యతి" అనిగీతలందు భగవంతుడు ప్రతిజ్ఞచేయుచున్నాడు. "నవాసుదేవ భక్తానామశుభం

విద్యతేక్వచిత్'' అనిశాస్త్రముకకాంక్షించుచున్నది. "పాపీయసామపిత్రతా ధికారోస్తీతి సూచయతి'' (అ 9. శ్లో 30—ఆనందగిరివ్యాఖ్య)

మఱియు, నుపనిషత్తులు మొదలయినవి పఠించకపోయినప్పటికి, భగవత్ప్రసాదము సంపాదించితిమేనితత్త్వము కరతలామలకమగును. లోకగురువయిన భగవంతుడుస్వయముగా దత్త్వరహస్యము నుపదేశించును. "తేషాంసతతయుక్తానాంభజతాంప్రీతిపూర్వకం। దదామిబుద్ధియోగంతంయేన మాముపయాన్తితే" (గీత-అ 10- శ్లో 10)"జ్ఞానదీపేన" (అ 10. శ్లో11) భక్త్యామామభిజానాతి" (అ 18. శ్లో 55) శ్వేతాశ్వతరోపనిషత్తునందు "యస్యదేవే పరాభక్తిర్యథా దేవేతథాగురౌ! తస్యైతేకథితాహ్యర్థాఃప్రకాశన్తేమహాత్మనః" "గురుదైవత భక్తానాం సర్వోయం సులభోజవాత్" అని యపరోక్షానుభూతి. తైత్తిరీయోపనిషత్తు, శిక్షావల్లియందు, ఈశ్వరోపాసనమువలన దత్త్వసాక్షాత్కారమగునని ప్రతిపాదింపబడినది.

ఇంతయేల? పరమపావనుండయిన శ్రీరామకృష్ణపరమహంసదేవుని చరిత్ర బరికించినచో నీవిషయముల సత్యము బోధపడును. ఈతడు విద్యనేర్చినవాడు కాకపోయినను, భక్తిమహిమచే నీశ్వరప్రసాదమువలన వేదాంతరహస్యముల దెలిసికొన్నవాడాయెను. ఇట్టి నిదర్శనములను బట్టిచూడ, శూద్రాదులకు వేదమునందధికారము లేకపోయినను, భక్తిమార్గముద్వారా వేదాంతవిషయముల నెరింగి తరించుట కవకాశమున్నదని సిద్ధాంతము. కాబట్టియే శ్రీశంకరాచార్యులు శివానందలహరి యందు "వనచరో భక్తావతంసాయతే'' యనియు "శంభోలోకగురో మదీయమనసః సౌఖ్యోపదేశంకురు'' అనియు నుడివియున్నారు-

శంక:—గౌతమాదిస్మృతులందు త్రైవర్ణికేతరులు వేదముచ్చరించిన చో, జిహ్వాచ్ఛేదము మొదలయిన దండనము చెప్పబడియున్నది. ఆహా! ఎంతకాఠిన్యము!

సమాధానము:— ఇట వేదమందు నిరుత్సాహము గల్గించుటకేకాని

వేరు కాదు. పాదప్రక్షాళనము చేయక పోయినచో శాశ్వతనరకమన్న పక్ష
మున, నభిప్రాయమేమి? మంచిని మిక్కిలి స్తుతించుటయు చెడ్డను మిక్కిలి
దూషించుటయు గొన్ని పుస్తకములవలంబించిన ప్రక్రియ. "వ్రతానాముత్త
మోత్తమం" మొదలయినవి వాడుకలోనున్న వే.

కొందరు దుష్టులు, ఇతరజాతులవారి వద్దధనము మొదలయినవిసంగ్ర
హించుట కుపాయములుగా వర్ణాశ్రమ భేదాదులను బ్రాహ్మణులుకల్పించిర
నిప్రలపించుచున్నారు. ఇదిసత్యముకాదు. సత్యమేయంటిమేని, బ్రాహ్మ
ణులకితరవర్ణములవారికంటె క్లేశావహంబులయిన కర్మలవిధించుకొనుటకుకా
రణమేమిచెప్పుదము? ఇతరవర్ణముల వారిచేత గర్మలుచేయించుచు దాము
స్వేచ్ఛగా నగ్నిహోత్రాదికము లేకుండనుండవలసియుండునుకదా. కాని,
బ్రాహ్మణులకే బాధలధికములు. కాన, పైవాదముతప్పు.

మఱియు, సూతుడుమునులకు బురాణములుపదేశించె ననుటయందు
విశేషమున్నది. బ్రాహ్మణులుద్రోహులా?

మఱియు హిందూదేశమందలి ప్రజలలో బ్రాహ్మణులు భాగ్యవంతు
లుకారేమి? వైశ్యాదులేయైశ్వర్యము ననుభవించుచున్నారుగదా. దుష్టప్రవృ
త్తియే బ్రాహ్మణులను ప్రేరేపించుచుండిన పక్షమున, దారిద్ర్యమనుభవించు
చుండుట కవకాశముండనేరదు.

మఱియు, చాణక్యుడు చంద్రగుప్తునకు రాజ్యమిప్పించెను; యుగంధ
రుడు ప్రతాపరుద్రుని రక్షించెను. విద్యారణ్యుడు బుక్కమహీపాలుని, రా
జ్యమువృద్ధిజేసెను. తిక్కనసోమయాజి మనుమసిద్ధికి గుడిభుజముగానుండెను.
ఇట్టిదృష్టాంతము లనేకములున్నవి.

కొందఱుమూఢులు బుద్ధుడు వర్ణభేదమును మాన్పించుకొఱకే బౌద్ధమ
తమును స్థాపించెనని చరిత్రలందు వ్రాయుచున్నారు. ఇదియసంగతము. బు
ద్ధునిచింతవర్ణభేద మెట్లుమాన్పించవలెనని? కాదు, ప్రాణులదుఃఖమునెట్లురూ
పుమాపవలెనని. తనశయనగృహమునుండి రాత్రినేకాంతముగా నిర్గమించు

